# తొలి పలుకు

పద్మపురాణాంతర్గతమగు, బృందాజలంధర సంబంధమగు కథను నాయూహకొలఁది, కొలఁది మార్పులతో దృశ్యకావ్యముగఁ జిత్రించి రసికలోకమునకు సమర్పించు కొనుచున్నాను. దీనిని సంకల్పించుటకు హేతువు నా యనుంగుచెలికాని ప్రేరణయే. ఆతఁడు చలన చిత్ర ప్రపంచమునఁ బరిచయవంతుఁ డగుట నీకథను దాని కను వగునటుల వ్రాయవలసినదిగ నన్నుఁ గోరియుండెను. అయిదారు సంవత్సరముల క్రిందటనే నేను వ్రాసితిని. కొంచెము విలంబముగ నీ ప్రయత్నము కొనసాగు నంతలో నిదే కథను మఱియొక ఫిలిం కంపెనీవారు తీయుటచే నా మిత్రుని ప్రయత్న ముపసంహరింపఁబడెను. కాని నాచేసిన కృషిని వీగి పోనీయుట కిచ్ఛగింపక దానికి మఱికొంత సంస్కార మొనర్చి ప్రకాశింప నుద్యమించితిని.

ఇయ్యది పురాణకథ గావున, కథయందు లోపము గణింప వీలులేక పోయినను, రస నిష్పాదనకై నే నొనర్చిన మార్పులయందు భ్రమప్రమాదాది జన్య దోషములున్నచో వాని రసాస్వాదన పారీణులగు సహృదయులు మన్నించి, సహేతుకములగు పరివర్తనములను సూచించుచో వాని నే శిరసావహించెదను. నా యీ గ్రంథము యొక్క చిట్టచివర సవరణలకుఁ దోడ్పడి నాకుత్సాహమును గలిగించి నా యుద్యమమును మిక్కిలి ప్రోత్సహించిన నా చిరమిత్రులును, మహామేధానిధులును, కవితావిశారదులును, కర్నూలు మునిసిపల్ హైస్కూలు పండితులు నగు, బ్రా॥ మేడవరపు రామబ్రహ్మ శాస్త్రులుగారి కెంతయు కృతజ్ఞతాపూర్వక వినతిశతము లర్పించుకొనుచున్నాను.

ఈనాటకము నంతయు దయతోఁ బరిశీలించి దీనికిఁ బీఠబంధము నను గ్రహించిన తెనాలి సంస్కృత కలాశాలోపాధ్యక్షులును, సాహిత్యాలంకార భాషాశాస్త్రాధ్యాపకులును నగు బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామశర్మ గారికిని దీనిపై నభిప్రాయముల నొసంగిన, కళాప్రపూర్ణ, కావ్య స్మృతి తీర్థ, జనమంచి శేషాద్రిశర్మగారు, (కడప) మొదలగు పండితవర్యులకును రసికశేఖరులకును మనఃపూర్వక నమస్కారము లొనర్చుచు మా పోషకమహాశయుల నెల్లర దయతో నీ గ్రంథము నందుకొని నాయుద్యమమును మిక్కిలి యభివృద్ధి నొనరింప బ్రార్థించుచున్నాను.

ఇట్లు విబుధ విధేయుఁడు,

శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి.

శ్రీ ర్జయతు

# పీఠబంధము



భారత ధార్మిక సాహిత్యవని విహార మొనర్చు భావుకులకు శ్రీ సచ్చిదానంద శాస్త్రిగారి బృందలోని పవిత్రతేజమును దర్శించు నధికార మున్నది. పూత శాంత దీప్తుల కలిమి శ్రీరాములవారి రచనలకు బెట్టని పునాది. సహృదయులు హృదయ సంవాదసుందరు లగుటకు నానావిధభావనాచతురమతిత్వమును సంపాదింప వల యును. అప్పటి విధవములోని సమున్మేషమును జవిచూపుట కనుత్తమ రచనలు సమ ర్థములు. స్వపరిస్పందసుందరము లగు ధర్మప్రభావవిసరములు తద్విదాహ్లాద కారులు కాగలవు. శ్రీసచ్చిదానంద ప్రతిభ ధర్మోన్ముఖమై జనత కుపకరించుట క్రొత్త కాదు. ప్రవృత్తి పథములోని ప్రాకృతిక ధర్మములం దనుబింబితమైన యాత్మ చైతన్య ధారను సారస్వతేయులచే నాస్వాదింప జేయుటకుఁ గావ్యసృష్టి సమర్థ మగుచున్నది. కావ్యము నీ విధముగ నవగాహనము చేసికొన్నపుడే జనులు ప్రాప్య మును బొందగలరు. కావ్య ప్రయోజనము లనేకములు. కర్తవ్య ప్రవృత్తి యకర్తవ్య నివృత్తి కావ్యము ద్వారముగ బోధింపబడినపుడే కవివైదుష్యము స్ఫుటమగును. అబో ధోపహతమైన, అజ్ఞానోపహతమైన, అహంతోపహతమైన జనసామాన్యమునకు ప్రకృతము ధార్మిక ప్రబోధ మపేక్షితమై యున్నది. బృంద యందులకు సమర్థము. వివేకాంధమైన యావతమునకు ధర్మదీక్ష నుద్బోధింపజేయుట యావశ్యకము. ప్రధా నముగా భారత నారీలోకము నుద్దేశించి బృంద రచింప బడినది. స్త్రీ ధర్మపరాయణు రాలయి, దైవభక్తి, పతిప్రేమ కలదైనపుడే పురుషులు ధర్మపథమున ప్రవర్తింతురు. బృంద స్త్రీల కాదర్శయువతి. శాంత దాస్య సఖ్య వాత్సల్య మాధుర్య భావములలో నైదవ భావము నైదువ బృంద ప్రధానము చేసికొనలేదు. ప్రకృతము కొంతదనుక యువతు లట్లై కావలయుట యుచితబోధ. దైవశ్రద్ధను, ధర్మాసక్తిని పతిప్రసాదమును దూరీ కరింపజేయు నేటి విధానములకిది శిక్ష. లేతపూతహృదయములలో మొలక లెత్తిన ధర్మాం కురములపోషణము భిక్షించు భిక్షుకుల కిది భిక్ష. మానవతుల మనోభావముల కిది రక్ష.

దైవ ప్రకృతిని నిరోధించి యాసుర ప్రకృతి ప్రభావము కలది యైనప్పటికిఁ బరిణామహత మగును. ఇట్టి తత్త్వము బృందలో నంతట గన్పడుచున్నది. పడమటి విపరీత భావముల నయుక్తీకృతము చేయు బృంద యాదర్శము. నేటిలోకమును దనలో బింబించుకొనినది. ఆసురమున కెన్నడు విజయము కలుగదు. దైవీప్రకాశమె చరమా స్వాద్యము. ఇట్టి యాధ్యాత్మిక విధానమునకు బృందలో లోటులేదు. అభినేయముల పై లోక మాదరము ,కలిగియున్నది. అనేకకవులా యాదగమును దుర్వినియోగ

మొనర్చు చున్నారు. శ్రీరాముల వా రీదృశరూపకముల రచించి హృదయము గల వారి సదాదరమునకు వన్నె తెచ్చుచున్నారు. నేటిలోకము విలాసితను గోరుచున్నది. విజ్ఞానము లేనివారల కది విషాసిక యగును. మే మానంద శత్రువులము కాము. అయిన నిప్పటిలో వినోద వృత్తులను దూర ముంచవలయునని కోరుదుము. స్త్రీలు బృందను జూచి బృందలు కావలయును. పురుషు లను మణిగ్రీవులు పొంచియుందురు. అయినను జలంధరులు కారాదు. యువతు లందరు బృందను భావింపవలయును. అస్మాదృశుల కందఱకు శ్రీ తులసీ తీర్థము సేయవలయును. మేము సర్వవిధముల ధర్మదీక్షను వహింతుము......బృందలో భాష లలితము. భావము ధర్మబంధురము. రంగానుకూల్యమునకు సంఘటన యటునిటు చేయబడినది. బృంద శరవిద్యా నిపుణత నిర్వాహణమున నుపకరించునదిగాఁ జేయుబడలేదు. ఇందు కవు లుత్తరవాదులు కాని శ్రీ సచ్చిదానంద శాస్త్రిగా రుత్తరవాదమునె నిరూపించినారు. నాటకభావనమున కనేక దృష్టులు కావలయును. వానిలో నిది యొకటి. "ధర్మో2–ధర్మ పరికృత్తానాం" భరతుని వచన మీ రూపకమున సార్థకమైనది. లోకము ధన్యము కావలయును. శ్రీ శాస్త్రిగారు ధన్యులు. ఈ పీఠబంధమున నధికారము పొందిన నాకును ధన్యతనిండు.

తెనాలి,
26–1–1941.

జమ్ములమడక మాధవరామశర్మ,
ఉపాధ్యక్షుడు, సంస్కృత కళాశాల.

శ్రీః

# పండిత ప్రశంసలు



## I

కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ శ్రీజనమంచి శేషాద్రి శర్మగారు

కడప 20-12-1940.

తమ రనుగ్రహించిన లలిత, బృంద అను నాటకములఁ బఠించి పరమానంద మందితిని. నాటకరచనయందు మిన్నగ నెన్నఁదగినవారు మీ రన్న తలంపు నాకెన్నటికిని మార్పు నొందదని విన్నవించువాఁడ. తమకుఁ గృతజ్ఞతఁ జూపు మార్గ మెద్ది యని యరయుచున్నాఁడను. "తథా సంసేక్తవ్యా స్మరణసలిలే నానుదివస" మ్మను సూక్తి తారకముగాఁ గనఁబడుచున్నది. తమ కవిత్వము నిరుపమని రసధుని యని యభిప్రాయ మీయ నేనెంతవాఁడను. చిత్తగించవలయు. జ. శే. శర్మ.

## II

శ్రీ మహావాగ్దేవ్యైనమః.

### శ్రీరామకుల్య శ్రీ సచ్చిదానన్దశాస్త్రికృత ప్రబన్ధాభినన్దనపత్రికా.

రామోపాస్తివిశేషలబ్ధవిదిత శ్రీరామనామాన్వయా
కూపారోత్థకలానిధిర్ద్విజకవిరాట్ శ్రీసచ్చిదానన్దవిత్
శ్రీబృన్దాలలితాదిరూపకముఖగ్రన్థాన్ బహూ న్నిర్మమే
వీక్ష్యైతాన్ హృదయం ప్రమోదభరగం నస్యాత్ కవేః కస్య వా. ౧

ధర్మం నీతి ముదారసత్పదరసస్యన్దం గభీరాశయాన్
దివ్యాన్ కావ్యగుణాన్ ప్రబన్ధనియమాన్ పుష్ణాతి తే మంజులా
అస్థిః సత్కవితా కుమా ర్యతితరా మానన్దసన్దాయినీ
మచ్చిత్తస్య భవత్ప్రబన్ధకలనా జాతేతి వచ్మి స్ఫుటమ్. ౨

ఇతి విద్వత్కవిరత్నం, విద్యావాచస్పతిశ్చ పుల్యకులతిలకః
స ఉమామహేశ్వరసుధీ, ర్వ్యనక్తి నిజ మాశయం ప్రమోదభరాత్. 3

శ్రీవిక్రమవర్ష కార్తిక కృష్ణదశమీ, భానువాసరః, బెజవాడ.

## III

### శ్రీ కావ్యతీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

బరంపురము. 2-3-1940

ఆర్యా:—తాము దయతో నాకు దయచేయించిన లలితను, కారణాంతరములచే నింతదనుక చదువజాలకుంటిని. ఇపుడిప్పుడే పూర్తిగా చదివితిని. నాటకరచనమునందు తగిన ఇతివృత్తము నెన్నికొనుటలోను, దానిని సరసముగను, సలక్షణముగను దిద్ది తీర్చుటలోను మీకు మీరే సాటి. ప్రస్తుత మీ లలితయందు, తాము చూపిన ప్రాచీనవిద్యావిశేషములును, సంస్కృతులును శ్లాఘ్యములుగానే యున్నవి.

తాము నమ్మినసత్యమును, తాము వర్తింపదలచిన తెన్నులును స్పష్టముగా వెల్లడించినందులకును, గ్రంథ మాద్యంతమును పారుష్యము లేని సరళిధోరణిలో నడపినందులకును అభినందింపక యుండజాలను. ప్రకృతము ఇంతకంటెను విశేషించి వ్రాయజాలనందులకై మన్నింప వేడికొందును.

విధేయుడు

—పం. ఆ. శాస్త్రి.

## IV

ఓం

సాహిత్యశిరోమణి, ఉభయభాషా ప్రవీణ,

### చతుర్వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు, బి. ఏ., బి. ఓ. యల్.

పండితుఁడు, కాకినాడ

పీఠికాపురరాజ కళాశాల, 28—1—41

మీ రిచ్చిన "బృంద" యను నాటకమును సమగ్రముగాఁ జదివితిని. మూలకథయందు మీరొనర్చిన మార్పులు రసపోషకములుగా నున్నవి. మూలమునందు లేని నూతనకల్పనములును, నూతనపాత్రలును, హృదయంగమములై మీ కల్పనాశక్తిని వెలిబుచ్చుచున్నవి. అందు మణిగ్రీవునిపాత్ర పాశ్చాత్యుల రూపకములందలి "వంచకపాత్రను" (Villian) స్మృతిపథమునకుఁ దెచ్చుచున్నది. నాటకమునందలి శైలి మృదుమధురమై ప్రాసాహికముగా నున్నది. నవీనరూపకనిర్మాతలయం దిట్టి చక్కని శైలిలో వ్రాయఁగలవారు చాల తక్కువగాఁ గల రని నా యభిప్రాయము.

## V

వెంపటి శ్రీనివాసమూర్తిగారు బి. ఏ., బి. యల్.,
అడ్వకేట్. బెజవాడ

### 'బృంద'

'బృంద' తులసికి నామాంతరము. బృందావన మను మాట జగత్ప్రసిద్ధమే కదా. అసలీ తులసినాటకమున కాధారము స్త్రీలపాటలు. ఇదే ఇతివృత్తముతో నాంధ్రరంగమున నితఃపూర్వ మొక నాటకము వెలసినది. కాని సచ్చిదానందశాస్త్రి గారి రచన పునరుక్తి యనుటకు వీలులేదు. వస్తుపోషణ (development of plot) సంపూర్ణముగ నూతనమార్గమున నడచినది. తదనుగుణముగా ప్రత్యేకపాత్రల శీలములును మెఱుగెక్కినవి. శాస్త్రిగారు పూర్వసంప్రదాయ సంపన్నులైనను నాటక మాధునికసరణి ననుసరించినది. ఇందులోని జలంధరుడు పూర్వకథలలోని వానివలె దుర్మార్గావతారము కాదు. మొట్టమొదట జలంధరుడు సుగుణపుంజము. సౌందర్య శౌర్యాదులచే వలచి బృందను వివాహ మొనర్చుకొనినాడు. కాని యితని శీలమును చెఱచి దుర్మార్గావలంబునిగా జేయుటకు మణిగ్రీవుడను కాలసర్పమును శాస్త్రిగారు సృష్టించినారు. స్వార్థపరుడైన మణిగ్రీవుడు జలంధరు నన్నివిధముల జెఱచినాడు. జలంధరుడు షేక్స్పియరు నాటకములోని (Macbeth) మాక్బెత్ వలె నొకటి తరువాత మరియొక దురంతము నొనర్చుచు అంతఃకరణరహితుడై మూర్ఖునివలె సంచరించి పతనము నొందినాడు. పూర్వకథలలోని తులసీ మానభంగ వృత్తాంతము కేవలము తులసి శీలమునకు మాత్రమే గాక శ్రీమహావిష్ణువుయొక్క మహత్త్వమునకును భంగకరముగా నున్నది. అందుచే నీ భాగమున శాస్త్రిగారు మార్పొనరించి ఇరువురి శీలములకును వన్నె దెచ్చినారు. రణశాస్త్రప్రవీణ యగు బృందను యుద్ధ విముఖురాలినిగా జేయుటయే ఈ నాటకములో విష్ణుమూర్తి కర్తవ్యము. అపని యైనను స్వయముగా నొనర్పక వైష్ణవమాయను నియోగించినాడు. జలంధరుడు పరోక్షమున వధింపబడినాడు. తరువాతి నాటకము యథాపూర్వముగానే ముగిసినది.

శాస్త్రిగారి కవిత్వములోని గుణావగుణము లెంచుటకు నాకు శక్తి లేదు. వారి కవిత్వములోని సారళ్యము, మాధుర్యము జగమెరింగిన విషయములు. నాటకములు రచించుటలోను, అనుగుణములైన పాత్రలను సృష్టించి బిగువు సడలకుండ కథను నడిపించుటలోను శాస్త్రిగారికి గల శక్తి అధునిక నాటకకర్తలలో చాల కొద్దిమందికి గలదు. వీరి 'సావిత్రి' నాటకమువలె నిదికూడ ఆంధ్ర మహాజనుల సన్మానాదరములను బడయ గలదని నమ్ముచున్నాను.

# హెచ్చరిక.



శ్రీ రాముల సచ్చిదానందశాస్త్రి,

శ్రీసావిత్రీ గ్రంథమండలి,

హెడ్ ఆఫీసు :—పూర్ణానందంపేట, బెజవాడ.

బ్రాంచి :—ఆగిరిపల్లి, కృష్ణాజిల్లా.

ఓఙ్కార మందిరము,

బెల్లంకొండ పోష్టు, గుంటూరుజిల్లా.

# పాత్రములు

## పురుషులు :

| | |
|---|---|
| సూత్రధారుఁడు | కాలనేమి |
| మారిషుఁడు | రాక్షసరాజు, బృంద తండ్రి |
| జలంధరుఁడు — దానవప్రభువు | పురోహితుఁడు |
| కథానాయకుఁడు | శుక్రశిష్యుఁడు |
| వజ్రకంఠుఁడు | ప్రాచీనదానవమంత్రులు |
| ప్రధానమంత్రి, రాజమిత్రుఁడు | 8 గురు వికలాంగులు. |
| మణిగ్రీవుఁడు | జలంధర సేనాపతులు - నలుగురు |
| స్వార్థపరుఁడగు ప్రభువంచకుఁడు | మునులు, దేవతలు — 8 గురు. |
| శ్రీమహావిష్ణువు — వైకుంఠాధిపతి | ప్రమథులు — 4 గురు |
| నారదుఁడు — త్రిలోకసంచారి | కైలాసమునందలి వనపాలకుఁడు |
| శంకరుఁడు — కైలాసనాథుఁడు | విష్ణుసేవకుఁడు |
| బ్రహ్మ — సత్యలోకాధిపతి | భటులు — ఇద్దఱు |
| | మున్నగువారు |

## స్త్రీలు :

| | |
|---|---|
| బృంద — కాలనేమిమహారాజపుత్రి, | పార్వతి |
| కథానాయకురాలు | లక్ష్మి |
| సరళ — చెలికత్తె | సరస్వతి |
| మనోరమ — బృందతల్లి | వైష్ణవి — విష్ణుమాయ |
| చారుమతి — ఋషిపత్ని | చెలికత్తెలు — నలుగురు |

శ్రీరస్తు.

# బృంద

---

## నాంది

ఉ. శ్రీవిలసిల్లినన్ సురలు ♦ సేవకులై యలరారుచున్న నా
నావిధ వైభవోన్నతిను ♦ నంతముగా వెలుఁగొందుచున్న బృం
దావనచారియై విబుధ♦తాపము వాయఁగ ధర్మమేలు వి
ద్యావిభవుండు శ్రీహరి జ♦నార్దనుఁ డోముత నెల్లవారలన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి పుష్పాంజలిఁజల్లి సంతసముతో సభఁగలయఁజూచి] ఓహో! ఏమి యీ పరిషత్తు! లలిత కళాసముచ్చయ సముల్లసితం బగు నాటకావలోకనమున కెంతయు నుత్సాహపడుచుఁ గిక్కిరిసియున్నది. ఇమ్మహాసభ నెట్లు సంతుష్టి పఱుప గలుగుదును? కానిమ్ము! మారిషునిఁబిలిచి విచారించెద. [తెర వంకకుఁ దిరిగి] మారిషా! ఇటురమ్ము?

మారిషుఁడు—[ప్రవేశించి] ఆర్యా! నమస్కారము.

సూత్ర—సుఖీభవ.

మారి—బావా! పిలిచితి వెందులకు?

సూత్ర—ఈ సభాసదుల సంతోషపఱుప మన మేదే నొక నాటక మాడఁగలమా యన్న సంశయము నివారింపఁ గలందులకు.

మారి—ఆర్యా! సర్వజనాదరణపాత్రమై చాక్షుషయజ్ఞ మని పేర్గాంచఁబడి యెల్లర నానందాబ్ధి నోలలాడింపఁదగిన నాటకమును బ్రదర్శించుటకుఁ గూడ సంశయమా?

సూత్ర—ఔను.

మారి—ఎందులకు.

సూత్రి—దేశీయ చలన చిత్రములను విదేశీయ చలనచిత్రములను విశేషముగఁ గనుఁగొనువారి కిప్పు డీ నాటకప్రదర్శనము ముదావహ మగునా యని.

మారి—సమయ మట్టిదియే యైనను బలువూటులు ప్రదర్శింపఁబడి బహుజనాదరముం గన్న నాటకరాజములును, విదేశీయులకు సైతము మార్గదర్శకు లనిపించుకొన్న నటశేఖరులును మిక్కిలి దేశప్రసిద్ధి వడసిన నటీమణులును మనకుఁ గలిగియుండ, మన నాటకప్రదర్శనముల కే ప్రదర్శనములును సరి కానేరవు. సంశయము వీడి కాలహరణ మొనర్పక ప్రదర్శనప్రయత్న మొనర్పుము.

సూత్రి—అయిన నీ రసికబృందము నానందింపఁ జేయు నాటక మెద్దియై యుండును?

మారి—రసికబృందమున కేమి, మఱి యే బృందమున కేమి, బృందయే యమందానందసంధాయకమై యలరారఁ గలదు.

సూత్రి—బృందయా? [స్మరణ మభినయించి సంతసముతో] నిజము, మారిషా! నీమాట నిజము. ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులును శ్రీ తిరుపతి వేంకటకవుల శిష్యులును, సావిత్రి లలిత మున్నగు నాటకకర్తలు నగు శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారే యీ బృందా నాటకకర్తలు. కాని యీ కథ పౌరాణికము. పలువు రచే రచింపఁబడి పలువురచేఁ బ్రదర్శింపఁబడి లక్షలు వ్యయ మొనర్చిన చలనచిత్రమునందుఁగూడఁ జూపఁబడినదే? అదిచర్విత చర్వణమని లోక మనుకొనదుకద!

మారి—బావా! పురాణ మన్న నెప్పుడు నవనవంబై నదని యర్థము. అట్టి దాని సంబంధ మెన్ని మార్పులతోఁ బ్రదర్శించుచున్నను ఎప్పటికప్పుడు క్రొత్తదిగనే యుండును. ఇంతియేగాక కథా మాత్రగ్రాహకులై కాళిదాసాదులు తమ నాటకము లెంత వింతగఁ జిత్రించియుండలేదు? అటులనే సత్కవిసాంప్రదాయ ముల నన్నించు మన గ్రంథకర్తయుఁ దన రచనాకౌశలమున

నీ కథను రాణింపఁజేసె ననుటకు సందియముండదు. తినుపింపఁ బోవుచు రుచి నుగ్గడించు టెందులకు? ప్రదర్శన ముపక్రమింతము. సహృదయ హృదయములే సారస్యమును జాటఁగలవు?

సూత్ర—మిత్రమా! నీప్రోత్సాహమున కెంతయు సంతసించుచున్నాను. ఈశరత్సమయమున సరోవరంబులువోలె రసికహృత్సరసీజములు కూడ నతి మంజులములై కన్పట్టుచున్నవి? కాలమును అత్యంత రమణీయమై వెలుఁగొందుచున్నది. చూడుము.

గీ. గగనవార్నిధిపైఁ దరంగముల భంగి
విమలవారిదఖండముల్ వెలయుచుండె,
వలులు నురుగులభాతి సుందరములైన
పరమహంసంబు లందందుఁ బఱచుచుండె.

మారి—బావా! నీ వర్ణనము మిగులఁ బ్రశంసనీయము. శరదాగమమునకు సంతసించి మానససరోవరమునుండి మఱలివచ్చు పరమహంసములేకాదు. పరమహంసావతంసము నారద ఋషీంద్రుఁడు కూడ ఇటే వచ్చుచున్నాఁడు. మనముపోయి యనంతర కరణీయమునకుఁ గడంగుదము రమ్ము.

సూత్రి—మంచి దటులనే గావింతము. [ఇరువురు నిష్క్రమింతురు]

ఇది ప్రస్తావన.



శుభమ్—అవిఘ్నమస్తు




## ప్రథమాంకము.

నార—[ఆశ్చర్యముతోఁ జూచుచు] మిన్నొరయుచు నతి విశాలమైన యీ మహాపట్టణము మధ్యమలోకలక్ష్మీ కమూల్యాలంకారమై యెంతచూచినను జూడ వేడుక కలిగించుచున్నది. ఔరా! ఉత్తమవస్తు సందర్శనము నిత్యనూతనమై వర్ణనీయంబగు నను టకు సందియము లేదు. దీని నిర్మాణవిశేష మసమానమై యెంత వింతఁగొల్పుచున్నది.

సీ. కులిశాహతికినైనఁ ♦ దలఁకక దివిమీఱు
భంగిఁ బ్రాకారముల్ ♦ చెంగలింప
మ్రొక్కు నిందుఱేఁడు నింగి ♦ మోపిన ధను వన
సౌధాగ్రమణిగణ ♦ చ్ఛవి రహింప
కలధౌతగిరి నీల ♦ గళునికై జాతెనాఁ
దనరి వీథులసిరుల్ ♦ తాండవింప
వివిధాకృతులఁబొల్చు ♦ వీరరౌద్రంబుల
కరణి సద్భటకోటి ♦ కడిమి నింప
గీ. బలసి నడగొండ లన నిభం♦బులు రహింప
క్షితిఁ జెలఁగుమించు లన సతుల్ ♦ శ్రీవహింప
నెగడు నసమానసంపద ♦ నిఖిలభువన
భూషణంబు జాలంధర ♦ పురవరంబు.

మఱియు నీ పట్టణమెంతయు మణితోరణాలంకృతంబై భాసురానేకధ్వజపతాకాభిశోభితంబై, వీరవర సందోహ సందీపితంబై, నిత్యకల్యాణము పచ్చతోరణమునై మహానంద సంధాయకంబై యలరారుచున్నది. [పైకిఁజూచి] ఓహో! ఇవి యేమి. ఇవి దివ్యవిమానములా? ఔను. ఈపట్టణాధిపతియగు జలంధరుం డీశ్వరాంశ సంభూతుండును, మహాబలశాలియు, నధికతపస్సంపన్నుం డగుటంజేసి, దిక్పాలురు సైతమరిగాపులై యీతని యాజ్ఞానుసారము ప్రవర్తింపుచు సార్వభౌముని దర్శనమునకై వేచియుందురు. కానిమ్ము; తన పుత్త్రికను బృంద నీ సార్వభౌమున కీయఁ దలంచిన కాలనేమిమహారాజు కోరిక నెఱవేఱునట్లు ప్రయత్నించి చూచెద. [ముందునకు నడిచి చూచుట నభినయించి] ఎవ్వరా భటశేఖరులు? ఎచ్చటి వీ రథనేమిధ్వానములు! సార్వభౌమసంబంధములు కావు కదా? [చూచుచుండును.]

జలం—[లోపలినుండి] నారదమునిచంద్రమా! జలంధరనాముఁడిదే నమస్కరించుచున్నాఁడు.

నార—విజయీభవ! విజయీభవ!

జలం—[తెరలో] సూతుఁడా! రథము నిల్పుము.

నార—ఓహో, ఈతఁడు రథమును దిగి వచ్చుచున్నాఁడు. మంచిది, రానిమ్ము.

జలం— [వజ్రకఁతునితోఁ బ్రవేశించి] మునిచంద్రమా! నమస్కారము.

నార—కల్యాణప్రాప్తిరస్తు.

వజ్ర—దేవమానివర్యునకు వజ్రకఁతుఁడిదే నమస్కరించుచున్నాఁడు.

నార—సుఖీభవ!

జలం—దేవా! పట్టాభిషేక సమయమునఁ దప్ప మఱలఁ దమ దర్శన భాగ్యము లభించినది కాదు. తమరు నన్ననుగ్రహించుటకే వచ్చుచున్నట్లు తలంతును, ఉబ్బుసుపోకకు వింధ్యాద్రి కడకేఁగుచుంటిని. ఎప్పుడైన నఁబోవచ్చును. పురమునకుఁ బోదము రండు.

నార—సార్వభౌమా! నీ వినయమెంతయు నీ యౌన్నత్యము నధికము చేయుచున్నది. నీ సుకృత మమేయము.

ఘు॥ బలముల్ గూర్పఁ గడంగఁబోవు, రథముల్ పన్నింప, చెంతేని దిక్కులుమార్మ్రోయు రణార్భటుల్ సెలఁగ నుత్రోత్కథంబునన్ శత్రుభూములపైఁ బొఱవు, బాణ మెక్కిడవు, సమ్మోదింబునన్ మ్రుజ్జగంబులు నిన్ గొల్చును నీదు పుణ్యమహిమంబున్ జెప్పఁగా శక్యమే?

నీయాజ్ఞ యమరేశ్వరాదులకు సైత మాదరణపాత్రమై నీవు త్రిలోకాధిపతి వై నందులకు మిక్కిలి సంతసించుచున్నాను. కాని నీవు తలంపునకు వచ్చినను, నీవు గాన వచ్చినను సద్గుణబృందయగు బృంద నా డెందము నధిరోహించు చుండును.

జలం—బృంద యెవ్వరు ?

నారద—కాలనేమిమహారాజున కేకపుత్రి. సకలకలావిశారద, శరవిద్యాప్రవీణ. ఆ బృంద లోకైకసుందరి యనుటకు సందియము లేదు. ఆమెను గుఱించి యెంతయుఁ జెప్పవలసియున్నది. శుభం బందఁగలవు. ప్రయాణము సాగించి రమ్ము. పిమ్మటఁగలిసికొందము.

జలం—చిత్త మటులనే గావించెద. కాని మీతోఁ దృప్తిఁ దీర మాటలాడి మీ గానామృతవాహిని నోలలాడ నెంతయు నిచ్చగలను. శీఘ్రకాలమున దర్శన మిప్పింపఁ గోరుచున్నాను.

నారద—నీ యభీష్టము నెఱవేఱఁగలదు. పోయి రమ్ము.

జలం—చిత్తము [అని నమస్కరించి మంత్రితో నిష్క్రమించును.]

నారద—బృందయు వనవిశేషములఁ జూడఁ బయన మగుచుండెను. దైవమే వీరిని సంఘటింపఁ జేయవచ్చును. కానిమ్ము. నేనును బోయివచ్చెద. [అని నిష్క్రమించును.]

[వింధ్యవనప్రాంతమునఁ బురుష వేషమున బృందా, సరళలు ప్రవేశింతురు.]

బృంద—సరళా ! ఇయ్యది నరపాలక సంచార యోగ్య ప్రదేశము. మన మింకఁ బురుష నామములతో మెలఁగవలయును. నీ పేరు సుమంతుఁడు.

సరళ—నీ పేరు సుందరుఁడు,

సుంద——సుమంతా! చూడు మీ నగప్రాంత మెంత యచ్చెరు వొన
రించు చున్నదో?

సీ. దంతి దంతములూడ్చి ♦ స్తంభంబు లొనరించి
పాక లేర్పఱతు రీ ♦ పల్లెజనులు
ఇభరాజములఁబట్టి ♦ యెద్దులవలెఁ గట్టి
కొండఁ బండింతు రీ ♦ కోయదొరలు
హర్యక్షములఁ బిల్చి ♦ యంపి కుక్కలఁబోలె
నెఱచి భుజింతు రీ ♦ యెఱుకుతేండ్లు
ముత్యాలు జొన్నల ♦ పోల్కి ముందిడి పప్పు
బెల్లాలు కొందు రీ ♦ భిల్లసతులు

గీ. పాఱుటాకుల వల్వలు ♦ పదిలపఱచి
గురిజపేరుల సొమ్ములు ♦ కుస్తరించి
చెలఁగి పాడుచు నాడు చెం♦చెతల రవణఁ
గాంచఁ గనుబండు వయ్యెడుం ♦ గాదె యిందు?

సుమం——సుందరా! నిజము. నిజము.

సుంద——ఈ ప్రదేశముల నవలోకించుచుఁ బోవుదము రమ్ము.

[నిష్క్రమింతురు.]

[వింధ్యారణ్యప్రాంతమున వజ్రకంఠునితోఁగూడి
జలంధరుఁడు ప్రవేశించును.]

వజ్ర——సార్వభౌమా! ఇయ్యదియే వింధ్యపర్వత ప్రాంతారణ్యము.
భయంకరమృగశరణ్యము, మృగయాఖేలనతత్పరు లగు వీర
వర్యుల కెంతయుఁ బ్రథమగణ్యము.

జలం——[చూచి] ఆహా! ఏమి యీ పర్వతరాజము! ఎంత వింతఁ
గొల్పుచున్నది?

ఉ. తారలతో మహాగ్రహ వి♦తానముతో వెలుఁగొందు వ్యోమ మిం
ద్ధారుణి వ్రాలకుండగ వి♦ధాత యొనర్చిన కంబమట్లు పెం
పారుచు దివ్యదంపతుల ♦ కాశ్రయమై బలుపొంది కమ్మ క
స్తూరి పరీమళంబొలయు ♦ శోభిలు వింధ్య మవంధ్య శైఖరిక.

[ప్రక్కఁ జూచి] ఓహో! ఈ ప్రదేశ మెంతయు భయంకర మృగశరణ్యంబై మహాశ్చర్యమును గలిగించుచున్న దే!

సీ. అడవి గొఱ్ఱెల గుంపు ♦ లార్వంగఁ గబళించి
బలిమి మ్రింగెడు కొండ♦చిలువపిండు
పైఁబడ్డ పులులను ♦ బడఁద్రోఁచి చెలరేఁగి
కడకొమ్ములం జిమ్ము ♦ కాసరములు
చీల్చి కొమ్మల నేలఁ ♦ గూల్చి వృక్షమ్ముల
మలల వాఁచ్మని గ్రుమ్ము ♦ మత్తకరులు
సెలయేళ్ల రొదలకుఁ ♦ జిడిముడి పడి కొండ
లవియంగ గర్జిల్లు ♦ హరిచయంబు
గీ. తలలు క్రిందుగ దూఁకెడు ♦ నెలుఁగుబంట్లు
నడరి బొండ్లంపు బంతుల ♦ నాడు కపులు
నొఱపు చూపులఁ బఱపి కేఁ♦ళ్లుఱుకు లేళ్లు,
వెలయు నిచ్చోటు వేఁటాడ ♦ వేడ్క కాదె?

వజ్ర—సందియమేమి? దేవా! మృగయాఖేలనతత్పరు లగు వీర వర్యుల కెంతయు నియ్యదియే విహారయోగ్య మగు ప్రదేశము.

జల—మిత్రమా! ఇంక నా యభీష్టము నెఱవేర్చుకొనియెద. [ముందు నకు నడిచి, పరికించి] అయిన నా కిప్పు డెయ్యది కర్తవ్యము?

సీ. కరులఁ దుండముఁబట్టి ♦ గిరవాటు వేయనా?
యుడుగణంబులు పాదు ♦ లురలి వ్రాల
గిరికూటముల నట్టె ♦ క్రిందికడంతునా?
యాదిశేషుఁడు తల♦ లడఁగి యడలఁ
బెనుమ్రాఁకులను వీఁకఁ ♦ బెకలించి విసరనా?
దిగ్గజంబులు సోలి ♦ మొగ్గతిలఁగ
సింహాదిమృగములఁ ♦ జెవులూని విఱువనా?
భిల్లాంగనల గుండె ♦ జల్లుమనఁగ
గీ. గుణసమాకర్షణోల్బణ ♦ వ్రణకిణాంక
భుజులు ప్రతిభటు లెయ్యెడఁ ♦ బొడమ రైరి,

విహారణ మొనర్చి వింధ్యాద్రి • విపినభూమి
బలితమా చేతి కండూతిఁ • బాపుకొందు.

వజ్ర—సార్వభౌమా! మహాబల సంపన్నులు. ఇందు మీా కెయ్యది సాధ్యము కాదు?

జలం—వజ్రకంఠా! ఆ మదకరుల కరంబులం బట్టి గగనతలంబున కెగుర వైచి మునుముందు నా భుజబలంబు మెఱయఁజేసెద. రమ్ము పోదము. [అనుచు సంరంభముతో నిష్క్రమింతురు.]

[సుందర సుమంతులు ప్రవేశింతురు.]

సుంద—[ఆశ్చర్యముతోఁ జూచుచు] సుమంతా! క్రూరసత్వ సంకులమై యీా ప్రదేశ మెంత భయంకరముగ నున్నదో చూడుము!

సుమం—సందేహమేమి?

సుంద—[ఆశ్చర్యముతోఁ జూచి] ఆహా! ఏమి యీా యద్భుతము!

గీ. తేఁచు కుక్కలు కదిసి పెల్లేచి యెగసి
కఱచి కుత్తుక, మేనెల్ల • గాయపఱచి
వ్రీల్చి కండలతోఁ బులిన్ • గూల్చెనార!
పదుగురొక్కటైనఁ గానట్టి పనులు కలవె.

[పైకిఁజూచి యాశ్చర్యముతో] సుమంతా! ఇటుచూడుము!

చ. ఫలములువోలెఁ గానఁబడి • పక్షులభంగి చెలంగి యంతలోఁ
గలశము లంతలంతలుగఁ • గన్పడుచుండి క్రమక్రమంబుగన్
బలితపు కొండలో యనఁగ • వార్లు కరిప్రకరంబు నంబర
స్థలి నటియింపఁజేయుచు ముదంబొనగూర్చెద నీకు మిత్రమా!

సుమం—కానిమ్ము, అటులనే కానిమ్ము. ముందు శరములఁ బ్రయోగింపుము.

సుంద—అటులనే. [అని బాణముల విడుచును.]

సుమం—[చూచి యాశ్చర్యముతో] సుందరా! గజములే! నిక్కముగ గజములే! మహావీరుఁ డెవ్వఁడో భుజబలంబు మెఱయ వానినిఁ బైకి విసరి యుండును.

సుంద—[శరప్రయోగ మభినయించుచు] ఐనను నా శరవిద్యా ప్రావీణ్యమున వాని కాకాశవిహారయోగ్యత సమకూర్చెద. నీవీ వనసత్వములు వ్రాపై బడకుండ బొఱదోలుచుండుము.

సుమం—అటులనే. [అనుచు ధనుష్టంకారము సేయుచు నిష్క్రమించును]

సుంద—[బాణములు వదలుచు బైని జూచుచు] ఓ గజరాజములారా! ఆకసమున నిలువుడు, నిలువుడు, ఎగురుడు, నాట్యమొనర్పుడు [అనుచు బాణములు విడుచుచు లోనికి బోవును]

[జలంధర వజ్రకంఠులు ప్రవేశింతురు]

జలం—[ఆకసమువంక జూచుచు] వజ్రకంఠా? క్రిందఁ బడు వనగజములు, మఱల బైకి బోవుచున్నవే! ఏమి యీ యద్భుతము?

గీ. తారలం దాకి పక్షిమొదు ♦ దంతిచయము
బంతుల విధాన నెగురుచు ♦ బైకి బైకి,
దివిజగజముల భంగి న♦ద్దివి జరించు,
నెంతయు మహాద్భుతం బిది♦యేమి యొక్కొ?

వజ్ర—తమబోం ట్లెవ్వరో శరవిద్యాపాటవమును గనఁబఱచుచుండ నోపును.

జలం—[అహంకారముతో] ఏమి? నేను విసరివైచిన గజములను గూడ బైకి నంపు నంతటి శరపాటవమా? కానిమ్ము, విచారించెద!

వజ్ర—[అటు నిటు జూచి] దేవా! కోమలగాత్రు డెవ్వఁడో యీ దెసనున్నవాఁడు రండు చూతము! [ముందునకు నడుతురు].

జలం—[చూచి యాశ్చర్యముతో] ఏమి యీ మోహనాకారము! వీరశృంగారము లేకమయినట్లు తోఁచుచు నా హృదయము నెంతయు విలిచికొనుచున్నదే! [సానురాగముగ జూచి]

గీ. కుసుమసుకుమార మగు మోము ♦ గోముఁ జూడ
నంగన యనంగనగు, శౌర్య♦భంగిఁ గనఁగఁ
బురుషరత్నంబునా నొప్పు, ♦ నిరుపమాన
నరవరాకృతి దాల్చిన ♦ తరుణి యేమొ?

వజ్రి—[ఆశ్చర్యముతోఁ జూచుచు] దేవా! ఆతని శరప్రయోగనైపుణ్యమసమానము. సార్వభౌమానుగ్రహపాత్రుఁ డనుటకు సందియము లేదు.

జలం—నిజము నిజము. ఆ మోహనాకారము, ఆ పరాక్రమము సాటిలేకున్నవి కదా?

చ. అతులితరూపముగ్ధమతి ♦ నా లలితాకృతి వేడ్కఁ జూతునా?
చతురత బాణముల్ విడుచు ♦ చండ పరాక్రమలీలఁ గందునా?
ద్రుతగతి నాడు బంతులయి ♦ తోఁచెడి దంతులఁ గాంతునా మహా
ద్భుతమగు దృశ్యమౌర! నను ♦ ముంచెను మోహపయోధి నెయ్యెడన్

కాని మిన్నా దృశ్యము నే కనులపండువుగఁ జూచుచుండెద. [అని చూచుచు సంతోషాశ్చర్యములు కనఁబఱచుచుండును]

సుంద—[ఉత్సాహముతో శరప్రయోగ మభినయించుచుఁ బ్రవేశించి] ఇభరాజములారా? పొండు. మహావాయుపథమున విహరింపఁ బొండు. స్వర్గజములఁ గలిసి యానంద మనుభవింపఁబొండు! [మఱల బాణమును బ్రయోగించి] పొండు, పొండు, పైకిఁ బొండు. [అని యుత్సాహమునఁ జూచుచుండ బాణము తగులును]

సుంద—ఆ, అదియేమి? అబ్బా! దుర్భరము! [అని బాధ నభినయించి క్రిందఁ గూరుచుండి కనులు మూసి శయనించును]

వజ్రి—ఆ, అపాయము! అపాయము!

జలం—ఏమి యీ యద్భుతము? బాణ మెటనుండి వచ్చినది? [అని నలువంకలఁ జూచుచు, నాశ్చర్యముతో] వజ్రకంఠా! ఆతఁడెవఁడో వనసత్త్వములలోఁ జిక్కి నలుదెసల బాణములను విడుచుచున్నాఁడు. ఆతఁడు విడిచిన బాణమే యితనికిఁ దగిలియుండవచ్చును. నీ వాతనికిఁ దోడు పడుము. నే నితని కుపచరించెద.

వజ్రి—చిత్తమటులనే గావించెద. [నిష్క్రమించును]

సుంద—[బాధ నభినయించుచు] మిత్రమా! చేయూత! చేయూత! [అని చేయిఁ జూపును]

జలం—మిత్రుఁడా? ఎవరు చెప్పుమా? ఓహో, ఆతఁ డీతని మిత్రుఁడై యుండును కానిమ్ము. [సమీపించి చూచి] ఓహో! కంకణహస్తము— [సంతోషాశ్చర్యములు కనఁబఱచుచుఁ దొడపై శిరము నిడి యుపచరించు చుండును.]

సుంద—అబ్బ! [అని పొరలును.]

జలం—పాప మాయువు పట్టునఁ దగిలినది. [అని యుపచరించు చుండును.]

సుంద—సఖీ! సఖీ! [అని పిలచును.]

జలం—[ఆశ్చర్యముతోఁ జూచి] సఖియెవ్వరు? [పరికించి చిఱునగవుతో] [స్వ] సఖికాదు, సఖుఁడు [అని యుపచరించుచు నాశ్చర్యమునఁ జూచుచుండును.]

సుంద—సుమంతా! సుమంతా! [అని పిలుచుచుఁ గనులు తెఱచి మఱలఁ గనులు మూయును.]

[వజ్రకంఠ సుమంతులు ప్రవేశింతురు]

సుమం—[వజ్రకంఠునితో] ఆర్యా! పులులమధ్యనుండి రక్షించిన మీ యుపకారమును మఱవనేరను.

వజ్ర—ఇది యంత విశేషవిషయము కాదు.

సుమం—ప్రాణరక్షణముకదా! ఇంతకు మించిన విషయ మేముండను? [అని జలంధర సుందరులను జూచి యాశ్చర్యపడును.]

సుంద—[నిట్టూర్చి కనులు దెఱచి జలంధరునిఁ జూచి సంభ్రమముతో లేచి యందఱినిఁ జూచి నిర్విణ్ణుఁడై] సుమంతా! నా కుపచరించినది నీవు కాదా?

సుమం—ఏమి? [అని తెలియమి నభినయించుచు] నీ కుపచారమా? ఎందులకు?

సుంద—బాణము తగిలినది నీ వెఱుఁగవా?

సుమం—[స్మరణ మభినయించి] ఆహా! పులులమధ్యనుండి నేను విడిచినబాణమే నీకుఁ దగిలియుండును. ఎంతయుఁ బ్రమాదము

జరిగెనే ? మిత్రమా ! ఆ శరపాతమున కెంత యలసిపోతివో కదా ?

సుంద—బాధయే కలిగినది. కాని ఇప్పుడేమిఁయు లేదు. నాకుపచరించి నది నీవు కాదు.

జలం—ఉపచరించిన దాతఁడు కాదు. క్రొత్తమిత్రుఁ డీతఁడు.

సుందర—
సుమంతు— } [రిచ్చవడుదురు]

సుంద—[జలంధరునిఁ జూచి తల యూచుచు] మీరేల శ్రమ పడితిరి?

జలం—అపాయసమయ మందాదరించుట సామాన్య ధర్మముగాదా ?

వజ్ర—అందును బ్రభువులకు సార్వభౌములకుఁ జెప్పవలయునా !

సుందర—
సుమంతు— } [జలంధరునిఁ జూచి తమను జూచుకొందురు]

జలం—ఇంతియే కాదు.

మ. కరికాండంబుల మద్భుజాపటిమ, నాకాశంబునన్ వైవఁ, ద్వ
చ్ఛర నైపుణ్యముచేత, నా కరులఁ జంచల్లీల నాడించి, న
న్నారయంజాలితి, హేమ మెంతయు సుగంధోత్కర్ణ మాభాతి, సుం
దరమౌ రూపున కిట్టి శక్తియునఁ, జోద్యంబయ్యె నాకయ్యెడన్.

శరవిద్యాపాటవమునకు మెచ్చి బహూకరణ చిహ్నముగఁ గరగ్రహణ మొనర్చితిని. చిరమైత్రి నభిలషించి కొంచెము సేదఁ దీర్చితిని.

వజ్ర—సార్వభౌమానుగ్రహపాత్రులు. మీ యదృష్ట మెంతయుఁ గొనియాడఁ దగియున్నది.

సుమం—గగనతలంబునకు మత్తగజముల విసరిన మహాబలసంపన్నులు వీరు సార్వభౌములా ?

వజ్ర—మఱియేమి ? ఈశ్వరాంశ సంభూతులు. త్రిలోకనాథులు. జలంధర సార్వభౌములు.

సుందర—
సుమం— } [పరస్పరము చూచుకొందురు.]

సుమం—దేవర నెఱుంగని మమ్ము మన్నింపవలె.

సుంద—సార్వభౌములకు నయితము శ్రమ గలిగించిన నా యపరాధము క్షమించి, మాకుఁ బోవ ననుజ్ఞయిండు. సుమంతా! పోవుదము పద.

సుమం—చిత్తమటులనే. [అని పోఁ బోవుదురు]

జలం—[సమీపించి] సుకుమారు లయ్యును శరవిద్యాప్రవీణు లగు మీ యావాసంబును, మీ నామధేయంబులును మితుఁ్రడు తెలిసిగొనఁ గోరుచున్నాఁడు.

సుంద—[సుమంతునిఁ జూచును.]

సుమం—మా మిత్రుఁ డీ సుందరుఁడు కాలనేమిమహారాజనందనుఁడు.

వజ్ర—[ఆశ్చర్యముతో] ఏమీ? ఆ మహారాజునకు నందనుఁడా! నందనయా?

సుమం—ఆహా! కాదు, నందనుఁడు.

వజ్ర—[సాభిప్రాయముగ] కాదునందనుఁడు. ఆ - సరియే [సవిమర్శముగఁ జూచి] తెలిసినది.

సుందర, సుమం—[చూచుకొందురు.]

జలం—ఏమయినం గానిమ్ము. వీరవరాదర్శకంబగు నీ శరసంధాన నైపుణ్యము, భువనమోహనకరం బగు నీ మనోహరాకారము, వదల నీయుటలేదు. చిరప్రణయమునకుఁ బ్రథమసోపానముగఁ బాణిగ్రహణము సేయ నభిలషించుచున్నాను. [సుందరుని చేయిఁ బట్టుకొని] ఓయీ! నీవు సుందరుఁడవో? మఱి యేమో! కాని మందహాసాంచితం బగు ముఖారవిందము, మీలఁ జాలివఱచు వాలుఁగన్నులు మఱపు నందనీకున్నవి. సంజీవకరణివోలె భావముల నుజ్జీవింపఁజేయు నీ పాణిగ్రహణసుఖ మమందానంద సంధాయకంబై మఱువరాకున్నది.

గీ. కలువ పూఁతేకు కొమ్మలఁ ♦ గలయఁ జిట్టి
చంద్రికాసార సలిలసే♦చన మొనర్చి
భావ సంభూత నూతన ♦ ప్రణయవల్లిఁ
బ్రమదమునఁ దేర్చెఁ ద్వత్కర♦స్పర్శ మార!

సుంద—ఆర్యా! మీకు నాయెడఁగల యాదరమున కెంతయు సంత సించుచున్నాను.

జలం—మిత్రమా! నా యభీష్ట మొండుకలదు. దానినిఁ దప్పక నెఱ వేర్పవలె ?

సుంద—అదియేమి ?

జలం—

చ. వెలగలమేలి వజ్రముల, ♦ వీరవరేణ్యుల, నస్త్రవేత్తలన్,
బలయుతులన్, సుధీమణులఁ, ♦ బండితవర్యుల, సత్కవీంద్రులన్,
విలసితవస్తుసంతతుల, ♦ వేడ్క గ్రహింతురు గాన, "రత్నహా
రులు నృపు" లన్నవాక్యము ని♦రూఢి నొనర్పఁగదయ్య మిత్రమా!
ధనుష్మదగ్రణి వగు నో సుందరా!

ఉ. సుందరనామ మన్నిటను ♦ శోభిలె నీయెడ, శస్త్రవిద్య నా
డెంద మలర్చె, నెంతయు వ♦డిం జనుదేరుము మిత్రుతోడ, నా
మందిరమందు వర్తిలు, మ♦మాత్యుఁడవై, విహితుండవై మహా
నందము గూర్పు, సర్వమును ♦ నాయది నీయదిగాఁ దలంపుమీ ?

వజ్ర—సార్వభౌములయాజ్ఞ యనతిక్రమణీయము. మీ కన్నిఁట మేలు గలుగును. జాలంధరమునకు రండు, పోదముః.

సుంద—[నిట్టూర్చి సవినయముగ] ఆర్యా! సార్వభౌము లయ్యును మీరుచూపెడి యాదర మెంతయుఁ బ్రశంసనీయము. తండ్రి చాటువాఁడ నగుటచేఁ బ్రస్తుతము మీ యాజ్ఞ నెఱవేర్పఁజాల నందులకు మన్నింపఁగోరుచు, గృహమునకుఁబోవ ననుజ్ఞ వేఁడు చున్నాను. [అని పోఁబోవును.]

జలం—మిత్రమా! గృహ మెచ్చటికిఁబోవును ? ఏల త్వరపడెదవు ? ఈ మాటఁగూడ వినుము. ఇయ్యది మీజనకున కనంగీకారము కానేరదు. నా యభ్యర్థనము వ్యర్థమును గానేరదు. ఇంతయేల?

మ. అవనీనాథులు లోకపాలురు మదా♦జ్ఞాధీనులై యుండ, దై
త్యవరేణ్యుం డగు కాలనేమిపతి, నా♦యభ్యర్థనల్ త్రోయునే
యవునర్ల గాదనుగాక యాతఁడు మదీ♦యసామ్రాజ్యవం బిచ్చి, తత్
భువన త్రాణభరంబు నేను గొని, నీ ♦ బూజింతు నశ్రాంతమున్.

కావున నింక మాఱుమాటాడక మా పురమునకు రమ్ము, పోవుదము. త్రిలోకాధిపతివైన నీకడకే నీతండ్రిగారు రాఁగలరు. రమ్ము రమ్ము.

సుంద—ఆర్యా! మీ యాదరౌదార్యము లసమానములు. మీ యాజ్ఞ నుల్లంఘించితి ననుకొనవలదు. తండ్రిగారిచే నియమింపఁబడక నే నెందులకేని స్వతంత్రింపఁజాలను. పోయివచ్చెద మనుజ్ఞ యిండు. సుమంతా! పోవుదముపద.

సుమం—దేవా! త్వరలో మీ యభీష్టము నెఱవేఱఁగలదు. పునర్దర్శనమునకై యనుజ్ఞ యిండు, పోయివచ్చెదము.

జలం—సరే! మంచిది. అటులనే గానిండు.

సుందర } [సాదరముగఁజూచి నిష్క్రమింతురు.]
సుమంతు }

జలం—[చూచుచుఁ దలయూఁచుచు ముందునకుఁబోయి నిలిచి నిట్టూర్చి] ఆహా! ఏమి యీ రామణీయకము! ఏమి యీ మాధుర్యము. నిక్కంపు వనితామణి యనుటకు సందియము లేదు. నారదుఁ డీమెను గుఱించియే చెప్పియుండును. అది యంతయు నిక్కువము. [ముందుఁజూచి] ఔరా! ఆ చూపు గొలుసుతో బంధింపఁబడితినే! ఇంకేమి సేయుదును?

గీ. ఎంతదీర్ఘంబొ తెలియ దాయింతి చూపు
అంతుపుంతయు లేక మదంతరమునఁ
బఱఁగి పెనఁగొని యాత్మకై వసముచేసి
తాఁ జనుం దంతువాయ సూత్రంబుభాతి.

వజ్ర—దేవా! పురుషవేషాచ్ఛాదిత యగు సుందరికాని, సుందరుఁడు కాడు. నారదోక్తియంతయు యథార్థము. త్వరలో మీ యభీష్టము నెఱవేఱఁగలదు. రండు పోదము.

జలం—[నిట్టూర్చుచు వెడలును.]

[ఇరువురు నిష్క్రమింతురు.]

ఇది ప్రథమాంకము.




## ద్వితీయాంకము

[మణిగ్రీవుఁడు రాజమందిర ప్రాంతమునఁ బ్రవేశించును.]

మణి—[ఆశ్చర్యముతోఁ జూచుచు] ఈ పట్టణపు వైభవం, ఈ యుద్యానవన రామణీయకం, ఈ సౌధరాజముల సౌభాగ్యం చూస్తే స్వర్గమే యీ భూమి నలంకరించిందో, లేక భూగర్భములో నుంచియే యిట్టి మహానగరం ఉత్పన్నమైందో అనిపిస్తూంది. మర్త్యలోకమే గాక, స్వర్గ పాతాళ లోకాలుకూడా తన కధీనమై త్రిలోకసేవ్యుడుగా ఉండే జలంధర సార్వభౌముడు దానవ కులాలంకారుడుగా ఉండటం, దైత్యకుల సంభూతులమైన మా అందరి అదృష్టమూ అనక తప్పదు. వైమానికులకు రాజాధిరాజులకు కూడా దుర్లభంగాఉండే మహామంత్రి దర్శనం కలగటం, లేని బంధుత్వాన్ని లేవదీయటం, తాతా మనమలంగావటం, ఆయనతో సహా భోజన శయ్యాసన సరస సల్లాపాలమరటం, సార్వభౌముని సందర్శనాని కాయనే నన్ను తీసుకు రావటం, ఇంతవరకు తటస్థించింది. ఇంక సమయానుసారంగా భాషను కూడా మార్చి పండితవేషాన్ని బాగా పోషిస్తా అసలు సరుకేటులున్నా కావలసినంత శ్రుతపాండిత్యం, సమయస్ఫూర్తి, యుక్తిప్రయుక్తులు, ఎంతవారినైనా యెదిరించి మాట్లాడటం- ఇంతవరకు లోపంలేదు కదా? సమయంవస్తే కాస్తో కూస్తో అన్ని ప్రజ్ఞలు కూడా కనపరుస్తానుగదా? దీనితో కావలసినంత

ప్రివేశ గౌరవాన్ని కలగించుకోస్తా. మరచా, సార్వభౌముడు మహా ప్రిజ్ఞాశాలి యని, బాహుబల సమగ్రుడని, జాలవిద్యా ప్రివీణుడని అన్నారు. ముందుగానే యెత్తుకు పై యెత్తుగా ఆతని గుండె నీరై పొయ్యేలాగు మాట్లాడాలె ? ప్రిభు సన్నిధిలో ఇంకా మంత్రులు, పండితులు, కవులు, గాయకులు వారు వీరు ఎందరో వుంటారు? వుండనీ. ఈతికానికి సుళ్లలెక్కఏమి? లోతుతో నేమి పని? నల్ల మడుగులోనికి మొసలివలె మహామంత్రితో ఆస్థానంలోనికి ప్రవేశించి నాబుద్ధి బలాన్నంతా వుపయోగిస్తా. దాని కేదిసాధ్యం కాదో విచారిస్తా. దైవానుగ్రహం ఎందుకు కలుగదో యోచిస్తా ? [అని పోఁబోయి స్మరణ మభినయించి] ఇది యేమి ? బుద్ధి బలమే సర్వమును సాధిస్తుందనే నేను, ఇంద్రాదులకు సైతము వెరపు గరపించిన ఆదిదానవశేఖరుల కిరీటములపై, కిరీటముగ వెలింగిన నేను దైవాలను, గియివాలను లెక్కించుచు వారి యనుగ్రిహము నపేక్షించుటయా ? ఇది కేవలము వెఱ్ఱితనము. నా బుద్ధిబలమే నాకు సర్వ విజయ సాధనమై విరాజిల్లగలదు. కానిమ్ము, ప్రిభుదర్శనావకాశ మొనరించి మంత్రివర్యుడు రాగలడు. ఇంతలో నీ వనవిచిత్రి ముల నవలోకించు చుండెద.

[అని పోఁ బోయి ముందుఁజూచి] ఎవరది ? [వినుట నభినయించును.]

వజ్రి—[తెరలో] పురోహిత వర్యులారా ! కాలనేమి మహారాజునకు నా నమస్కృతులు చెప్పుడు. మీరు వచ్చినపని తప్పక నెఱ వేఱఁగలదు. ఇంక నాకు సెల వొసంగుఁడు.

పురోహితులు—[తెరలో] మంచిది. ఇంక మేము పోయి వచ్చెదము. అనుగ్రిహ ముంచుము.

మణి—వస్త్రభూషణాది సమ్మానితులగు నీ పురోహితు లెవ్వరు? కాల నేమి మహారాజునకు మహామంత్రి నమస్కారా లెందులకు? [యోజన నభినయించి] ఆ మహారాజునకు బృంద యను పుత్త్రిక యుండెనని వినియుంటిని. ఆమె నీ సార్వభౌమున

కిచ్చు ప్రయత్నము కాదు గదా! అట్లయైన, రాజమంత్రులతో సంబంధ బాంధవ్యములు చేయఁదలఁచిన నా కియ్యది నా యభీష్టమున కంతరాయమే. ఇపుడేమి చేయవలె? [అని యోజన నభినయించు చుండును]

వజ్రి—[ప్రవేశించి] మణిగ్రీవ మహాశయా! రండు, సార్వభౌముని దర్శింతము.

మణి—మంత్రిశేఖరా! మీ యాదరమున కెంతయు కృతజ్ఞుఁడను. మంచిది, అటులనే పోవుదము [అని నిష్క్రమింతురు.]

[మందిరమున జలంధరుఁడు కూర్చుండి యుండును.]

జలం—[చిత్రపటమును జూచుచు] ఆహా! ఏమి యీ రామణీయకము. శరప్రయోగ నైపుణ్యమున నన్ను వశునిఁ జేసి నా హృదయారవిందమున నధివసించిన యీ సుందరనామధేయుఁడే యీ బృందయనుటకు సందియము లేదు. ఈ సుందరి నెట్లుకనుంగొందును? ఆ మందయాన కరగ్రహణ మహానంద సామ్రాజ్యము నెట్లందగలుగుదును? [యోజన నభినయించి] మిత్రమా. వజ్రికంఠా!

వజ్రి—[లోపలినుండి] దేవా! ఇదె వచ్చుచున్నాను [అనుచుఁ బ్రవేశించి] సార్వభౌమా! మా గృహమునకు విచ్చేసిన ప్రాచీన దానవ రాజన్యమహామంత్రులు పండితవరేణ్యులు మణిగ్రీవ నామకులు దేవర దర్శనము నపేక్షించుచు వచ్చుచున్నారు.

జలం—నేఁడు రమ్మని యాజ్ఞ యిచ్చితిమి కదా! మంచిది ప్రవేశపెట్టుము. [అని పటమును బ్రక్కనుంచును.]

వజ్రి—అయ్యా! దయచేయుఁడు.

మణి—[ప్రవేశించును.]

జలం—పండిత వర్యులకు జలంధర నాముఁడిదె నమస్కరించు చున్నాఁడు దయచేసి పీఠము నలంకరింపఁ జేయుఁడు!

మణి—జయతు జయతు దానవకుల సార్వభౌమః.

శ్లో. జయతు జయతు దైతేయాన్వవాయాబ్ధి చంద్రః
జయతు జయతు లోకత్రాణ దీక్షా కటాక్షః

జయతు జయతు దేవానీకవంద్యప్రభావః
జయతు జయతు దీనోద్ధారక స్సార్వభౌమః.

[అని అక్షతలు చల్లి ఫలముల నొసంగి యాసీనుఁ డగును]

వజ్రి—ఆర్యా! తమనివాస మెచ్చట? ఎచ్చటనుండి వచ్చుచున్నారు?

మణి—స్వవిషయ మంతగాఁ జెప్పుకొనుట తగనిపని యైనను నవీనుఁడ నగుటచేఁ గొంతలోఁ గొంతయైనఁ జెప్పుకొనక తప్పదని, సార్వభౌము లాత్మస్తుతిగాఁ దలంప కుందురు గాక యని మనవి చేసికొనుచున్నాను.

జలం—మే మన్యథా తలంపము. చెప్పుడు. సర్వమును జెప్పుడు.

మణి—

మ. మును వెల్గందిన దైత్యరాడ్వరుల పెంపుఁ సొంపు దీపింప, మం
త్రిని, సైన్యాధిపతిన్, సుహృత్తునయి పేర్మింబొంది త్రైలోక్యపా
లనఁ జేఁగూరిచి నేఁ దపోనియతిఁ గాత్రిలన్, దివ్యు లాశౌరి వం
చన మా నేతలఁగూల్చి పోయి రన నాశల్ బాసె నా కయ్యెడన్.

జలం—ఏమేమీ?

మణి—

[పై పద్యమును మఱలఁ జదువును.]

జలం—[ఆశ్చర్యముతో] ఔరా! ఎంతపని జరిగినది! తరువాత?

మణి—ప్రభువులు లేని పరవిజయము బూదెలో వేయు నాహుతిగాఁ దలంచి కాయకసరులఁ గాలము పుచ్చుచు సకుటుంబముగఁ గానలయందే వసించితిమి.

జలం—ఏమీ! మీ రాశ్రమవాసులై వనమున నుంటిరా?

మణి—పరార్థమై ప్రభువులకు సర్వవిధముల సహాయ్య పడుటయేగాని స్వార్థపరులై పండితులు ప్రభుత్వపదవి నలంకరింపనేరరు. మన్ననల నెఱుంగని మహారాజుల మనస్సున నైనఁ దలంపబోవరు. సముద్రము చెలియలికట్టను బోలె నీతిపరులు నియమములను దాటఁజాలరు. అదియే కారణము గాకున్న మా కీ వనవాసమేల?

శౌర్యసాహసాలంకారులై దానవకులవిభూషణులై పరోపకార పారీణులగు మిమ్ములనే దీక్షను విడనాడి సందర్శింపనేల?

శా. అన్యాలోకనభీకరుండ నయి మా♦యాశక్తి వేహావులన్
జన్యక్షోణిఁ జరింప వజ్రియయినన్ ♦ స్వారాజ్య మర్పింపఁడే
మాన్యుల్ దిక్పతులున్ బృహస్పతియు స♦న్మానంబులం దన్పరే
విన్యస్తాత్మయశోవిభూషు లగుచున్ ♦ వేల్పుల్ ననుఁ గొల్వరే.

అంతటి సామర్థ్యము లుండియున్నను మా నియమము లా యౌన్నత్యమును లెక్కింపవు. ఎట్టి కష్టమున కైనఁ జింతింపవు. మేము వనవాసమునకు విచారింపము. దైత్యకులాలంకారమై యశోనురూపమగు మీ మూర్తియు మీ ప్రాభవోన్నతులును నా కనుల కఱవుదీర్చినవి. హృదయమునకు విశ్రాంతిఁ జేకూర్చినవి. మా జపతపంబులు ఫలించినవి. ఇంకను మీ యభివృద్ధికై మంత్రదేవతల నారాధించుచుండెదము. అనుజ్ఞ యిండు. పోయి వచ్చెదము!

జలం—ఆర్యా! మీశక్తి యసమానము. మీ నీతినియమంబు లెంతయు దృష్టిఁ గలిగించుచున్నవి. భాగ్యవశమున విచ్చేసిన తపోనిష్ఠా గరిష్ఠులును మహానియమవంతులు నగు మీవంటి సర్వశక్తి సంపన్ను లుండుట యరుదు. అట్టి తమవంటి యుదారచరిత్రులే యీ దానవసామ్రాజ్యమునకుఁ భూషణపాత్రులై సర్వదా మాకుఁ బూజనీయులు కాఁగలరు. సామ్రాజ్యాభివృద్ధికై మాకు నదుపదేశము లొనరించుచు మీ రిందే యుండఁగలందులకు మిమ్ముఁ బ్రార్థించుచున్నాను. వజ్రకంఠా!

వజ్ర—దేవా!

జలం—వారి కుటుంబమును దోడ్తెచ్చుటకుఁ దగిన ప్రయత్నము లొనరించి యుచిత వసతుల నేర్పఱపుము. పెద్దల కిప్పు డేమియు శ్రమ నీయవలదు. పిమ్మట జాలవిద్యావిశేషములను నితరవిషయము లను దెలిసికొందము. [జనాంతికముగ] ఉచితసత్కారము లొనరించి విడిది కంపివుచ్చుము?

వజ్ర—చిత్త మట్లే గావించెద. [తెరవంకకుఁ దిరిగి] ఎవఁడురా అక్కడ?
భటు—దేవా! [అని ప్రవేశించును]
వజ్ర—[కనుసంజ్ఞ, హస్తసంజ్ఞ చేయును]
భటు—[వస్త్రభూషణాదులతోఁ బళ్ళెరమును దెచ్చును]
వజ్ర—అయ్యా! గ్రహింపుడు. [అని తాంబూలము నొసఁగి హారమును వేసి పళ్లెరము నిచ్చును.]
మణి—సార్వభౌముల యాదరమున కెంతయుఁ బాత్రుఁడనైతిని. పునర్దర్శనమునకై యాజ్ఞ యిండు. పోయి వచ్చెద?
జలం—మంచి దటులనే కానిండు? [నమస్కరించును]
మణి—సామ్రాజ్యాభివృద్ధిరస్తు? మనోవాంఛాఫలసిద్ధిరస్తు? [అని వెడలుచుండును]
వజ్ర—[సేవకునకు సంజ్ఞజేయును]
భటు—[పళ్లెరమును గ్రహించును]
వజ్ర—[జనాంతికముగ] ఆర్యా! మీ రీతనితో మన గృహమున కేగుఁడు. నేను పిమ్మట వచ్చెదను.
మణి—చిత్తము [అని భటునితో నిష్క్రమించును]
జలం—వజ్రకంఠా! ఈతఁడు ప్రజ్ఞాశాలివలెఁ గానిపించుచున్నాఁడు.
వజ్ర—మహామేధావి. మిక్కిలి చతురుఁడు. గొప్పపండితుఁడు.
జలం—మఱియొకమా రీతనితో ముచ్చటింతము.
వజ్ర—పండితుల సమక్షమునఁ బరీక్షించుట యుక్తము.
జలం—అటులనే గావింతము. కాని వజ్రకంఠా! బ్రాహ్మణు లొసంగిన చిత్రపటమును జూచితివా? [అని చిత్రపటమును గ్రహించును]
వజ్ర—లేదు.
జలం—చూడుము [అని చిత్రపటము నిచ్చును]
వజ్ర—[చూచి యానందముతో] అమందానంద సంధాయకుఁడై భవదాదరణ పాత్రుఁడైన యా సుందరనామకుఁడే బృందాదేవి. ఇంక సందియమేమి? చిత్రపటమువలెనే బృందాదేవికూడ మీ సన్నిధి నలరారు ననుటకుఁ గాలనేమి మహారాజు పంపిన యీ పటముతోఁగూడిన సందేశమే నిదర్శనము.

జలం—వజ్రకంఠా! చిత్రగత రూపమునకు సహజరూపమునకు ఎంతభేద ముండునో తెలిసికొన నా హృదయ మాందోళించు చున్నది.

వజ్ర—అయిన మీ కీ సందియమేల? ఇంద్రుఁడొసఁగిన దివ్యవిమాన ముపై బృందామందిరప్రాంతమునకుఁ బోవుదము. సంశయము తీరి మీకుఁ గను విందు కూడ కాఁగలదు?

జలం—మిత్రమా? చక్కఁగ యోజించితివి. రమ్ము పోవుదము. [అని యిరువురు నిష్క్రమింతురు]

[బృందాదేవి గృహోద్యాన వనప్రాంతము]

సరళ—[ప్రవేశించి యటునిటుఁజూచుచు] బృందా! బృందా! ఏదీ బృంద? మొన్న వింధ్యాద్రికడనుండి వచ్చినది మొదలు చదువులేదు సాధనములేదు! ఆటలులేవు పాటలులేవు. చివఱకుఁ బ్రాణతుల్యను నేనుగూడ దగ్గరనుండరాదు. అబ్బ! ప్రణయ మెంత మధురమోకాని ఆ విషయమైన మాటలనుగూడ నితరులకుఁ జెప్పనీయదు. తనకుఁ దానే నెచ్చెలి, తన మనస్సే తన బంధువు. కానిమ్ము [పార్శ్వమునఁ జూచి] అదిగో! బృంద యందుండి యేమో యోజించుచున్నట్లున్నది? నే నేల నా యాలోచనల కంతరాయము కల్పింపవలె? నెచ్చెలులతోఁ గలిసి యాటపాటలతోఁ గాలము గడపెద. అవసరమయిన నా సఖియే నన్న న్వేషించును.

[నిష్క్రమించును.]

[ఉద్యానవనము]

బృంద—[స్ఫటికశిలాతలమునఁ గూర్చుండి పైనిఁజూచి పరికించి లేచి ముందునకు నడిచి యాగి నిట్టూర్చి] ఔరా! నాకేమియుఁదోప కున్నదే? నేనేమి చేయుదును? [వెనుకకు వచ్చి కూర్చుండి నిట్టూర్చి] బాహ్యేంద్రియజ్ఞానమున కతీతమై మనంబును సైతము వివశము చేయుచున్న దిది విధిప్రేరణమా? మనఃపరి

ణామమా? ప్రకృతినంతయు బంధించు నిట్టి సంబంధసూత్రమున కర్థము తెలియుట యసాధ్యము ?

సీ. ఘనవైభవాభోగ♦కలన మందక యున్న
వెలయునే క్రొమ్మిర్మించు ♦ చెలువ కలిమి
భానుకరస్పర్శ♦భాగ్య మబ్బక యున్నఁ
బొడసూపునే తమ్మి♦పొలఁతి చెలువు
లలితభూరుహభుజా♦లంబ మూనక యున్న
నడరనేర్చునె తీవ♦పడఁతి సొబఁగు
కమనీయమాధవా♦గమశోభఁ గనకున్నఁ
దేజరిల్లునె వనేం♦దిర బెడంగు

గీ. నిండుచందురు పండువె♦న్నెలలు లేక
గ్రాలఁగా నేర్చునే నిశా♦కాంత యొఱపు
రమణి కెప్పుడైనఁ దన్మనో♦రమణుఁగూడు
కల్మియే కల్మి, వేఱొక♦కలిమి ఫలమె ?

జలంధరసార్వభౌమా! నీ దర్శనభాగ్య మెప్పుడైనఁ గలుగ నేర్చునా? ఎప్పటికైనఁ దమితీర నిన్ను సేవించెడి యదృష్టము గాంచఁ గలుగుదునా ?

గీ. శివుని నయనాగ్నివలన సం♦భవమునొంది
యమరతతిగొల్వ లోకత్ర♦యంబు నేలు
దానవకులాబ్ధిశశి జలం♦ధరవిభుండు
కనునె? నన్నేలుకొనునె? నా♦మనికి యగునె?

దుర్లభము ! దుర్లభము! ఆ సార్వభౌముని దర్శనభాగ్యము మిగుల దుర్లభము? [అని నిట్టూర్చుచుఁ గనులు మూయును.]

[తెరలో] సఖీ! సఖీ! [అని చెలులు పిలుతురు.]

బృంద—[వినుట నభినయించి యిటు నటుఁ జూచుచుండును.]

చెలులు—[ప్రవేశింతురు].

ప్రథమ—నెచ్చెలీ! బృందా? ఆటలాడు మమ్ము వదలి యిచ్చటి కెప్పుడు వచ్చితివమ్మా ?

బృంద — ఇప్పుడే ?

ద్వితీయ—అటులనా! సరే! అయిన మన మీనాంకు డే దేవునిఁ బూజింతము?

సరళ — బాలికలకు ముఖ్యముగఁ బూజనీయుఁడు మదన దేవుఁడు. ఆతనినే పూజింతము.

ప్రథమ—అట్లయిన నా దేవునిఁ జిత్రించువారెవ్వరు?

సరళ—చిత్రలేఖనప్రవీణ బృందగాక మఱియెవ్వరు లిఖింతురు.

ద్వితీయ—అయిన మనము పూజాద్రవ్యములు గైకొని వత్తము. ఈలోన బృంద మదనమూర్తిని వ్రాయును.

సరళ—మంచిది. అటులనే గావింతము. చెలీ ! లేఖకసాధనము లివిగో.
[అని లేఖక సాధనము లుంచి నిష్క్రమింతురు.]

బృంద—[చిత్రఫలకమును దీసికొని యోజన నభినయించుచు] మదనుఁడా? మదనుఁడు! ఎవ్వరా మదనుఁడు? [తలయూచి] ఔను!

గీ. మానితాకారుఁడై మహా♦మహిమఁ గాంచి
విశ్వవిఖ్యాతిఁ గనుఁగొన్న ♦ వీరవరుఁడు
మన్మనంబున నెలకొన్న ♦ మన్మథుండు
గాక వేఱొండు మదనుండు ♦ కలఁడె భువిని.

ఔను, శతకోటిమన్మథుఁడు, భువనైక మన్మథుఁడు, మన్మథ మన్మథుఁ డాతఁడే! ఆ లేమావిగున్నక్రిందఁ గూరుచుండి చేతులార నాతని దివ్యరూపమునే వ్రాసెద ? [అని చిత్రఫలకమును దీసికొని యావల కేగును.]

[జలంధర వజ్రకంఠులు ప్రవేశింతురు]

జలం — వజ్రకంఠా! ఆ సౌందర్యరాశి నెట్లు చూడఁగలను? ఇందే యుండునని యెట్లు నిశ్చయింపఁగలను?

వజ్ర—సార్వభౌమా ! వసంతకాలము, సాయంసమయము, ప్రమదావనము. మీ రిందే యుండుడు. పరికించివచ్చెద.[నిష్క్రమించును]

జలం—[నిట్టూర్పుచు] ఆహా ! ఆ మధురాకృతి కనులఁ గట్టినట్లగపడుచుండియుఁ గానరాకున్నదే ? ఏమిసేయుదును?

గీ. విశ్వసౌందర్య మొకట నా◆విర్భవించి
వెలయుగతిఁ దోఁచుచుండె నా◆చెలువ యదిర
వీరరస మేచి యటుఁదాండ◆వించె ననఁగ
తరుణి గన్పట్టె నుత్సాహ◆సరణి నౌర!

విధాత యొనర్చిన సర్వజగన్నిర్మాణములో వనితానిర్మాణ మసమానము.

గీ. సుదతుల సృజించునప్పు డ◆మ్మొదలి వేల్పు
రూపమున విభ్రమంబులఁ ◆ జూపులందు
మచ్చుమందుంచె లేకున్న ◆ మచ్చెకంటి
కంటఁబడ నెమ్మనం బిట్లు ◆ కుంటువడునె?

నియమబద్ధుండనై పరమనిష్ఠాగరిష్ఠుఁడనైన నన్నాకాంత యెంతలో వలవంతపాలు గావించినది? ఔరా! సుందరీ ప్రభావము !

చ. పురుషుఁడనై జనించినను ◆ భూరిపరాక్రమ విక్రమంబులన్
వఱలిన సత్తపోమహిమ ◆ వాసిఁ గడించిన లాభమున్నె, సుం
దరి నిడువాలు చూపుగమి◆తాకున వింతవితాకు దోఁచె, భా
సురరమణీముఖాబ్జరుచిఁ ◆ జొక్కక యుండిన నుండనేర్తునే?

కానిమ్ము! ఆ మందయానచరణారవిందచిహ్నిత మగు నీ ప్రదేశము వెదకిచూచెద. [అని నిష్క్రమించును]

బృంద—[చిత్తరువును వ్రాసి సవరించి చూచి సంతసముతో] సార్వభౌమా ! నీమూర్తి యసమానము. నీ ప్రతాపప్రభావంబు లనిర్వాచ్యంబులు. నిన్నెవరు పోలఁగలరు ?

మ. వదనం బుజ్జ్వలమై దనర్చుఁ గను ల◆బ్జద్వంద్వముం దీర్చు శ్రీ
సదనం బట్టులఁ బేర్చుఁ బేరురము భా◆స్వచ్ఛౌర్య సంపన్నుఁ డా
త్రిదశాధీశకిరీటకోటిమణిసం◆దీప్తాంఘ్రిపద్ముండు, నా
హృదయాధీశ్వరుఁ డీతనిం దొరయు వా◆రెవ్వార లుర్వీస్థలిన్.

[సంతసముతో విలోకించి యానందపారవశ్యమున నుండును]

ప్రథమసఖి—[ప్రవేశించి ప్రక్కనుండి చిత్రపటమును జూచి యాశ్చర్యమునఁ దలయూచి వచ్చెదు చెలుల నాగు డని సంజ్ఞచేసి

యీ పటమును గ్రహించి] నెచ్చెలులారా! రండు! రండు! [అని పిలుచును]

బృంద—[చిచ్చువడి కోప మభినయించుచు] చెలీ! ఇది యేమే, ఇట్లు చేసెదవు? [అని గ్రహింపఁబోవును]

ప్రథమసఖి—[ఆవలి కేగి పటము నీయక చిరునగవుతో] ఏమిచేసితిని? నీ చిత్రకళా ప్రావీణ్యమును గనులారఁ గాంచుట కుత్సహించితిని. నెచ్చెలులారా! రండు! రండు! [అని పిలుచును]

[అందఱు సమీపింతురు]

ద్వితీయ—[ఉత్సాహముతో] ఏడీ మదన దేవుఁడు? [అని చూచి యాశ్చర్యముతో] చెలీ! ఇతఁడెక్కడి మన్మథుఁడే, యిట్లున్నాఁడు? [అని వికటముగా నవ్వును]

ప్రథమ—అది యేమే, అట్లు నవ్వెదవు?[అని దానిపైఁ గోపమభినయించి నవ్వాపుకొని] నెచ్చెలులారా! చూడుఁడు! క్రొత్త శిల్పము, అపూర్వమన్మథుఁడు. [అని చిత్తరువును పైకెత్తి యందఱకుఁ జూపును]

అందఱు—[నవ్వుదురు]

ప్రథమ—చెలీ! ఈతఁడెప్పుడైన నీ కలలోఁ గాన్పించెనా? లేక నీకంటికే కనఁబడెనా? ఈ యుగ్రకోదండము, ఈ బాణతూణీరములు, ఈ దీర్ఘభుజములు, ఈ విశాలవక్షము, ఈ మహోన్నతాకారము, కలవాఁ డీతఁ డెక్కడి మన్మథుఁడే?

ద్వితీయ—పుష్పబాణము లెక్కడ, చెఱకు విల్లేది, లలితాకృతి యెచ్చట? బృందా! శంబరాసురవైరిని వ్రాయఁబోయి శంబరాసురుని వ్రాయలేదుకదా! [అని నవ్వును]

అందఱు—[నవ్వుదురు]

సరళ—అదియేమే? ఈ మూర్తిమాత్రము చక్కఁగ నుండలేదా?

ప్రథమ—ఉండవచ్చునుగాని యీతఁడే కుసుమశరుఁ డందువా?

సరళ—కాకున్న మీ మన్మథుని మీరు వ్రాసికొనుఁడు.

ద్వితీయ—బృందా! నీ మన్మథుఁ డీతఁడేయైన ఈతనిని నీవే పూజించుకొనుము.

అన్య—మన కీ మన్మథుడూ వద్దు, గిన్మథుఁడూ వద్దు. ఆడుకుందాం పదండి ? [అందఱి చేతులను లాగును]

అందఱు—[నిష్క్రమింతురు]

బృంద—[చెలులు వోవుటను జూచి తలయూచి చిత్తరువును గ్రహించి విలోకించి] ఆహా ! నా నెచ్చెలు లెంత తెలివిమాలినవారలు. చెఱుకువిల్లును పూవుటమ్ములును లేవఁట. మన్మథుఁడు కాడఁట. ఈతని నొక్కమాఱు గాంచి యీతని మగంటిమి వీక్షించిన నెవ్వరైన నితరులఁ బురుషులఁగాఁ బరిగణింతురా ? మన్మథుని గిన్మథునిఁ దలంతురా ? మనోహరా ! నీ వెంతటి పరాక్రమ వంతుఁడవు. నే నెంతటి యదృష్టవంతురాలను.

ఉ॥ ఆటల వేడ్కఁజేసి చెలు ♦ లౌనని కాదని యందురాక నీ
సాటిమనోజ్ఞమూర్తి గుణ♦సన్నుతుఁ డాఢ్యుఁడు శౌర్యరాశి ము
మ్మాటికి లేడులేడని ప్ర♦మాణ మొనర్చి వచించుదాన నీ
బోటి మహోన్నతుండు ననుఁ♦బ్రోచెఁ గృపామతి నెంతభాగ్యమో.

వింధ్యగిరిప్రాంతమున న స్నానవిధి నాదరించిన ని న్నీ పూజా పరికరంబులఁ బూజించి కృతజ్ఞురాల నయ్యెద. [అని చిత్తరువునుంచి పూజాపరికరంబులు సర్దుచుండును.]

జలం—[దూరమునుండి చూచి] ఆహా ! ఏమి యీ మనోహరాకృతి సాటిలేకున్న దే ! ఆ సుందరియే బృంద కావచ్చును. సమీపించి యీ ప్రతిమారాధనను గురించి విచారించెద. [నిష్క్రమించును]

బృంద—ఓం ఈశ్వర తనయాయనమః ఓం మహావీరాయనమః ఓం సురలోకపాలార్చితాయనమః ఓం బృందామనోహరాయనమః ఓం జలంధర సార్వభౌమాయనమః [ధూపదీపాదుల నొసంగి నివేదన చేసి,

గీ. మహితరూప యిదే నీకు ♦ మంగళంబు
మాన్యభుజబల యిదె నీకు ♦ మంగళంబు
మధురనామ యిదే నీకు ♦ మంగళంబు
మామకహృదీశ నీ కిదే ♦ మంగళంబు.

[అని హారతి నిచ్చి] దేవా! విగ్రహారాధనమున సంతసించి వేల్పులు సన్నిధి కరుదెంతు రని విందును. నీవు నా కేల దర్శనభాగ్యము సమకూర్పవు. న న్నేల యుద్ధరింపవు. మనోహరా!

శా॥ బాణాఘాతమునోంపఁ దేర్చి ప్రియ మొప్పన్ బాణిఁ జేదార్చి వి
న్నాణంబార శరప్రయోగమనుచున్ నా చెల్మి నర్థించుచున్
రాణంజూపితి వెంతయో యెటుల నీ రమ్యాకృతింగాంతు? నా
ప్రాణం బుంచెద నీదు చిత్రమున నన్ బ్రాణప్రియా! ప్రోవవే.

సార్వభౌమా! పరమమాహేశ్వరుఁడవై సకల సురాసుర జేగీయమానుండ వగు నిన్ను నే నపేక్షింపఁ దలంచుట యమృతాంశువు నఱచేత నందఁదలంచు విధము కాకమానదు. అయిన నీ పరోపకార పారీణతయే న న్నభ్యర్థురాలినిఁ జేయుచున్నది.

చ. అతులిత రూపసంపదల కర్హ నటం చనికాదు, లోకసం
స్తుతమగు శౌర్యలక్ష్మికి సరిదూఁగుదు నే ననికాదు, విష్టప
త్రితయము నేలు దీవని మదిందలపోయక కాదు, దేవ! సం
శ్రితజనవత్సలుండ వని చేతులు మోడ్తు ననుగ్రహింపవే.

[అని ధ్యానము నటించును].

జలం—[పటమును బూజాదికమును జూచుచు నానందము నభిన యించుచు బృందాభిముఖముగాఁ బటము వెనుకకుఁ జని] అభీష్టా వాప్తి రస్తు.

బృంద—[రిచ్చపడి సంభ్రమాశ్చర్యములతో విగ్రహమును జలంధరుని జూచి సిగ్గిలి వెనుకకుఁ జనును.]

జలం—సుందరీ! ఏల తొట్రుపడియెదవు. ఏల సిగ్గువడియెదవు.

గీ. తత్తరపడంగనేల యో తరళనయన!
యర్చన మొనర్చు వేల్పు ప్రత్యక్షమైనఁ
దనరి వరముల వేడంగఁ దగునుగాని
బేలతన మూని తొలఁగె దీ లీల తగునె?

బృంద—[వే ఱొకవంకకుఁ దిరిగి] వనపాలకు లెచ్చట? ఏమిసేయు చుండిరి.

జలం—తరుణీ! వా రేమిసేయుదురు. మనం బుండవలెఁగాని మార్గము లుండకుండునా? కనులారఁ జూచిన నీ యనురాగమునకు మేర యుండునా?

చ. శరము శరాసనంబుఁ గొని ♦ సామజముం దివి నాపువేళ, నిన్
బురుషునిఁగాఁ దలంచియును♦ మోహము నొందితి, నీ విలాసముల్
గర మలరించెఁ గమ్రకర♦కంజముసోఁకి చెమర్చె మేను, సుం
దరి! భవదాకృతిన్ గనఁగఁ, ♦ దాలిమి దూలితి నేమి తెల్పుదున్.

ప్రేయసీ! ధృతిమాలిన నన్నేల యలయించెదవు. ఒకింతసేపు నా యంకపాళి నధివసించి నా యభీష్టము నెఱవేర్పుము. [సమీపించి] రమణీ! కన్నులచేతనైన గారవింపక మాటలచేనైన మన్నింపక నన్నవశునిఁజేయు నీ చాతుర్య మెంత యని కొనియాడుదును.

చ. విలసితవాగ్విలాసముల ♦ విస్ఫురదంచల వీక్షణంబులన్
గలఁతురు పూరుషావళినిఁ ♦ గాంతలఁటంచును విందుఁగాని, త
ద్విలసనముల్ దొఱంగియును ♦ విశ్వవిభున్ నను నాఁచికొంటి వే
వలనున నేర్చితిట్టి ప్రభు♦వశ్యవిధానము లో తలోదరీ!

ప్రియా! రమ్మీ! నా యంకపాళి నధివసింపుము. [అని చేలాంచలము పట్టుకొనును.]

బృంద—[సంభ్రమముతోఁ జెఱగు లాగుకొనుచు] సరళా! సరళా! [అని పిలుచును.]

జలం—దేవీ! సరళకంటె సరళముగ నీతఁ డుపచరించునే! ఇంక సరళ యెందులకు?

చ. కరఁగుచునుండె నీదు తిల♦కం బిదె దిద్దుమఁటందువా? విరుల్
దొరఁగుచునుండె వేనలిని ♦ దువ్వి నెఱుల్ కయిసేయుమందువా?
పఱచెదఁ బయ్యెరం దెరలు ♦ పయ్యెద నొయ్యన దీర్పుమందువా?
తరుణీ! యికేల యా సరళ? ♦ తావకసేవకుఁ డీత డుండఁగన్.

సమకూర్పు మీతనికి నీ సేవాభాగ్యమును సమకూర్పుము. [అని సమీపించును.]

బృంద—[(కేగంటఁ జూచి వెనుకకుఁ జని శిరము వంచుకొని] ఆదర మతి
వేలము. పూజ్యులయెడ నా కిట్టి వ్యతిక్రమము తగదు.

జలం—అవును! మఱి యిది యే మందువు?

సీ. వేఁబోక నుతిసుధా♦వృష్టిఁ దేల్చితిగాని
చిరునవ్వు వెన్నెలల్ ♦ చిలుకవైతి
కపురంపు గందముల్ ♦ కై సేసితివిగాని
కలప మింతేని మై ♦ నలఁదవైతి
పూవుటెత్తులఁదమిం ♦ బూజించితివిగాని
విరినైన నలవోక ♦ విసరవైతి
పదపంకజము లంటి ♦ ప్రణుతిచేసితిగాని
వంచిన తలయెత్తి ♦ కాంచవైతి

గీ. చిత్తరు వదేమి పున్నెముల్ ♦ చేసె నొక్కొ-
సలుపనైతినె తొలిపుట్టు♦వులను సుకృత
మాదరముఁ జూపవైతి వి♦య్యతిథి, సార్వ
భౌముఁ, జెలికాని నెడ సేయఁ ♦ బాడియగునె.

బృంద—[సానురాగముగఁ జూచి నిట్టూర్చి] క్రీడాసక్త లగు బాలిక
లకుఁ బుడమిఱేఁడుల మేలిమి నెఱుంగు టెట్లగును?

జలం—బాలా! ఎంత బేలవు. ఎఱుఁగకయే యీ చిత్రమును సేవించితివి
కాఁబోలు.

బృంద—అటులైనఁ బ్రత్యక్షమునఁ జేయు నాదరమునకంటెఁ బరో
క్షాదరము ప్రశంసనీయమే కదా?

జలం—నా కట్టులే కావచ్చును కాని నీకు మాత్రమిటు లుండుట
యుక్తము కానేరదు.

గీ. కరము దలపోయు వస్తువు ♦ కంటఁబడిన
స్వాంత మలరంగఁ గనుట ♦ స్వభావ మవని
భాస్కరునిరాక పద్మినీ♦పద్మనయన
తేటి గనుఁ గాని కన్మూసి ♦ యూరకొనునె?

బృంద—అత్యున్నతపదవిహారియైనను ఆదిత్యుఁ డాశ్రితానురాగి. కమ

లిని పుణ్యాత్మురాలు. అంతటి యనురాగసంపద యన్యులకు
లభించుట మిగుల దుర్లభము.

జలం—[ఎలనగవుతో] అది యేల?

బృంద—

ఉ॥ బాలిక లాటపాటలనె♦పంబున నెద్దియొ పల్కుచుంటచే
చేల లటందుఁ వారలను ♦ ప్రేముడి గల్గినఁ గల్గుఁ గాక దే
వాలి తలంకగాఁ ద్రిభువ♦నాధిపతిత్వముఁ గన్న మేటికిన్
బోలఁగ నౌనె నా కకట ♦ పొందగ శక్యమె యట్టియోగముల్.

జలం—రమణీ! ఏల యిట్లు పలికెదవు!

గీ॥ విశ్వమోహనములు రూప♦విభ్రమములు
కరగతమ్ములె ధనుష్కళా♦కౌశలమ్ము
నిరవధికమైన దీ మనో♦నియతి యట్టి
కామినీమణి గనని యో♦గంబు కలదె?

మనోహారిణీ! నిశ్చయాభిప్రాయ మాలకింపుము.

మ॥ లలనా! నాదగు వైభవంబు లవి యెల్లన్ నీవియౌ దివ్యకాం
తలు సేవింపఁగ నీ జగత్త్రితయితో ♦ నన్నేలు మే వేళ నా
దల మాణిక్యమ వౌదు, పల్కులును స్వాం♦తంబుల్ తనుశ్రీలు క
ర్మలుదా మొక్కటిగా మహాప్రణయసా♦మ్రాజ్యోన్నతుల్ పెంపఁగన్.

ఇంక సంశయింపకుము. నీవే నాప్రాణము, నీవే నా యానందము, నీవే నా సర్వస్వము, రమ్ము! ఆ చలువరాతిన్నెపై నొకింత విశ్రమించి యానంద మనుభవింతము [అని చేయిఁ బట్టుకొనును.]

బృంద—గురుజనాజ్ఞ వడయక తరుణులకు స్వేచ్ఛ తగినదియా? [అని యనునయించి వెనుకకుఁ బోవును.]

జలం—[సమీపించి] మనోహారిణీ! నీ జనకుఁడు నిన్నొసంగెద నని పంపిన చిత్రపట మిది. అంగీకార సూచకముగ నా చిత్రపటమును గూడ పంపుచుంటిని చూడుము. [అని చిత్రపటములను బృంద కిచ్చి] అయినను నీపైఁగల విరాళిచే వచ్చిన నన్నాదరింపుము.

[బృంద చిత్రపటములను జూచుచుండ శిరము నిమురుచుఁ జెక్కిలికిఁ జెక్కిలిఁజేర్చి పటముల గాంచుట నభినయించును.]

సరళ—[తెరలో] బృందా ! బృందా ! [అని పిలుచును]

బృంద—
జలంధరుఁడు- } [రిచ్చవడుదురు]

బృంద—సరళ వచ్చుచున్నది, ఇంకఁబోవలయును. [అని పటముల నిచ్చి పోఁబోవును]

జలం—[ఆపి] సరళ సరళహృదయ. త్వరపడ నక్కరలేదు.

సరళ—చెలీ ! వేడుకపడి తెచ్చితిని. ఈ పూమాల నీ చిత్రగత దేవున కొసంగి శీఘ్రముగ నాతని ప్రసాదము వడయుము. [అనుచుఁ బ్రవేశించి బృందాజలంధరులఁ జూచి సంభ్రమాశ్చర్యములు కనఁబఱచును]

జలం—కటాక్షమాలచేఁ గరగి యీ దేవుఁడు కైవసమైన?

సరళ—అది నెచ్చెలి యదృష్టము. [సోల్లాసముగ] బృందా ! అభీష్ట దైవము నంతలోఁ బ్రత్యక్షము చేసికొన్న నీ నేర్పెంతని కొనియాడుదునే? శ్రమపెట్టక సాక్షాత్కరించిన నీ స్వామికి నీ హృదయాబ్జముతోఁ గూడ నీ పూసరము సమర్పించి నాకు సంతసమొనగూర్పుము ? [అని నెచ్చెలిచే జలంధరునకుఁ బుష్పమాల వేయించును.]

నెచ్చెలులు—[తెరలో] సఖులారా ! సఖులారా !

బృంద—సరళా ! నెచ్చెలులు వచ్చుచున్నారు, పోవుదము. [అని సంభ్రమించును.]

సరళ—మంగళవేషాలంకృతు లగు మి మ్మతిశీఘ్రకాలమునఁ జూడఁ గోరుచుఁ బోవ ననుజ్ఞ వేడుచున్నారము.

జలం—మంచిది, అటులనే కానిండు.

బృంద—[అనురాగముతోఁ జూచుచు నిష్క్రమించును.]

జలం—[చూచుచు నిట్టూర్చి] అక్కటా ? ఆ సౌందర్యరాశి యరుగుచుండెనే, యేమి చేయుదును.

గీ॥ పాణి నలరిన రాయంచ ♦ పఱచినట్లు,
మెఱయురతనంబు చేఁజాతి ♦ సురిగినట్లు
తళుకు లీనెడు క్రొమ్మించు ♦ తొలఁగినట్లు,
కనుల వంచించి చనెడు నా ♦ కలికి యౌర!

[చూచి నిట్టూర్చి] ఔరా! ఆ కాంత నన్నెంతలో నెంత మార్పు వేసినది.

గీ. వెలఁది నిడువాలు చూపులు ♦ విభ్రమములు
సౌకుమార్యంబు శీలంబు ♦ జాణతనము
నలమికొన నాదు నెమ్మనం ♦ బలరు నౌర
పుష్పలతికాపరిచ్ఛన్న♦భూజమట్లు.

[ముందునకుఁ జని మఱలఁ జూచి] ఆహా! ఏమి యా రామామణి సామర్థ్యము. అసమానముగ నున్నదే!

గీ. వితత విభ్రమ జాలంబు ♦ విసరివైచి
లీల ననుఁ గొనిపోవు నీ ♦ లేమ యౌర
కలికి కొనచూపు తూపులు ♦ గాడకున్న
తరి విరాగులు ధీరు లె♦ల్లరు నిజంబు.

[నిట్టూర్చి] కానిమ్ము, వజ్రకంఠుని గలిసికొని కాలనేమి మహారాజునకు నా కౌతుకము వెల్లడించి యభీష్టము నెఱవేర్చుకొనియెద. [నిష్క్రమించును.]

ఇది ద్వితీయాంకము.

---




# తృతీయాంకము



[భవనప్రాంతమున మణిగ్రీవుఁడు ప్రవేశించును.]

మణి—[దెసలుచూచి శిరఃకంపము చేయుచు] ఔరా! ఈ పెద్ద పెద్ద పందిళ్ళు, చాందినీలు, మణి తోరణాలు, ధ్వజాలు, అలంకారాలు నగరవైభవం జనుల ఉత్సాహం చూస్తే సార్వభౌముని పెళ్లి సమీపిస్తున్నట్టే తోస్తూంది. అక్కడక్కడ బృందాదేవీ జలంధర సార్వభౌముల పరిణయమహోత్సవమంటూ కూడా సువర్ణాక్షరాలు చెక్కిన ఫలకములు కనబడుతూ పెండ్లికూతు రెవరన్న సంశయమును గూడా తీరుస్తున్నయ్. వచ్చినవాణ్ణి వచ్చినట్లుండి సంగతి సందర్భం విచారించి, రాజమంత్రులతో నా మనుమరాండ్రి పెండ్లి రాయబారం విచారించకుండా కుటుంబాన్ని తీసుకురావటానికి పోవటంతో నా ప్రయత్నబీజాని కిప్పటి కేమీ పాదు కుదరకుండా వుంది. కాని పువ్వు నాశ్రయించిన చీమకు ఈశ్వరశిరస్సంబంధమున చంద్రికళలో అమృతం లభించినట్టు మహామంత్రి పరిచయం మూలంగా మరల సార్వభౌముని దర్శనం, జాలవిద్యాప్రదర్శనం, రత్నకంకణహారాది బహూకారం, ఉండటానికి భవనం, కుటుంబపోషణకుఁ దగిన పరిస్థితులు, కావలసినంత గౌరవం లభించినవికదా! ఇంక నా ప్రయత్న మేల ఫలింపదో నా బుద్ధి బలమున కేది సాధ్యము కాదో విచారిస్తా?

[ముందుఁజూచి] ఆ! అతడే మహామంత్రి. అక్కడనే వున్నాడు. పిలిచినా, పిలువకపోయినా పనివున్నా లేకపోయినా హడావుడి

గనబరుస్తూ చేతులకు చేతులు, బుజాలకు బుజాలు కలుపు కొంటూ అధికార్లతో అతిచనువుగా మాట్లాడుతూ అటు ఇటు తిరుగుతూ ఉండాలి. ఇదియొక గౌరవం. చూచేవారికి గుండె బెదరు. కానీ, మహామంత్రిని పిలిచి చూస్తా. [అని యటునిటుఁ జూచుచు] అరే! ఏడీ మహామంత్రి ? కనబడుతునే యెక్కడికో పోయినాడే [అని చూచుట నభినయించుచుండును.]

వజ్ర—[సంభ్రమముతో మణిగ్రీవునిఁ ద్రోసికొనుచు వేగముగఁ బోవును.]

మణి—[ఉలికిపడి చూచి యాతురతతో ముందుకుఁ జని సరాళించి కంఠము సర్దుకొని] మంత్రివర్యా! మంత్రివర్యా! [అని పిలిచి] అరే కనబడుతున్నా చూడరు, పిలుస్తున్నా వినిపించుకోరు, పరిచయ మున్నా పలుకరించరీ అధికార్లు నే మనాలె? 'మునుపే ముక్కిడి ఆపైన దగ్గు పడిశెం' అన్నట్లు రాజుగారి సేవలోనే కాలంజాలని యీతని కింక ప్రభువుగారి పెళ్లిలో చావటానికూడా తీరదు. కానీ మళ్ళీ పిల్చిచూస్తా. మంత్రివర్యా! మంత్రివర్యా! [అని పిలుచును.]

వజ్రి - [తొందరగా వచ్చి] ఎవరయ్యా ఆ అఱపు ?

మణి—ఎందుకయ్యా ఆ పరుగు ?

వజ్రి—[విసుకుతో] ఆ ఎందుకా? [తేఱి పాఱఁజూచి ఆదరముతో] ఓహో! మణిగ్రీవుఁడు తాతగారా? ఎవరో అనుకుంటిని. కాని నీ పనియేమో చెప్పుము.

మణి—బాగుంది. అట్లా అడుగు. పాడు దేవతల భయానికి కొండల్లో గుహల్లో దాగి చిరకాలానికి వచ్చినవాళ్లం, పాతవాళ్లం, ఎఱి గినవాళ్లం, పండితులం, బంధువులం, మిత్రులం, పిలుస్తుంటే; కాస్త మాటా మంతీ అక్కర్లా? ఏక గబగబ పరుగెత్తటమేనా?

వజ్రి—కాదు తాతగారు! ప్రభువుగారి పెండ్లిముహూర్తము సమీ పించుచున్నదా? చిన్న, పెద్ద అందఱినిఁ జూడవలెనా? మఱచి

నాను. దేవలోకమునుండి అక్కడనుండి అప్సరసలు రంభ ఊర్వశి మొదలగు దేవవేశ్యలు—

మణి—[సంతోషముతో వజ్రికంఠుని చేయిఁబట్టుకొని] ఆ, ఆ, ఏమిటీ? ఆ చిగురుమాట మళ్లీ చెప్పు?

వజ్రి—[చిఱునవ్వుతో]అప్సరసలు దేవవేశ్యలు రంభాదులు వచ్చుచున్నారు.

మణి—[సంతసముతో బుజము తట్టుచు] అహహాహా. ఎంతమాట చెప్పావోయ్! అమృతం గురిపించావోయ్! లడ్డూలు పెట్టావోయ్! వాళ్లంతా అబ్బా! నా ముద్దుల బరిగెలేనోయ్! నా బంగారు చిలుకలేనోయ్! చెప్పు చెప్పు [అని బతిమిలాడును]

వజ్రి—అయితే అయినారు కాని వారి కందఱకుఁ బెండ్లిసమయములో వసతులిచ్చి యాటలకుఁ బాటలకు అవకాశము చూడవలె. తొందరగా వెళ్ళవలె; ముందు నీ పని యేదో చెప్పు.

మణి— దేవతాస్త్రీలు, అప్సరసలు కూడా వస్తున్నారుగా! ఏంచక్కని పెళ్లోయ్! ఎంత పెద్ద పెళ్లోయ్! అబ్బ! ఆ రంభ యేం రంభోయ్! దాని సౌందర్య మేమోయ్; దాని విలాస మేమోయ్; ఎంత చుఱుకుదనమోయ్! ఎంతమాట నేర్పోయ్! ఒక దానవచక్రవర్తి దేవతల్ని చెఱఁబట్టి నన్ను కావలుంచితే నే నా దేవతల బుజాలెక్కి రంభయింటికి పొయ్యేవాణ్ణి.

వజ్రి—ప్రతిఫల మేమైనా వారికి ముట్టఁజెప్పితివా?

మణి—మూడురోజుల కొక్కమాటు. సంకెళ్ళూడ దీయించడమే?

వజ్రి—[ఆశ్చర్యముతో] ఆ, ఆ, ఏమీ చెఱఁబెట్టిన దేవతలను వదలటమే?

మణి—ఆ! వదలుటెంత? పట్టుటెంత? హరిహరులైన నేను పంపమంటే దేవతల్నే గాదు, ఎవర్నైనా పంపవలసిందేగా?

వజ్రి—అంతటివాఁడవుగా తాతా నీవు?

మణి—కాకపోతే! ప్రభువులు పోయినా, ప్రాభవం పోయినా, నేను నిలుస్తానా? తిరిగి మీ సన్నిధికి వస్తానా?

వజ్రి—నిజమయ్యా; నిజముతాతా! నీవు మానిసి వింతియే కాని నీశక్తి యెంతయోకలదు. కాకపోయిన జాలవిద్యాప్రవీణుని సార్వభౌముని మెప్పింపఁ గలుగుదువా?

మణి—ఔను. సందేహమేమిటి! దానికేం గాని ఆ రంభ యింట్లో తెల్లవారేదాకా ఆటలు, పాటలు' నృత్యాలేనోయ్! అహాహా! అవన్నీ తలుచుకుంటే వొళ్ళు పులకరిస్తుందోయ్! మనసు నీరైపోతుందోయ్! తిరిగి పుణ్యం ఫలించే సమయంవచ్చింది. దయయుంచి కాస్త వాళ్ళపైన పెత్తనం మాత్రం నాకియ్యాలి.

వజ్రి—[బుజముతట్టుచు] స్వామికార్యం మఱచి దివ్యులసైతము వదలి రంభయింట్లో ఆటపాటలతోఁ గాలము బుచ్చిన రసిక చక్రవర్తి వన్నమాట'

మణి—అబ్బ! నేనుకాదు, నీవుకాదు, ఎవ్వరా రంభను చూస్తే సంరంభించరో చెప్పు. గ్రహచారం చాలక కొంచెం కాలం తలవంచుకున్నాంగాని చండముండాది దానవశేఖరులవద్ద మంత్రిత్వాలు మావే, మర్యాదమాదే, మన్ననమాదే, సర్వముమాదే, తెలిసిందా. అదంతా చూద్దాం. నీ మేనమామ భార్యకు మేనమామను. చాలాకాలానికివచ్చిన పాతచుట్టాన్ని. మేళతాళాల్లో మెదిగినవాణ్ణి ఇవ్వాలె. ముందు దేవలోకం భోగంవాళ్ళపైన పెత్తనం మాత్రం తప్పక నాకివ్వాలె.

వజ్రి—కోతికి కొబ్బరికాయ యిచ్చినట్టు ముసలివానికి నీకు వేశ్యలపైఁ బెత్తన మీయడమా?

మణి—ముసలివాఁడనా? వాళ్ళనుజూడక వాళ్ళ గడపలెక్కక వాళ్ళ ఆటా పాటా మాటా మంచీ తెలియనివాళ్ళకు ముసలితనం పెద్దతనం. ఆహా! స్త్రీని, దేవతాస్త్రీని, అందులో రంభను, చూచానంటే,నాకు నవయౌవనం క్రొత్తసోయగంఆవిర్భవించవుటోయ్! మహామంత్రి వన్నమాటే గాని లోకం తెలియదోయ్ నీకు. ముసలితనం పోవటానికి మందు పడుచుపిల్లను సంపాదించుకోవటమే. అందుకనే పెద్దపెద్దవాళ్లు చిన్నపిల్లల్ని చూసుకోటం.

వజ్రి—అలాగా? అయితే నిత్యయౌవనలు దేవతాంగనలు, గంధర్వాంగనలు వచ్చుచున్నారు. [పైనిఁజూచి] అవిగో విమానములు దిగుచున్నవి. వారలపై నీ చిత్తము వచ్చినంత పెత్తనముచేసి నవయౌవనాలంకృతుఁడ వగుదువు కాని పోదముపద. [అని చేయిఁబట్టుకొనును]

మణి—అబ్బ, ఇప్పటికి నన్ను ధన్యుణ్ణి చేశావయ్యా! నీ ఉపకారం మఱచిపోనయ్యా! శృంగారంఅంటే కాస్త యెక్కువఆపేక్ష,మనమడా? అంతే అనుకోబోకు. అనేకవిషయాల్లో అనుభవశాలిని. కాని ఒక్కటేమాటచెప్పాలి. చాలామంది యిస్తామనివచ్చారే. సార్వభౌమునకు చివఱకు పెళ్ళికూతుర్నెవర్ని నిశ్చయించావ్?

వజ్రి—మన నిశ్చయమేమిటి? స్వయంవరమే.

మణి—మంత్రులు చేయని పెళ్ళియేమిటి? యీ స్వయంవరమేమిటి?

వజ్రి—తాతా! బృందాదేవి త్రిలోకసుందరి, సద్గుణాభరణ, మహాధీర, సార్వభౌములు స్వయముగనే వరించినారు.

మణి—అబ్బా, భార్యకు సౌందర్య మెందుకయ్యా! అందులో రాజనందను లిన్నిగుణాలున్న పిల్లల్ని పెళ్ళిచేసుకుంటే, ఆ పెళ్లాలు భర్తల్ని అడుగుదాటనిస్తారా? మంత్రుల్ని గింత్రుల్ని లెక్కచేయనిస్తారా? ఇక మంత్రములెందులకు? తంత్రములెందులకు? ఆ పుణ్యదంపతుల పాదాలంటుకొని యేపురుషార్థము లేక సచివశేఖరులెల్లరు కుక్కలవలె గతుకుతూ వుండవలసిందే. ఏం కాలమోయ్, ఎంత పాడుకాలమోయ్? సర్వతంత్ర స్వతంత్రులై శౌర్యసాహసాలంకారులగు దానవరాజ మంత్రిశేఖరులే యింత వాజమ్మలైతే అమాత్యపదవి అర్ధణాఖరీదుకూడా చెయ్యదన్నమాటే?

వజ్రి—ఏమితాతా! నా మంత్రిత్వముకూడ బాగుగలేదా?

మణి—బాగా? ఇదేనా; నీవు పడేబాగు? నీవాళ్ళు పడే బాగు? ముక్కుపచ్చలారని వాళ్ళు మంత్రులైతే యింతే. ఏతింత్రిణీదళలోచననో, ఏమేరుమందర సమానమధ్యనోచూచి,అంతదీ, యింతఁదీ,

అని చెప్పి రాణులచేసి రాణివాసమున బంధించి భూపతుల భోగ పరాయణుల జేయాలి. లేదా తనకు లేకుంటే తెచ్చయినా చెల్లెళ్ళనో కూతుళ్ళనో చేసి యింతది అంతది అని చెప్పి అధిపతుల కతికించి మంత్రిత్వం స్థిరపఱచుకోవాలె. బంధు మిత్రులతో నఖిలైశ్వర్యము లనుభవించాలె. అంతేగాని యమాత్యశేఖరు లౌన్నత్యమును వీడి పుడమిఱేండ్ల యడుగులకు మడుగులు వేయవలసి వచ్చుట కంటె హైన్యముంటుందా ?

వజ్ర—[ఆశ్చర్యముతో] ఇదియేమి పాఠము తాతా ?

మణి—మంత్రులనుకునే వారు చదువ తగిన పాఠము. అమాత్య శేఖరులు బాగుపడే పాఠము. తెలిసిందా ? పాలిచ్చేదాసి, ఆడించే సేవకుడు, చదువు చెప్పేగురువు, తోడుగా నుండే స్నేహితుడు గూడా రాజపుత్రి హృదయక్షేత్రముల విశ్వాసాంకురముల పెకలించి యాత్మాసక్తుల గావించుకొనవలె. లోకమును మఱపించవలె. ఇంక మంత్రిశేఖరులు నరపతుల నఖిల విషయాసక్తుల గావించి విద్యాబుద్ధులకు నీతి నియమములకు దూరగుల జేసి యడిగిన ద్రవ్యమర్పించి, యధికారములలో నాత్మీయుల ప్రతిష్ఠించి, యేలికల కీలుబొమ్మల కావించవలె. చెప్పదగినవి చేయించదగినవి కార్యములు వేనవేలు గలవు. కాని యిప్పుడైన సార్వభౌముడు బృందను వదిలే ఉపాయం చెయ్యి.

వజ్ర—తాతా! పీటలమీది పెండ్లి భంగము చేయుటయా ?

మణి—వెఱ్ఱివాఁడా! పీటలమీఁది పెళ్ళి యేమిటి? ప్రక్కనున్న భార్యను, చంకనున్న బిడ్డను, నీడగా నుండు తోడును గూడా విడిపించాలె. రాజును కన్నులున్న గుడ్డిని, చెవులున్న చెవిటిని, కాళ్ళున్న కుంటిని జేసి, గౌరవమను నెపమున బట్టగట్టుటకు బొట్టుపెట్టుటకు, గూడా నవుకర్లను బెట్టి పరాధీనుల చేయవలె. ఘనకార్యములను జేయువారిని, ఖడ్గములను బట్టువారిని, కార్ముకములను విఱచువారిని, గడప లెక్కలేనివారిని, గడ్డిపోచ

నె త్తలేనివారిని, జేయవలె, పరిభవునుబోనులోని పులినిగా నుంచవలె; లోకమోహోయనరాజ్యమును పాలించవలె. మనుమడా! వినుము, నామాట వినుము. పుణ్యావశమున సార్వభౌమునకు మిత్రుడవై యమాత్యుడవైతివి. యోజింపుము. నీవు నీవారు బాగుపడుమార్గమును యోజింపుము. సహజ శత్రువులగు దేవతల నెల్లర పాదసేవకులగావింపుము. మామనోరథముల నిర్వర్తింపుము.

తెరలో [మేళములు వినఁబడును.]

వజ్రి—తాతా! ఈ చర్చ కిది సమయముకాదు. మేళములు వినఁబడుచున్నవి. సుముహూర్తము సమీపించుచున్నది. రమ్ము పోదము. [అని చేయిఁబట్టుకొనును.]

మణి—పోనీ! పెండ్లి భంగమయ్యే పని నేను జేసెద సమ్మతింపుము.

వజ్రి—తాతా! వలదు. ఆ పనిమాత్రము వలదు. యుక్తదంపతుల కపకారము చేయవలదు. అప్సరసలపై నధికారము చేయుదువు రమ్ము [అని తీసికొనిపోఁబోవును.]

మణి—అలా అయితే కొంచెం వేషం మార్చుకొనివస్తా. నీవు పద.

వజ్రి—శీఘ్రముగ రమ్ము. [నిష్క్రమించును.]

మణి—[నిట్టూర్చి శిరః కంపముచేయుచు.] బృందా, స్వయంవరము, యుక్తదంపతులునా? స్వార్థపరులకు పాపములేదు. యముడు లేడు. భయము పనికిరాదు. జాలవిద్యాధురంధరుండను, నాకసాధ్యములేదు. నిమేషమాత్రమున ఆనందాశ్రువుల, దుఃఖాశ్రువులనుగా మార్చెద. కల్యాణమంటపమంతయు గగ్గోలుగావించెద. వివాహమెట్లు నెఱవేఱునో విచారించెద. ముద్దులమూటగట్టు నామనుమరాండ్రను మహారాణుల గావించెద. నాయభీష్టమెట్లు సిద్ధింపదో యోజించెద. [అనుచు నిష్క్రమించును.]

[వివాహమంటపము. కాలనేమి, మంత్రిసామంతులు, పురోహితులు
మనోరమ, సరళ, మొదలగువారును, వేదికపై
బృందా జలంధరులు నుందురు.]

పురోహితుఁడు...[పుష్పమాల గ్రహించి] అయంముహూర్త స్సుముహూర్తోస్తు. జలంధర సార్వభౌమా! ఈ మందారమాలచే బృందాదేవి కంఠము నలంకరింపుము. [అని యొక పుష్పమాల నిచ్చును] బృందాదేవీ! నీవీ కల్పకుసుమదామము నీ సార్వభౌముని గళసీమను సమర్పింపుము. [అని మఱియొక పుష్పమాల నిచ్చి] వాద్యములు మ్రోయింపుఁడు. హారతులెత్తుఁడు. సేసలు చల్లుఁడు. అయంముహూర్త స్సుముహూర్తోస్తు. ఊఁ. [అని దంపతులకు సంజ్ఞచేయును. వాద్యములు మ్రోగుచుండును. పుష్పాక్షతలు చల్లుచుఁ గరతాళధ్వనులు చేయుచుందురు]

జలం...[పుష్పమాలను బృంద మెడలో వేయును]

బృంద—[భర్త మెడలోఁ బూలమాల వేయఁబోయి యేదియో కనఁబడిన ట్లభినయించి నిశ్చేష్టయై పుష్పమాల వదలి చెలులపై నొఱగఁ, జెలులు, తల్లి, మనోరమ, భయసంభ్రమాశ్చర్యములతో బృంద కుపచరించుచుందురు]

అందఱు—[విభ్రాంతులై సంభ్రమాశ్చర్యములు కనఁబఱతురు]

మనోరమ—బృందా! బృందా! [అనిపిలిచి] అయ్యో! పలుకకున్న దే, ఏమిచేయుదును? [అని విచారముతోఁ జూచుచుండును.]

కాల—తల్లీ! బృందా! [అని పిలిచి] ఏమి యీ వైపరీత్యము. [నిర్విణ్ణుఁడై చూచుచుండును]

సరళ—నెచ్చెలీ! బృందా, అయ్యో! ఇట్లున్న దే, ఇదియేమి!

జలం—[నిట్టూర్చుచు నలువంకలు చూచుచుండును.]

పురో—బృందాదేవీ! బృందాదేవీ! [అని పిలుచును.]

బృంద—[ఉలికిపడిలేచి కనులు తెఱచి యాశ్చర్యముతోఁ జూచును.]

కాల—కుమారీ! ఏల యిట్లయితివి?

బృంద—ఏదియో చెప్పఁజాలను.

మనో—ఇప్పుడెట్లున్నది తల్లీ?

బృంద—ఇప్పుడేమియు లేదు.

అందఱు —[ఒకరినొకరు చూచుకొని సంతస మభినయింతురు.]

జలం—గురుదేవా! మిక్కిలి యమంగళము జరిగినది. ముహూర్త మును గాలాంతరమునకు మార్చుకోవచ్చును. మన మింకఁ బోవుదము.

అందఱు—[విచారము నభినయింతురు.]

పురో—సార్వభౌమా! ముహూర్తదోష మేమియు లేదు. విచారింపక పాణిగ్రహణమహోత్సవమును నిర్వర్తింపుము.

జలం—ఆచార్యా! పుష్పమాలాపతన మశుభశంకను గలిగించు చున్నది. ఉత్సాహము లేని పెండ్లి యుక్తము కానేరదు.

కాల—సార్వభౌమా! ఈ ముహూర్తము మిక్కిలి శ్రేష్ఠమైనది. స్వల్పలోపము పరిగణింపఁ దగినది కాదు; నా యందు దయ యుంచి బృందాకరగ్రహణము గావింపుము.

జలం—ఆచార్యా! నా మనస్సు కుదురుపడుట లేదు. లెండు పోవు దము. [అని పోఁబోవును.]

నార—[సమీపించి] సార్వభౌమా! నీవంటి ధైర్యశాలి యిట్టి స్వల్ప విషయములఁ బాటింపఁగూడదు.

జలం—[నిలిచి] శుభసమయమందిది యమంగళము కాదందురా!

నార—మహా తపస్సంపన్నుఁడై చండపరాక్రమశాలియగు జలంధర సార్వభౌమునకుఁ గూడ నమంగళమా! ఈ శ్రేయస్సు ననుమతింపనివారెవ్వరెట్టి మాయలఁ బన్నిరో గుర్తెఱుంగుట మిగుల దుస్సాధము. మఱియు రసజ్ఞశేఖరుఁడ వనఁదగిన నీవు నాయకుని సమీపించు నవవధువునకు సంభ్రమస్వేద ప్రకంప నాద్యులు సహజము లని తెలియఁజాలకపోవు.

మ. దివిజారాధ్యుఁడు కాలకాలుఁడు మహా♦దేవుండు నీ తండ్రి, లో
కవిభుల్ నీకరిగాపు లిట్టి భువన♦ఖ్యాతిన్ విడంబించు ప్రా
భవమె ప్పారెడు నాథునిన్ గనఁ దప్రా♦భారావధూతాంగియై
వువుదండన్ జెయిజార్చె, నింతగనవే ♦పూఁబోఁడి మన్నింపవే!

ఇంతియేగాక యెందును సాటిలేని త్రిలోకసుందరియగు బృందా

దేవి లభించుట కంటె నీకు వేఱు భాగ్య ముండునా ! ఇంకొకయదృష్ట ముండునా ! ఆహా ? ఏమి యా బృందా దేవి ?

సీ. సురుచిరలావణ్య ♦ శోభఁ గన్గొందుమా
కుందనపుంగాంతి ♦ కందవలదె?
భాగ్యబంధుర రేఖ ♦ భావింతు మందుమా
శ్రీ సతీమణి సరిఁ♦ జేయవలదె?
విద్యావిధానంబు ♦ వీక్షింతు మందుమా
వాణీవిలాసంబు ♦ వాడవలదె?
దివ్యాస్త్ర సంపత్తిఁ ♦ దిలకింతు మందుమా
లలితా ప్రభావంబు ♦ నిలుపవలదె?
గీ. అన్నిట సీ్నకుఁ దగు బాల ♦ యలఘుశీల
మేలుముల దొంతి యిఁతుల ♦ మేలుబంతి
బృంద కేల్వట్టు మనుపమా♦నందలీల
శౌర్యధామ! జలంధర ♦ సార్వభౌమ!

అందరు—[కరతాళధ్వనులు చేయుదురు.]

నారద—సార్వభౌమా! మహాజను లెల్లరు ననుమతినిఁ జూపుచున్నారు ? అన్యథా విచారింపక శ్రీమతిని బృందా దేవిని ధర్మవిధినిఁ బరిగ్రహించి సర్వసౌభాగ్యము లనుభవింపుము.

కాల—సార్వభౌమా ! అపరాధముల మన్నింపుము. నన్ననుగ్రహింపుము.

నారద—[జలంధరుని చెయిఁబట్టుకొని] సార్వభౌమా! సంశయింపక పాణిగ్రహణ విధి నిర్వర్తింపుము. వాద్యములు మ్రోయింపుఁడు. పుష్పాక్షతలు చల్లుఁడు. హారతులు పట్టుఁడు. అయంముహూర్త స్సుముహూర్తోస్తు. [పుష్పమాల లిచ్చి వధూవరులచేఁబరస్పరము వేయించును]

[వాద్యములు మ్రోగుచుండును. పుష్పాక్షతలు చల్లుచుందురు. హారతు లెత్తుచుందురు. కరతాళధ్వనులు సెలఁగుచుండును.]

(తె ర ప డు ను) ఇ ది తృ తీ యా ం క ము.

---




## చతుర్థాంకము



[భవనప్రాంతమున వజ్రకంఠుఁడు విచారముతోఁ బ్రవేశించును.]

వజ్ర—పూజ్యుఁడగు నారదముని మూలమున బృందాదేవికి గండము తప్పినది. లేకున్న నెట్టి కష్టము వచ్చెడిదో! అయినను సార్వభౌముని కింకను వివాహవిషయమై యశుభశంక పోలేదు. కాని సూత్రధారణ మైనదికదా! సమయమును జూచి సార్వభౌముని మనస్సంశయము తీర్చెద? [పోఁ బోయి ముందుఁ జూచి] ఎవ్వరా వచ్చునది?

మణి—[కనులు తుడుచుకొనుచు నిద్రలేమి నభినయించుచుఁ బ్రవేశించును.]

వజ్ర—[నవ్వుచు] రంభ విడిదినుండియా యేమి తాతా! నిద్రలేనట్టు ఆవులించుచుఁ దూలుచు వచ్చుచున్నావు?

మణి—[ఆవులించి కనులు తుడుచుకొని చూచి] ఓహో! వజ్రకంఠ మహామంత్రిగారా? రంభ! రంభ! ఆరంభా సరే, పెళ్ళిసరే? అయితే అయిందికాదు; కాకపోతే కాకపోయిందికాదు? ఎక్కడా యింతేకదా? వూరిపెద్దకు జబ్బొస్తే వూరంతా యేడవాలె. రాజుకు జబ్బొస్తే రాజ్యమంతా యేడవాలె. ప్రభువుగారి మనస్సట, బాగలేదట. మంత్రిగారు వూరేగింపులు, వుత్సవాలు వద్దన్నారట. విందులకూడా మన్నా చెప్పమన్నారట. ఇంకెక్కడి రంభ? ఇంకెక్కడి వూర్వశి? ఇంకెక్కడి విందులు? ఇంకెక్కడి ఆనందం?

వజ్ర—[చిఱునగవుతో] నీపెత్తనము బాగుగ సాగలేదా?

మణి—ఏమిటీ? బాగుగానా! అసలోటుందీ? సందు దొరికితే సానిది మాట వింటుందండీ? అందులో దేవలోకంవాళ్ళను వేరే చెప్పాల్నా? దేన్ని పిల్చినా ముక్కుతూ మూల్గుతూ మూడంకె వెయ్యటమేగా? నే నెవ్వరితో మాట్లాడను? ఏం పెత్తనం చెయ్యాను? "శ్రేయాంసి బహు విఘ్నాని" అని ఱెక్కలులేని పక్షియై గద్దకంటె దూరదృష్టిగల పాడుముండకొడుకు నారదుడు వచ్చి ఆగినపెళ్లి చేయించి అట్లా నా కోరికను కొంత భంగపఱచాడు. మేళాలూ తాళాలూ లేకుండా మీరు కొంత భంగపఱిచారు! ఇం కెక్కడి పెత్తనం? ఇం కెక్కడి వైభవం? ఇం కెక్కడి సంతోషం? చివరకు కడుపునిండా ఇంత ఆహారమైనా వేతామంటే పిలిచేవాడు లేడు; పెట్టేవాడు లేడు.

వజ్రి—పెండ్లి కావటముకూడ నీ కోరికకు భంగమా తాతా?

మణి—కాస్తా! మరి వచ్చినవాణ్ణి వచ్చినట్లుండక, కుటుంబముకోసరము వెళ్లి నిన్న మొన్న వచ్చాను. కాని రెండురోజులు ముందుగా వచ్చి వివాహమిప్పుడే జరుగునని తెలుసుకొని వున్నట్టయితేనా? పెళ్లీ గిళ్లీ యెగరగొట్టక పోయినాను? అక్కడికీ నా శక్తినంతా వుపయోగించి బృందచే పుష్పమాల క్రిందవేయించా? అంత పనియైనా సూత్రధారణం తప్పలా.

వజ్రి—[ఆశ్చర్యముతో] పెండ్లికూతురు పుష్పమాల వదలుటకు నీవా కారణము?

మణి—కాకున్న బృందాదేవికి అంతలో అట్టి భయకంపము లెట్లు కలిగిన వనుకొంటివి?

వజ్రి—[నిశ్చేష్టుండై చూచి] తాతా! ఆ గందరగోళమున కంతటికిఁ గారణము నీ సామర్థ్యమే?

మణి—కాక మఱి యేమనుకొంటివి. ఆవులించిన పేగులు లెక్కింపదగిన మహామంత్రివే! చేతి కిచ్చినవానినైనా లెక్కింపలేవేం?

వజ్రి—[ఆశ్చర్యముతో] ఎట్లు చేయగలిగితివి?

మణి—కనుకట్టు వాకట్టు చేకట్టు విద్యలు లేవా? ఇంద్రజాల మహేంద్ర జాలములు లేవా? మంత్రములు లేవా? తంత్రములు లేవా? కను రెప్పపాటు విభ్రమం కలిగించటాని కిన్ని విద్యలు కావలెనా? చేయఁదలచిన దంపతులను పులులను సింగములనుజేసి పరస్పరము భయపడునట్లు చేసి పరుగిడ జేయఁజాలనా? అంతమాత్రం శక్తి లేకపోతే నేనేమి ఆదిదానవమంత్రిని? నే నేమి మాంత్రిక చక్రవర్తిని? నే నేమి మహావీరుడను? నేనేమి దేవతలపై స్వారీచేస్తా? ఇంతకు ఆ పిల్ల లదృష్టవంతులుకారు.

వజ్ర—తాతా! పిల్లలన్న జ్ఞాపకమువచ్చినది. మొన్న మీా యింటఁ బూజాసమయమునఁ బాటఁబాడి మెఱపువలె మెఱయుచుఁ నాకుఁ దాంబూలము నొసంగి నిన్న పెండ్లిసమయమున నాపైఁ గటాక్షమాలను విసరినదే, ఆ పిల్ల యెవరు?

మణి—నిన్ననురాగముగఁ జూచినదాన్ని నేనా జ్ఞాపకముంచుకోవల సింది? ఆహా! ఎంత వింత నేర్చావయ్యా?

వజ్ర—కాదు తాతా! నన్ను చూచి నవ్వి నిన్నుఁ జూచినది?

మణి—నన్నుచూచియే నవ్విందేమో?

వజ్ర—అబ్బా! కాదయ్యా! నన్ను చూచియే నవ్వినది. నీవుకూడ మా యిద్దఱను జూచి నవ్వినావు.

మణి—నేను నవ్వాను? దేన్ని చూచి నవ్వానో?

వజ్ర—కాదు తాతా! ఆ సుందరి మందహాసము, ఆ ముఖారవిందము, ఆ కనుల యందము ఏమి చెప్పను?

మణి—అంత అందగత్తెగా?

వజ్ర—నిజముగా ఆ అందచందములు నా డెందమును క్రిందుమీాదు చేయుచున్నవి.

మణి—నిజంగా?

వజ్ర—నిజమేమిటి? యథార్థముగా?

మణి—బృందకంటె అందకత్తెగా?

వజ్ర—బృందమాటకేమిగాని, యా కువలయాక్షి కటాక్షబాణముచే నా హృదయము గాడివాఱినది. ఆబాధ భరింప రాకున్నది?

మణి—మహామంత్రికి, నీకు గూడ స్మరణీయ యగు ఆ తలిరుఁబోఁడి ధన్య యన్న మాటే ?

వజ్రి—ఆమె కాదు. ఆమెచేఁ బ్రేమపూర్వకముగఁ జూడఁ బడిన నేను మిగుల ధన్యుఁడను. దీని కేమిగాని యా సుందరి యెవ్వరో చెప్పవలె ?

మణి—[దైన్యముతో] నా ప్రయత్నము, వారి యదృష్టము కొఱత వడిన ఇప్పుడు, చెప్పిన నేమి ? చెప్పకున్న నేమి ? [విచార మభినయించును]

వజ్రి—అది యేమి ?

మణి—నా కొమరుడు చిరకాలతపంబున విధి యనుగ్రహమునఁ బడసిన సురుచిరాకారసంపన్న లగు నామనుమరాండ్రను సచివవర్యా నుగ్రహమును సార్వభౌమానుగ్రహమును బడయ వలయు నని అన్ని విద్యలు నేర్పి యత్యంతానురాగమునఁ బెంచుచుంటిని. అసమాన రూపలావణ్య వయో విలాసవతులగు ఆముద్దు బాలి కల జీవనము, నా కోరిక, వ్యర్థమైనప్పుడింకే మనుకొన్న ఏం లాభం.

వజ్రి—తాతా ! ఇంకొక సుందరికూడ కలదా?

మణి—కలుగకున్న రాజమంత్రుల కివ్వడం ఎలా గనుకొంటివి ?

వజ్రి—ఓహో ! ఇందు కనియా బృందాదేవి వివాహభంగము? ఆది దానవమంత్రివి నిన్నెవ్వరు పోల్చగలరు? అయిన మించినదాని కేమి సేయఁగలము? కాని నాయందనురాగమును జూపిన యా యింతిని మాత్రము నాకు—[అని అర్ధోక్తిలో విరమించును.]

మణి.—సమర్పింపవలయునా?

వజ్రి—తప్పక.

మణి—అబ్బాయీ! అది చెప్పవలెనా? నా కాశ్రయమిచ్చి నా కుటుంబ మునుగూడ రప్పించి నా కిట్టి యవకాశమును కలిగించిన మంత్రి శేఖరుని మహాప్రభావసంపన్నుని నిన్ను మరువ నేర్తునా ? ఆ తరుణి నీ కరగతమైన దని నిశ్చయింపుము.

వజ్రి-—[నిట్టూర్చి] తాతా! ఇప్పటికి నామనస్సు కుదుటపడినది? నీవు సామాన్యుఁడవుగావు. ఇంకఁ బ్రిభువుతోఁగూడ బంధుత్వమును బడయకపోవు.

మణి.—సార్వభౌమునకు నిన్నఁజెప్పిన సాముద్రికము సఫలమైనదా, బంధుత్వముమాట ఎలా వున్నా ముందు మీ అందరిముందు పెద్దయేనుగు నెక్కనన్నమాటే?

వజ్రి—[ఆశ్చర్యముతోఁ జూచుచు] మనస్సు బాగలేదని సార్వభౌముని సమీపింప మేమే సంశయించుచుండ నీ వెట్లు వీలుచేసికొంటివి? ఏమి సాముద్రికము చెప్పితివి?

మణి.—సార్వభౌములకేమిటి? మరెవ్వరికేమిటి? చిత్తశాంతి లేనప్పుడే సిద్ధాంతులు, సాముద్రికులు, మంత్రాలు, తంత్రాలు కావలసి వచ్చుట.

వజ్రి—అవును, అవును, అయిన నీవు సాముద్రికుఁడవుఁ గూడనా?

మణి—వశ్యవిద్యలు, జోస్యము, సాముద్రికములే, రాకపోతే నేనేమి కళావిదుఁడను? నేనేమి దేశద్రిమ్మరిని?

వజ్రి—తాతా!చూడచూడ నీ విచ్చటివారి నందఱిని మించునట్లున్న దే.

మణి—నీ బంధువుఁడు, నీతాత అంతవాడవటం నీకు గౌరవంకాదూ?

వజ్రి—అవును సందేహమేమికాని, విదేశాగతులగు దానవకులశేఖరులెవ్వరో వచ్చిరని వింటిని.విచారించివచ్చెద. నాకనుజ్ఞయిమ్మా.

మణి—నీ పాణిగ్రహణ సుమూహూర్తం విచారించివస్తా. నాకుకూడా సెల వియ్యి?

వజ్రి—చిత్తము [అని నిష్క్రమించును.]

మణి—[సరాళించుచు మీసము దువ్వుచు] మంత్రము పాఱినది. కాలసర్పము కంఠము చిక్కినది. సాముద్రికము ఫలించి ఇక సింగము జూలు చేతబడక మానదు. ఆపైన మణిగ్రీవుకు పగటి దివిటీలతో బయలువెడలక మానదు. [ముందుఁజూచి] సార్వభౌము డిటే వచ్చుచున్నాఁడు.బృందాదేవి సంగతి యెట్లున్నదో? అదిగో! అటు పోవు అంతఃపుర పరిచారికను విచారించి సమయమునుజూచి సార్వభౌముని సమీపిస్తా.[నిష్క్రమించును.]

[ఉద్యానవనమున]

[విచారముతో జలంధరుఁడు ప్రవేశించును.]

జలం—సౌందర్యమున కెల్ల మూలకందమై శరవిద్యాపాటవమునకు దివ్యమందిర మనఁదగిన న్నావిధి నానందింపఁజేసిన యయ్యిందువదన బృంద, బంధుమిత్రుల ముందు, మంత్రి సామంతుల ముందు, శుభసమయమున నావిధిఁబ్రవర్తించి నా హృదయము నెంతయు నాందోళింపఁ జేయుచున్నదే ? ఏమి సేయుదును ?

ఉ. సుందరి యందచందములఁ ♦ జూడ నొకింత గొఱంత లేదు, పెం
పందు మనోనురాగముల ♦ నారయ సారము బీఱువోదు, చె
ల్వొందు కళావిశేషముల ♦ న్యూనత కల్గదు, గాని పెండ్లిలో
బృందకరంబు జాఱుసర♦మే నను నేఁచు మహోగ్రసర్పమై.

అక్కటా ! తలకెక్కు యీ తరుణినిఁ జూడనీయని యీసంశయ దుర్విష మడంచు వైద్యు లెవ్వరును గానరారై రే! ఏమి సేయుదును? నా చిత్తరువును వ్రాసికొని, యీ రీతి సేవించి నా కత్యానందము గూర్చిన సతీమణి బుద్ధిపూర్వకముగ నిట్లొనరించి, తిరస్కరించెనని బృందను నిందింపఁజాలను. ప్రమాదమనియు, కుమార్గమనియు, నిశ్చయింపను జాలను. నారదుఁడు చెప్పినను, శుక్రుఁడు చెప్పినను, మఱియే యితరులుఁ జెప్పినను, ఆ తరుణియం దనురాగమును జూపఁజాలను. ఏమియుఁ జేయఁజాలకుంటి నే ? ఏమి సేయుదును ? బృందా! మన ప్రేమలతిక యల్లిబిల్లిగ నల్లుకొని యుల్లసింపఁ జేయునని తలంచితిని. కాని సంశయాసితో ఛేదింపఁబడు నని యూహింపక పోతిఁగదా! దేవీ! మన ప్రణయప్రబంధము సత్కావ్యమును బోలి శాశ్వతమగు నని నిశ్చయించితినిగాని యాశుకావ్యమువలె నాద్యంతము లప్పుడే యంతరించు నని యోజింప లేకపోతి నే! ఔరా! సందేహ ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుఁ జెప్పినమాటలు, చేసిన బాసలు సైతము మఱచుచుంటి నే! బృందా! నీవు నా కనువిం దొనరింప నే నానందించు భాగ్య మెన్నఁడైనఁ గలుగునా?

ఉ. స్వాంతము దూలె నెంతయును ♦ సంశయ ముగ్రముగాఁ గడంగె నీ
భ్రాంతి దొలంగి తొంటి యను♦రాగముతో నినుఁ జూడ నేర్తునే?
కాంతరొ! యంచుఁ బిల్చి బిగి ♦ కౌఁగిటఁ జేర్చి సుఖింతునే! వన
ప్రాంతమునందుఁ బల్కినటు ♦ లర్మిలి నీకు ముదంబుఁ గూర్తునే?

[అని కనులుమూసి నిట్టూర్చి] లేదు, లేదు! అట్టియదృష్టము లేదు. బృందా! ఈ సంశయ పర్వత మెత్త నలవిగానిదై యెంతయు దుర్భర మగుచున్న దే? ఈ సందేహసముద్ర మపారమై మనకెంతయుఁ దరింప శక్యము గాకున్న దే? ఇంకెట్లు నిన్నుఁ జూడఁగలను? బృందా! నీ మూాల మున నిందే స్వర్గ మనుభవింపఁదలచిన, నాకు నీవు సన్నిధియందుండియు, దివ్యాంగనవోలె స్మరణీయవై, సత్యమంతయు స్వప్నవృత్తాంతము కావ లసివచ్చెనే? ఏమిచేయుదును? ఏసిద్ధాంతులు, నే సాముద్రికులు, బృంద యం దెట్టి లోపమును జెప్పలేదుగాని ప్రాచీన దానవ చక్రవర్తుల సాముద్రికుఁడు మణిగ్రీవుఁడు మాత్రము బృంద చిత్తరువును జూచి దివ్యానురక్త యగు ననియు, ఆమె మూలమున సంకటము గలుగునని చెప్పినాఁడు. అతఁడు జాలవిద్యలో దక్షుఁడు. మహాచతురుఁడు, సర్వ విద్యావిశారదుఁడు. అతని మాట వ్యర్థము కాఁగూడదు. కాని దేవ తలకుఁ గూడ నధిదేవతనైన నన్నుఁ ద్రికరణశుద్ధిగ నాథునిఁగ భావించి యంతగా సేవించిన పతిదేవత యగు బృంద యే విశేష మపేక్షించి యన్యదేవతారాధనము గావించును? ఇది నే నమ్మఁజాలను. [యోజన మభినయించి ముందుఁజూచి] మణిగ్రీవుఁడు వచ్చుచున్నాఁడు. విశేషము లెఱిఁగింపక మానఁడు. వానినిఁ గలిసికొని బృందామందిరప్రాంతమున నేమి జరుగునో విచారించి వచ్చెద.

[నిష్క్రమించును]

బృంద—[ఉద్యానవనమున బృంద జలంధరుని చిత్రఫలకము సమీప మున నుండును.] ఆర్యపుత్ర! నిరంతరము నీ సాన్నిధ్యమున నుండి నిరతిశయానంద మనుభవింపవలసిన నన్ను సన్నిధికిఁ జేర్చుటకు సయితము సంశయించుచు సమయము కా దను చుంటివే! అక్కటా! ఏదియో భయంకరరూప మగుపడిన

కారణమున మనసు చెదరి భయకంపములు కలిగి పూమాలను విడిచినంతమాత్రమున నింతటి పంతమా ? ఆహా ! పరిణయము నకుఁ బూర్వము నీవు చూపిన యాదరము, నీవు చెప్పినమాటలు నిట్టి స్వల్పాపరాధమును సైతము సైరింపలేనివగునని స్వప్నము నందైనను దలంపకుంటినే? ఎంత నిష్ఠురుఁడవైతివి? తాళిగట్టితి వన్నమాటయేగాని నా స్థితి నట్టేటఁ బుట్టిమునిఁగినట్లయ్యెనే! దుర్భరములగు త్వద్వియోగాగ్నికీలలు నన్ను సంతతము సంత పింపఁ జేయుచుండెనే? నిన్నే దైవముగఁదలంచి సేవింపఁదలంచిన నాకిపు డే మార్గమును జూపెట్టెదవు? [చిత్రఫలకమునుజూచి] అయ్యో! జగన్మోహనాకారమే! మహాశౌర్యసారమే! ఈ దివ్య మూర్తిని భజింపక యెట్లు జీవింపఁ గలుగుదును? దైవమా! నాకుఁ జైతన్యమొసఁగి పతివిరహితను జేసి యాతన ననుభవింప జేయుచుంటివిగాని, హృదయేశ్వరుని మణిహారాదులలో నొక్కదానిగ నిర్మించినను నాథుని సాన్నిధ్యసుఖ మనుభవించి యుందునే! నే నొకింత యూరటఁ జెందియుందునే? ఆర్యపుత్రా! పాణిగ్రహణము చేసితి వన్నమాటయేగాని నా యే కోర్కెను దీర్పకుంటివే! నేనేమి చేయగలను?

ఉ. ఉల్లము లుల్లసిల్లఁగఁ బ్రి♦యోక్తుల నాడుకొనంగలేదు శో
భిల్లెడువైభవం బడర ♦ వేడుకఁగూడి చరింపలేదు, రం
జిల్లెడు పూవుటీరములఁ ♦ జేరి సుఖింపఁగలేదు నాథ! చిం
తిల్ల వియోగశిక్ష నల♦యింపగ బృందను జెట్టఁబట్టితే?

లేదు, లేదు. ఇంక నాకెట్టి యానందమును లేదు! ఏది లేకున్నను కన్నుల కఱవుఁదీర మనఃకాంతునిఁ జూచు భాగ్యమైనను. లేకపోవుచుండెనే? అయ్యో! ఈసంతాప మెట్లు భరింతును? భర్తృదర్శన మొనరింపక యెట్లు జీవింతును?

చ. అగుపడకున్నచో నిముస♦మైనఁ బ్రియాననచంద్రబింబ మో
ర్వఁగవశమే? మనోధవుని♦వాగమృతాంబుధిఁ దోఁగకున్న నె

వ్వగ దిగనాడఁగా నగునె ♦ వల్లభపాదసరోరుహార్చనన్
దగులకయున్నఁ బ్రాణములు♦ దా మిఁక నిల్చునె నాదు మేనిలోన్.

ఏమైనం గానిమ్ము. ఇప్పుడే పోయి తమిదీర నా మనోహరుని ముఖచంద్రు నవలోకించెద. అనుమతిలేక వచ్చితినని నా హృదయవల్లభుఁడు నన్ను కోపగించునా? సహించెద. దయాదాన మిమ్మని యర్థించెద. ఆర్యపుత్రుఁడు కరుణింపకపోఁడు. ఎవరక్కడ? [అని పిలువఁబోయి యాపుకొని] అక్కరలేదు. నా సరళ నన్ను వారించును. నా సఖులు నన్ను నిరోధింతురు. వీరితోఁ జెప్పనేల? వీరల తోడేల? నా పతికడకు నేను నిశ్శంకముగఁ బోయెద. [పోబోయి యాగి] ఆహా! సార్వభౌముని సాన్నిధ్యమున ఎంద ఱెందరో భటులు, ఎన్నెన్నియో నిరోధములు. మహారాజ్ఞిశిరోమణిని పాదచారిణినై యసమయమున నీగతి నొంటిగఁ బోయిన భటులుకూడ పరిహాసింపరా? వల్లభుఁడు సైత ముల్లసమాడకుండునా! ఆహా! నాకేమియుఁ దోపకుండెనే? పతిదర్శనము చేయించి పుణ్యము కట్టుకొను పరమకారుణికమూర్తు లెవ్వరును గానరారైరే! ఏమి సేయుదును? ఇంక నార్యపుత్త్రు నెట్లు చూడఁగలుగుదును? [అని దీనయై యుండును.]

నార — [తెరలో పాడుచుండును.]

బృంద — [వినుట నభినయించి] ఎచ్చటి దీ మధురనాదము. భగవానుఁడు నారదమునివలె నున్నాఁడే? [చూచి] ఔను. ఇటే వచ్చుచున్నాఁడు. నా వివాహసమయమున అకారణ వాత్సల్యమును జూపి నన్నుద్ధరించిన మహానుభావుఁడు, నా శ్రేయస్స్వామి కాక పోడు. సేవించి ధన్యనయ్యెద.

నార — [ప్రవేశించును.]

బృంద — మునిచంద్రమా! నమస్కారములు. [నమస్కరించును.]

నార — శుభం భవతు.

బృంద — దేవా? ఇటు దయచేయుఁడు. [అని శిలాతలమునఁ గూరుచుండబెట్టి పుష్పమాల వేయును.]

నార — బృందాదేవీ! సేమముగ నుంటివా?

బృంద—అప్పుడా యాపదఁ బాపి రక్షించిన దయామయుఁడవు. స్వామీ! నా నాథుఁడుఁ త్రిభువననాథుఁడయ్యును నాకందని ఫలముగ నున్నవాఁడు. నాకు పతిదర్శన భాగ్యము గల్గునట్లొనరించి నన్ను ధన్యను జేయ వేఁడుచున్నాను.

నార—అమ్మా! నీయాశయము మిగుల ప్రశంసనీయము. నీవు విష్ణుపూజాతత్పరవు కమ్మ. ఆ దేవదేవుఁ డనుగ్రహించి సకలాభీష్టము లొసంగఁ గలఁడు.

బృంద—దేవా! చిరతపస్సంపన్నులగు మునులకు నిరంతరము భజించెడు భక్తులకు గూడ దుర్లభమే! నేనెంతకాలమున కా విష్ణుదేవుని యనుగ్రహము వడయఁగలను.

నార—అమ్మా! సాధుశీల యగు నీవంటి సతీమతల్లి హృదయపూర్వకముగ ధ్యానించిన భగవానుఁ డనుగ్రహించును. ఇంతియేకాక నేనొక మంత్ర ముపదేశించెద. దానిని మువ్మారు పఠించి ధ్యానించిన నీయభీష్ట మిప్పుడే నెఱవేఱఁగలదు - రమ్మ! మంత్ర ముపదేశించెద.

[బృంద సమీపించి నమస్కరింప, నారదుఁడు మంత్ర ముపదేశించును.]

బృంద—[కనులుమూసి] ధన్యను! ధన్యను! గురుదేవా! నమస్కారము.

నార—అమ్మా! ఇంక నేఁ బోయివచ్చెద!

బృంద—చిత్తము [నమస్కరించును.]

నార—[నిష్క్రమించును.]

బృంద—నారదఋషీంద్రుఁ డెంతయు నాయం దనుగ్రహము చూపినాఁడు. ఇంక శ్రీమహావిష్ణువును దర్శించి ధన్యనయ్యెద. [అని శిలాతలమునఁ బద్మాసనస్థయై కూరుచుని మంత్రమును జపించి ధ్యానము నటించి] దేవదేవా! నీవే శరణ్యము. మహామహిమాభిరాముండ వగు నిన్నభివర్ణింప నెవరికి సాధ్యము కాఁగలదు?

సీ. వీక్షాంచలంబున ♦ విశ్వంబు నేలించు
నలివేణి యెవని క♦ర్ధాంగలక్ష్మి
చిత్రచిత్రంబుగా ♦ సృష్టినైపుణిఁ జూపు
మొదటి వేల్పెవ్వాని ♦ ముద్దుబిడ్డ
తమ మోర్చి భువనముల్ ♦ దనరఁజేయుచు నుండు
రవిచంద్రు లెవని నే♦త్రద్వయంబు
ముల్లోకములు చుట్టు♦ముట్టి పూతము సేయు
గంగ యెవ్వాని పా♦దకమలమధువు
గీ. మెండుకొని వెల్గుచుండు బ్ర♦హ్మాండకోటి
యణువుల విధాన నెవని దే♦హమునఁ జెలఁగు
లోమకూపగవాక్షాళి ♦ లోన వెలయు
నట్టి విష్ణు ననంతు నే ♦ నభినుతింతు.

[నమస్కరించి నిమీలితనేత్రయై యుండును.]

విష్ణు— [ప్రవేశించి] [స్వ] ఈయమ మహాసాధ్వి. త్రికరణశుద్ధిగ నన్ను ధ్యానించినది. తప్పక దర్శనమిచ్చెద. [సమీపించి] అమ్మా! నీ భక్తికి సంతసించితిని. లెమ్ము.

బృంద—ఏమి యీ దివ్యమూర్తి?

మ. తనుకాంతిచ్ఛట నైల్యముల్లసిల ము♦క్తాహార విద్యుల్లతల్
కనుదోయిన్ మిఱుమిట్లుగొల్ప విలస♦ద్గంభీర వాగ్గర్జన
స్వనముల్ వీనుల విందుసల్పఁ గరుణా♦సారంబు వర్షించుచున్
దనిపెన్ మామకచిత్తచాతకము ను♦ద్యన్మాధవాభ్రం బహో.

విష్ణు—బృందాదేవీ! నీనాథుఁ డసమాన బలపరాక్రమోపేతుఁడే! నన్నేల ధ్యానించితివి?

బృంద— దేవా! సర్వభూతములకు సకలలోకములకు బలము నొసంగు నీ కడ నితర బలపరాక్రమములు పరిగణనీయము లగునా? భగవానుఁడా! సకలభూతాంతర్వర్తివై సర్వజ్ఞుఁడవైన నీ కేమని విన్నవింతును? ఎన్ని వసతు లున్నను, బతి యనుగ్రహము

లేని పడఁతుల జన్మ వ్యర్థమై నిరంతరసంతాపసంతప్తము కాకుండునా!

విష్ణు—నిజము నిజము. విజ్ఞానవతు లగు నీ బోటి సతీమతల్లుల కది యట్టిదియే.

బృంద—దేవా! పతిదర్శనలాలసనై యున్న నా కే యభ్యంతరము కలుగకుండ ఆర్యపుత్రుని సమీపింపఁగల సామర్థ్యము నొసంగ వేడుచున్నాను.

విష్ణు—తలఁచినప్పుడెల్ల నీ భర్త యెందున్నది నీ వెఱింగి, యాతని సమీపింపఁ దగిన శక్తిని, నీ వాతనిని గనినప్పు డాతని యుద్వేగ మడంచు సామర్థ్యము నీ కిచ్చితిని. విచార ముడుగుము. [అభయహస్తము నిచ్చును.]

బృంద—మహాభాగ్యము! [అని దోసిలి యొగ్గును.]

[జలంధర మణిగ్రీవులు ప్రవేశింతురు.]

మణి—[విష్ణువును జూచి సంతోషాశ్చర్యములతో జనాంతికముగ] సార్వభౌమా! చూడుఁడు. నా సాముద్రిక పరిభావమును జూడుఁడు.

జలం—[చూచి నిర్విణ్ణుఁ డగును.]

విష్ణు—[నిష్క్రమించును.]

మణి—[శిరఃకంపము చేయుచు] దేవా! అటు నారదుఁడు, ఇటు విష్ణువు. ఇఁక బృందారకులు నిందే యుందురు. [పరిసరములఁ జూచుచుందురు.]

బృంద—[సంతసముతో]

చ. అతులిత దానధర్మము లహర్నిశముం బచరించి యెన్ని యో
క్రతువుల నాచరించి చిరకాలము యోగసమాధి నిల్చి బల్
వెతఁ బడినన్ గృశించినను వేఁడిన దివ్యులకే నలభ్యమౌ
గతి నలరారు విష్ణుకృప గాంచితి నెంతటి ధన్యురాలనో.

జలం—[వినుట నభినయించును].

బృంద—కానిమ్ము. సమయమును జూచి నా యభీష్టము నెఱవేర్చుకొనియెద. [నిష్క్రమించును.]

జలం — [విని రిచ్చవడి] నే నింద్రజాలమును జూచుచుంటినా? సత్యమునే గనుఁగొనుచుంటినా? [నిట్టూర్చి] మణిగ్రీవా! నీ వపరబ్రహ్మవు. నీ చెప్పిన దంతయు యథార్థమైనది.

మణి — దేవా! ఆ విష్ణు వెంత దుర్ణయుఁడు! మీ యాజ్ఞలేక యెవ్వరికిని నగరిద్వారమునైనఁ జొర వీలులేదే? అనన్య సామాన్య వైభవోపేతులై చండశాసను లని ప్రసిద్ధి వడసిన మి మ్మును మాత్రమైనఁ బరిగణింపక రాణివాస మని యైన లెక్కింపక దేవీ సమీపమున కేగుట మిక్కిలి సాహసము. సకల జగన్నాథు లగు మీ యెదుట దివిటీక్రింద దీపమువలె నెందులకుఁ గొఱగాని యా హరి దేవేరిచే నింతటి మన్ననఁ బడయుట సార్వభౌముల కెంతయుఁ జుల్కదనము.

జలం — [కోపముతో నిట్టూర్చి దృష్టి నిగుడ్చి] ఔరా! నీపతి సర్వాధిపతియై యుండ, సకల శాసకుఁడై యుండ, నిగ్రహానుగ్రహ సమర్థుఁడై యుండ, అధముఁ డగు విష్ణు కృపఁ గోరుచు సమయ నిరీక్షణము సేయుచుంటివా? బృందా! ఎంత నీచమానసవగుచుంటివి? ఓరీ! విష్ణుహతకా! త్రిభువనారాధ్య మగు నా యౌన్నత్యమునైన లెక్కింపక, సర్వలోక సంసేవ్యమగు నా యాజమాన్యమునైనయోజింపక, బ్రహ్మాండమంతయుఁ బిడికిటఁ బట్టఁగల నా బాహుబలవిక్రమాదులనైనఁ బరిగణింపక యేకాంతమున నా కాంతతోఁ బ్రసంగింపఁదగిన సాహసికుఁడవైతివా? నారదా! నీవు గానకళావిశారదుఁడ వని గౌరవించుచున్నందులకు నా యిల్లు సొచ్చి బృందావిష్ణువుల కనుసంధానము సేయుచుంటివా? ఔరా! మీ రెంత నిర్భీతిగ సంచరించుచున్నారు? మీ రేకాదు, సకలదేవతలు కలసివచ్చినను సర్వలోకములేకమై నిల్చినను, మిమ్మీ జలంధరుండూరక విడుచువాఁడుకాడు. [నిట్టూర్చి] ఓసీ బృందా! నీవిదే చచ్చితివి. మరణమునకు సిద్ధముగ నుండుము. [అని పోఁబోయి స్మరణ మభినయించి నిర్విణ్ణుఁడై యాగి నిట్టూర్చి] ఔరా! త్రికరణ శుద్ధిగ భర్తగ భావించి చిత్రఫలకమునకుఁ బ్రాణసమర్పణము

దనుజయశశ్శ్రీలు ♦ తాండవం బొనరింప
బ్రహ్మాండ రంగంబు ♦ పదిలపఱచి
గీ. ప్రథితదైతేయకులపుణ్య♦ఫల మనంగ
దంభరాజేంద్ర సుతుఁ♦డవై ♦ దనరినాఁడ
వభయ మీవే! భవత్పదా♦జ్ఞాశ్రితులము
శౌర్యధామ ! జలంధర ♦ సార్వభౌమ !

['జే జలంధర సార్వభౌమునకు జే' అని అందఱు కైవార మొనర్చి నమస్కరించి పుష్పమాలలు ఫలములు సమర్పింతురు]

మణి—సార్వభౌమా ! శేముషీవిశేషమున వేల సంవత్సరములు నిరుపద్రవముగ రాజ్యతంత్రము నడిపించి ప్రాచ్యరాజ్యలక్ష్మి కసమానగౌరవ మాపాదించిన మహా మంత్రిశేఖరులు వీరు. [మఱి కొందఱను జూపుచు] దేవా ! రణరంగమున హరిహరాదుల సైతము మోర్చి పూర్వరాజకంఠీరవ యశశ్చంద్రికల దిగంతవ్యాప్త మొనరించిన శూరశిఖామణు లగు సేనానాయకులు వీరలు. [మఱి కొందఱను జూపి] జగన్నాథా ! వీరు శౌర్యసాహసాలంకారులై లోకనాయకుల సైతము కాందిశీకులఁ గావించి ప్రాచీనరాజేంద్రులకు సంగ్రామ సంరంభమునఁ గవచప్రాయులై సంచరించిన వీరభటశేఖరులు. వీ రెల్లరు తమ తమ శరీరములను గూడ లెక్కగొనక, కులగౌరవమునకు స్వామిరక్షణమునకు వెనుదీయక సమరభూముల నతిసాహసమున నిలిచిన వీరాధివీరులు. శల్యగతప్రాణు లగుటఁజేసి బ్రతికి యుండిన వీరల క్షావసమయమునఁ గలిగిన యవయవభంగముల దేవర యవలోకింప వేఁడుచున్నాను.

సీ. వజ్రవజ్రాహతి ♦ వ్రక్కలై తునియలై
నేలవ్రాలెను వీని ♦ కేలుదోయి
పాశిపాశాక్రాంతిఁ ♦ బాసి మూలంబెల్ల
వీఁక వీఁగుచునుండె ♦ వీరినడుము

గల యంతఃపుర రక్షకుల నియమించి కొంతకాలము దేవిని మఱచి రాజకార్యముల విషయమై యోజింపుడు. నా ప్రార్థన మంగీకరింపుడు. [అని దోసిలియొగ్గును]

జలం—[ఆగును]

[తెరలో]

గేయము. జయ శ్రీజలంధర ♦ జయ లోకనాథ
జయ మేరునగధీర ♦ జయ రణశూర
జయ దైత్యమందార ♦ జయ దానవీర
జయ జగన్నుతి పాత్ర ♦ జయ దంభపుత్ర!

శ్రీ శ్రీ శ్రీ జలంధరసార్వభౌమునకు జే! త్రిలోకనాథునకు జే!!

[అని జయవెట్టుచుందురు.]

జలం—[వినుట నభినయించుచు] మణిగ్రీవా! అదియేమి?

మణి—విదేశాగతు లగు దానవకులశేఖరులు కావచ్చును.

జలం—వారి కందఱకు దర్శన మిచ్చెద మని చెప్పియుంటిమి. వారలే కావచ్చును?

వజ్ర—[ప్రవేశించి] దేవా! దేవరదర్శనార్థము విదేశాగతులగు దానవ నాయకులెల్లరు విచ్చేసియున్నారు?

జలం—ఇప్పుడే రాఁగలను. నీవు వారినెల్లర నందుండ నియమింపుము.

వజ్ర—చిత్తము [నిష్క్రమించును.]

జలం—విదేశాగతులగు వారినట నిలుపుట యుక్తముకాదు. కానిమ్ము. బృంద విషయము పిమ్మట విచారించెద. [నిష్క్రమించును.]

మణి—[శిరఃకంపముచేసి సంతసముతో] ఆహా! ఏమి నా యదృష్టం వర్ణనాతీతంగా వుంది? అభీష్టమున కాటంకం కలిగినప్పుడు ఎంత వారికైనా ప్రశ్నో, ఫలమో అడగటం, దేవుళ్లనో దైవాలనో వేడుకోటం సహజమనీ, అందులకు భార్యావిషయమై ప్రశ్నించిన సార్వభౌముడే నిదర్శనమనీ, పతివియోగము నోర్వలేక బృందా దేవి యే దేవతలనో వేడుకొనకపోదనీ నే పన్నిన పన్నుగడ కాకతాళీయంగా నా కెంత యుపయోగించింది? జాలవిద్యా

పరిదర్శన సమయమున సార్వభౌముఁడంతవాఁడు నాకు గురువువు కాదగుదువనీ యిప్పు డపరబ్రహ్మవనీ అంటే ఇంక నా కేం లోటుంది? నా జెండా పై కెగురుట కేం సంశయ ముంటుంది? సార్వభౌముని బృందకడకు పోనీయకుండగనే భేద మభివృద్ధి జేయాలె. భార్యపొడగిట్టకుండా బాగా పురిపెట్టాలె. దేశదేశాల నుంచి బంధువులను మిత్రులను అందరిని పిలిపించానుగదా! నే పలికినపలుకునే వారిచేతఁ గూడ పలికించి "పలువురాడుమాట పాటియై ధరఁజెల్లు" అను వాక్యమును సార్థకము గావించి నా ప్రతాపజ్యోతి నింక నఖండంజేసి సార్వభౌముని శిరమున మణికిరీటంగా ప్రకాశిస్తా? ఇంక నా కేది సాధ్యముకాదో చూస్తా. [నిష్క్రమించును.]

[జలంధరుని సభామండప ప్రాంతమున మణిగ్రీవుఁడు విదేశీయులను కలిసికొనును.]

మణిగ్రీవుఁడు—సోదరులారా! మీ యదృష్టవృక్ష మామూలము ఫలించినది. ఇప్పుడే సార్వభౌముఁడు రా గలఁడు. నేను జెప్పినట్లు చేయుడు. [అని చెప్పుట నభినయించుచు అందఱను వరుసగా నిలుచునట్లు చేయును.]

['జలంధర సార్వభౌమునకు జే! త్రిలోకనాథునకు జే!' అనుచుండ అమాత్య సహితుఁడై జలంధరుఁడు ప్రవేశించును.]

అందఱు—ఆశ్రితావన దీక్షాపరాయణా! జలంధర సార్వభౌమా! మీ ప్రభావ మమేయము! మీ పరాక్రమౌదార్యంబు లసమానంబులు·

సీ. నిఖిలలోకంబులు ♦ నీఱుసేయఁగఁజాలు
భవఫాలతలకీలిఁ ♦ బ్రభవమంది ·
సురనాయకుల నెల్లఁ ♦ జరణదాసులఁజేయు
శక్తిసామర్థ్యముల్ సంతరించి
భువనాధిపతులు కే♦ల్మోడ్చి కానుక లిడ
విశ్వాతిశాయి స♦ద్విభవ మొంది

దనుజయశశ్శ్రీలు ♦ తాండవం బొనరింప
బ్రహ్మాండ రంగంబు ♦ పదిలపఱచి

గీ. ప్రథితదైతేయకులపుణ్య♦ఫల మనంగ
దంభరాజేంద్ర సుతుఁ♦డవై ♦ దనరినాఁడ
వభయ మీవే! భవత్పదా♦జ్జాశ్రితులము
శౌర్యధామ! జలంధర ♦ సార్వభౌమ!

[‘జే జలంధర సార్వభౌమునకు జే’ అని అందఱు కై వార మొనర్చి నమస్కరించి పుష్పమాలలు ఫలములు సమర్పింతురు]

మణి—సార్వభౌమా! శేముషీవిశేషమున వేల సంవత్సరములు నిరుపద్రవముగ రాజ్యతంత్రము నడిపించి ప్రాచ్యరాజ్యలక్ష్మి కసమానగౌరవ మాపాదించిన మహా మంత్రిశేఖరులు వీరు. [మఱి కొందఱను జూపుచు] దేవా! రణరంగమున హరిహరాదుల సైతమోర్చి పూర్వరాజకంఠీరవ యశశ్చంద్రికల దిగంతవ్యాప్త మొనరించిన శూరశిఖామణు లగు సేనానాయకులు వీరలు. [మఱి కొందఱను జూపి] జగన్నాథా! వీరు శౌర్యసాహసాలంకారులై లోకనాయకుల సైతము కాందిశీకులఁ గావించి ప్రాచీనరాజేంద్రులకు సంగ్రామ సంరంభమునఁ గవచప్రాయులై సంచరించిన వీరభటశేఖరులు. వీ రెల్లరు తమ తమ శరీరములను గూడ లెక్కగొనక, కులగౌరవమునకు స్వామిరక్షణమునకు వెనుదీయక సమరభూముల నతిసాహసమున నిలిచిన వీరాధివీరులు. శల్యగతప్రాణు లగుటఁజేసి బ్రతికి యుండిన వీరల కాహ్వానసమయమునఁ గలిగిన యవయవభంగముల దేవర యవలోకింప వేఁడుచున్నాను.

సీ. వజ్రవజ్రాహతి ♦ వ్రక్కలై తునియలై
నేలవ్రాలెను వీని ♦ కేలుదోయి
పాశపాశాక్రాంతిఁ ♦ బాసి మూలంబెల్ల
వీఁక వీఁగుచునుండె ♦ వీరినడుము

శూలిశూలోద్ధతి ♦ వ్రీలి కండలురాలి
పెద్ద కన్నంబయ్యె ♦ వీనియురము
చక్రిచక్రోద్ధృతి ♦ సడలి శల్యంబులు
పడిపోయె నీతని ♦ పాదయుగళి
గీ. చెవులు ముక్కులు చేతులు ♦ చెడినవారు
నేఁడుగడ లేక కడుపులు ♦ మాఁడువారు
శరణ మనినారు మీ వారు ♦ కరుణఁ గనుము
శౌర్యధామ! జలంధర ♦ సార్వభౌమ!

జలం—[వేఱువేఱుగాఁ జూచుచు నిట్టూర్చుచు] అక్కటా! హరి హరాదులు సైతము దేవతలలోఁ గలసి యింతటి క్రూర కర్ములై ప్రవర్తించిరా? వీరవర్యుల నెల్ల శల్యావశిష్టులఁ జేసినారలే, కానిండు. [అని శిరకంపము చేయుచుండును.]

ప్రథముఁడు—దేవా! దేవతలు మా కొనరించిన కీడు విష్ణువొనర్చిన మోసము చెప్పఁజాలము.

ద్వితీయుఁడు—సార్వభౌమా! మా పుణ్యములు ఫలించి మా తపంబులు పండి మా కష్టములెల్ల గట్టెక్కెడి కాలము వచ్చి యీశ్వరానుగ్రహమున దంభమహారాజ నందనుఁడవై మమ్ముద్ధరింపఁ బుట్టొందితివి. ముల్లోకములు పరిపాలించు పుణ్యమూర్తివి. సర్వలోక సంస్తుతులం గన్న శౌర్యరాశివి. దేవతలకు, హరికి భయపడి పాములవలెఁ బాతాళమున దాఁగి, ఉడుములవలెఁ గుందేళ్ళవలె మూల మూలలనుండి, నేఁటికిఁ దలలెత్తుకొని నీ ప్రాపునకు వచ్చిన మీ వంశజులము. మీ బంధువులము. అనదలమై యున్న మాపైఁ గృపావృష్టి వర్షింపవలె. తిన తిండి లేక కట్ట బట్టలు లేక, తలలు గడ్డములు పెరిగి యల్లాడుచున్న మ ముద్ధరించు భార మంతయు నీదే. నీవే మాకు శరణ్యము. [శ్రీ శ్రీ శ్రీ జలంధర సార్వభౌమునకు జే! శ్రీ శ్రీ శ్రీ త్రిలోకనాథునకు జే! అనుచు అందఱు సాష్టాంగనమస్కారములు గావింతురు.]

జలం—[దృష్టి నిగుడ్చి] ఔరా! సుర లెంత వంచకులు! విష్ణు వెంత మాయావి! నిరపరాధుల దండించి కులద్రోహ మొనరించిరే! కానిమ్ము, వీరశిఖామణులారా! బంధుపుంగవులారా! మీ రెల్లరు కష్టసముద్రమునుండి గట్టునకుఁ జేరినారు. విచార ముడిగి నా యీ వాక్యము లాలకింపుడు!

శా. శ్రీలం బెంపెసలారి శౌర్యమున వాఁసింగన్న దైతేయ భూ
పాలశ్రేణుల బాహువిక్రమము లోర్వక్ లేక వంచించి యీ
లీలన్ గాసిలఁ జేసినట్టి సురపాళిన్ విష్ణువుంగూల్చి మీ
రేలం జూచెదు నీ జలంధరవిభుం డీ రేడు లోకంబులన్.

సోదరులారా! లెండు! మీరెల్ల రిందే యుండుఁడు.

[అని యాదరము జూపుచు మంత్రిదిక్కై] వజ్రకంఠా! మును ముందు వీరల కెల్లరకు నుచితరీతి వస్త్రభూషణాదుల నొసంగి మజ్జన భోజనాదుల కేర్పాటు లొనరింపుము. అశ్వినీదేవతలఁ బిలిపించి వీరి యారోగ్యములను విచారింపవలసిన దనియు, అంగభంగాదుల కేమేనిఁ జికిత్స గావింపవలసిన దనియు మా యాజ్ఞగాఁ దెలియఁజేయుము.

వజ్ర—చిత్తము. [అని నమస్కరించి] సోదరులారా! మిమ్మెల్లరఁ బ్రభువు లనుగ్రహించినారు. రండు పోదము.

అందఱు—ధన్యులమైతిమి. జే జలంధర సార్వభౌమునకు జే. త్రిలోక నాథునకు జే. [అనుచు నిష్క్రమింతురు]

జలం—[దానవ వీరులఁజూచి తల నూచుచు] [స్వ] శరీరభంగమునకు సైత మోర్చుకొనిన మహాధీరులు. ప్రాణముసైతము లెక్క సేయని మహావీరులు. కానిమ్ము! వీరి కా లోకపాలకస్థానములే యిచ్చి యాదరించెద.

మణి—[శిరఃకంపము జేయుచుఁ బ్రభువును సమీపించి యాశ్చర్య మభినయించుచు] సార్వభౌమా! అశ్వినీదేవతలా ఔషధ ప్రదాతలు!

జలం—ఔను.

మణి—దేవా! ప్రాచీన సార్వభౌముల కడఁ జిరకాల మమాత్యపద విలో నుండి రాజ్యతంత్రము లన్నియు నెఱింగిన వాఁడను.

ఇంద్రాదుల మోసమున నా ప్రభువులు నాకుఁ గఱవై నిలువ నీడలేక తెక్కలూడిన పక్షినై చిరకాలమునకు శ్రీవారి యను గ్రహభిక్ష వేఁడుచు నిప్పటి కిచ్చటికిఁ జేరఁగలిగితిని. క్రొత్త వాఁడనని కొంచెపు చూపు చూడక స్వామిగౌరవాభిలాషినై నా చెప్పెడి వాక్యములు విన వేఁడుచున్నాఁడను.

జలం—మణిగ్రీవా! జాలవిద్యాప్రవీణుఁడవు, సాముద్రికవేదివి, రాజకీయమర్మపరిజ్ఞాతవు, సర్వతంత్ర స్వతంత్రుఁడవు, ఇట్టి నిన్ను మెచ్చి నీ కమాత్యపదవి నొసంగఁ దలఁచుచుండ, ఇంకను నీకుఁ గ్రొత్తదనమా! సంశయింపకుము. నీ యాశ యము నివేదింపుము.

మణి—సార్వభౌముల యనుగ్రహమునకు సంపూర్ణముగఁ బాత్రుఁడ నైతిని. సార్వభౌమా! తాము సమబుద్ధిచే నింద్రాదుల నను గ్రహించిన యనుగ్రహింతురు గాక. ఆ కుటిలులు తమ నైజమును వీడ నేరరు. పయోముఖవిషకుంభసదృశు లగు నా దేవతల యునికి మన కెప్పటికైన నపాయకరము గాకమానదు.

సీ. మందారమాల లిం♦పొందఁ గూర్చుచునుండు
వజ్రహస్తునిఁ బంపి♦వైవ వలదె
పట్టణంబంతయుఁ ♦ బ్రహరిఁ దిరుగుచుండు
దండపాణిని ముందుఁ ♦ దఱుమవలదె
చారులై తిరుగు నా ♦ శౌరి కన్నవయైన
తోయజాప్తుని శశిఁ ♦ దోలవలదె?
యసురనాథుల కిప్పు ♦ డౌషధం బొసఁగెడు
నమరవైద్యుల ♦ సాగ నంపవలదె
గీ. ఇంటిలోఁ బాములం బెట్టు♦కొంట దగునె
ప్రక్కలో బల్లెముల నుంచి ♦ పండనగునె
సహజకుటిలులు సురలు నీ ♦ చాయనైన
నుండఁగా నౌనె? హితకోటి ♦ నిండవలదె?

తమ సాన్నిధ్యమున స్వామి గౌరవాభిలాషులు, స్వబంధులు, స్వమిత్రులు, స్వకులజులు, తప్ప నితరు లెంత యోగ్యులైనను ఎంత ధీరులైనను వారి నుంచరాదు. ఆయుధశాసనముల కెల్లర బద్ధుల గావింపవలయును. ఉత్తమవిద్యలు, ఉత్తమాధికారములు, ఉన్నత స్థితులు ప్రజాసామాన్యమునకు లేకుండఁ జేయవలయును. మునుముందు విబుధుల నెల్లఁ బదచ్యుతులఁ గావింపవలయును. మీ యౌన్నత్యమున కంతరాయము కలిగింప నెంచుఁదాపసుల తపస్సులను, కార్మికుల కర్మలను భక్తుల భక్తిని తుదముట్టింపవలె? ఇంతయేల?

ఉ. పాటలు పద్యముల్ జపత•పంబులు సర్వము మీదు పేరిటఁ
బాటిలు చుండఁగావలె సు•పర్వులు మున్నుగ నెల్లవారు ము
ప్పూటలు మీకు మ్రొక్క వలెఁ•బోటి యొకింతయు నెందులేక మీ
సాటికి మీరయై భువన•జాలము నేలవలెన్ జగత్ప్రభూ!
ఇదియే నా ప్రార్థనము.

జలం—[నిట్టూర్చి తల పంకించి] మణిగ్రీవా! ఇంక నా దేవతలకు మనకడ నిలువనీడ యుండదు. ఆ విష్ణువును గూడ శీఘ్ర కాలమునఁ బరిమార్పఁ బ్రయత్నించెద. నివేదింపుము. ఇంకను నీ యాశయముల నన్నిఁటిని నివేదింపుము.

మణి—మీకు నా యెడఁగల యనురాగమున కెంతయు సంతసించు చున్నాను. ఆర్యా! సుకృత పరిపాకమున సార్వభౌముండవైతివి. మీ జపతపఃఫలితమే యీ త్రిభువనపాలనము. మీ మంత్రతంత్రానుష్ఠాన సారమే సకలలోక సంసేవనము. సార్వభౌమా! కామారి యర్ధదేహమునఁ గాంత, విష్ణువువక్షమున వెలఁదుక, బ్రహ్మముఖమున నెలఁత వఱలుట, వైభవచిహ్నములు. అనితరసాధ్యము లగు త్రైలోక్యసుఖముల నుజ్జగించి భటలక్షణము లను వ్యాయామాదుల నాచరించుటయు, వృద్ధలక్షణములగు నియమములను నిష్ఠలను బరిగణించుటయు, ప్రతిభట విరహితులై త్రిభువనరాజ్యలక్ష్మీసనాథులగు జలంధర సార్వభౌములకుఁ దగినదికాదు. మాపు తగ్గిన ప్రకృతి శోభిం

పదు. ప్రాయము తగ్గిన ప్రమదలు రుచింపరు దేవా! రాజులు బహువల్లభులు. అందును సార్వభౌములకుఁ జెప్పఁ బనిలేదు. బృందా దేవియే మహాసుందరి యని డెందము నాందోళింపఁ జేయుచు నామమాత్ర గృహస్థులై యట్టెయుండుట న్యాయముకాదు. దేవర కటాక్షించిన అప్సరసల నధఃకరించు రమణీమణు లెందఱో కలరు. తోసిపుచ్చక నా యీ ప్రార్థనమును దేవర విమర్శింతు రని ప్రార్థించుచున్నాను. ఈచిత్రమును గూడ దయతోఁ జూడఁగోరుచున్నాను. [అని చిత్ర పటము నిచ్చును.]

జలం—[పటమును గ్రహించి, ఆశ్చర్యముతోఁ జూచి] ఏమి యద్భుతాకారము! మహాశయా? ఈమె చిత్రకారుని భావనా ప్రపంచములోనిదియా? లేక యిట్టి మనోహరాకృతి యెందైనఁ గలిగి యుండునా?—

మణి—దేవర సందర్శింపఁదలచిన కలుగకుండునా!

జలం—ఎందుగలదు?

మణి—నా మందిరముననే.

జలం—ఈయమ మీయింట నుండ నేల?

మణి—నా పుత్రిని సురుచిరతపఃఫలము. బ్రహ్మనుగ్రహసంపాదిత. నా సుకృతరాశి గనుక.

జలం—ఇయ్యది సత్యమా?

మణి—సార్వభౌముల యాదరమునకై వచ్చిన నే నసత్య మాడుదునా?

జలం—మణిగ్రీవా! జాలవిద్యాధురంధరుఁడవు, సాముద్రికుఁడవు, అమాత్యుఁడవు, బంధుగుఁడవు గూడ నగుదువా యేమి?

మణి—అంతియేగాదు. శరచాపములు దాల్చి రణభూమిని సంచరించు వీరుఁడను. వ్యూహములు పన్ను సైన్యాధిపతిని. ఆయుధములు పట్టకయే, పగతుర నడఁచివైచు బహుమాయావిని. అనుగ్రహించిన దేవర వైభవలక్ష్మి కంతటికి వజ్రకవచమును గూడ కాఁగలను. దేవా! ఇంతయేల?

ఉ॥ పున్నెపుపంట శ్రీయములఁ బొందితి విందునిను పేందునైనఁ జే
    సన్నల నిల్పఁ జాలితివి సర్వజగత్పరిపాలనంబు నీ
    కన్నులు బాహు లంఘ్రు లయిగ్రాలెడు బంధులు చూడ లోక మం
    దున్న సమస్తభోగముల నొందు మికన్ భువనైకనాయకా!

జలం—ఈ పటమును నా కడ నుంచుకొనియెద.

మణి—పటమేమి ? అసమానసౌందర్యరాశి యగు నా పౌత్రికయే మిమ్మానందాబ్ధి నోలలాడింపఁగలదు. మహామంత్రితోఁ గలసి నేఁడు మా యింటికి విందునకు దయచేయవలెను.

జలం—మంచిది. వజ్రికంఠునకుఁగూడఁ దెలియజేయుము.

మణి—అవశ్య మట్లు కావించెద. సార్వభౌముల యనుగ్రహమునకు మిక్కిలి సంతసించుచున్నాను.

[నిష్క్రమణము]

ఇది చతుర్థాంకము.






## పంచమాంకము



[బృంద గృహోపవనమునఁ బ్రవేశించును]

బృంద—అక్కటా! ఎంత నిరపరాధనై యెంత భగవదనుగ్రహము కలిగియున్నను అనుజ్ఞ వడయక పతిసన్నిధి కరుగుట కాత్మ యంగీకరింపకున్నదే! ఏల యరుగవలె ననుకొన్నను క్షణ మొక యుగమై భర్తృదర్శనాపేక్ష నిలచినచోట నిలువనీయక నా కేమియుఁ దోపనీయకున్నదే!

గీ. కాంచుచుండిన వస్తువుల్ ♦ గానబడవు
చేరివినుచున్న మాటలు ♦ చెవినిఁబడవు
ప్రాణములు గల్గియును స్థాణు♦భావ మొదవు
పతివియోగార్తి యిడని ♦ దుర్గతులుకలవె.

ఏమైనం గానిమ్ము. నేఁ డెట్లైన నాథుని సన్నిధికిఁ బోయెద. [సరళా! సరళా! అని పిలుచును.]

సరళ—[తెరలోనుండి] దేవీ! వచ్చుచున్నాను. [అనుచు సంభ్రమముతోఁ బ్రవేశించి] దేవీ! సార్వభౌములు, సార్వభౌములు.

బృంద—[ఆతురతతో సరళ చేతులు పుచ్చుకొని] ఏమీ! ఏమీ? [అని సంభ్రమించును]

సరళ—దేవీ! సార్వభౌములుంగా రెందులకో యిటే వచ్చుచున్నారు.

బృంద—సఖీ! నిక్కవమా?

సరళ—నే నసత్యమాడుదునా?

బృంద— [సరళను గౌఁగిలించుకొని] సరళా! ప్రాణేశ్వరునిఁ గన్నులారఁ గనుఁగొనియెద. మార్గమును జూపుము.

సరళ—పోదముపద [నిష్క్రమింతురు]

[ఉద్యానవనమున జలంధరుఁడు ప్రవేశించును.]

జలం—[మెల్లగ నడచుచు యోజన నభినయించుచు] శుక్రాచార్యుల వారు తపోగృహమునకు రమ్మని యాజ్ఞయా? విజయసాధనమా? వార్తపై వార్తయా? [తలనూచుచు] విజయము, సాధనము—

[పైకిజూచి] ఇంక నే నెవరినిఁ జయింపవలె. నాకేమి విజయము కావలె.

సీ. విల్లెత్తినంతనే ♦ తల్లడిల్లుచు మ్రొక్క
నృపతుల నింక ని♦ర్జింపవలెనె
గత్తిపట్టినయంతఁ ♦ గంపించి కేల్మోడ్చు
నమరాధిపతి నింక ♦ నదుమవలెనె
గదఁబూనినంత నం♦గదఁ దూలి వేఁడెడు
శేషాహి తల లింకఁ ♦ జిదుమవలెనె
కాంచినంతనె తలల్ ♦ వంచి హావ్యములిచ్చు
మునివరేణ్యుల నింక ♦ మోదవలెనె

గీ. వరదుఁడు గురుఁడు నని శూలి ♦ వదల వలదె
జలధి జామాత మాధవుం ♦ దోలఁగవలదె
వీరశూన్యంబు సర్వప్ర♦ థ్వీతలంబు
బాహుదర్పం బిఁకెందు నేఁ ♦ బఱపుకొందు.

లేదు, లేదు. నాకు ప్రతిభటుఁడు లేదు. సర్వలోకములు నా యధీనములు. సర్వదేవతలు నా సేవకసేవకులు. శుక్రుఁ డింకను నాకు రక్ష కట్టునఁట. ఏమి యా ముదుసలి వెఱ్ఱితనము.

శుక్రశిష్యుఁడు—[ప్రవేశించి] జయము, జయము, సార్వభౌములకు.

జలం—ఏమిది ?

శిష్యు—దేవర శీఘ్రముగ రావలయునని యాచార్యులవారి యాజ్ఞ.

జలం—రాకున్న ?

శిష్యు—సమయము మిగులును.

జలం—మిగిలిన ?

శిష్యు—మంత్రాధిష్ఠానదేవత భువనేశ్వరి యనుగ్రహము వీడి యన్య విధముగఁ దోఁచునఁట.

జలం—తోఁచిన ?

శిష్యు—[చేతులు నలుపుకొనుచుఁ బ్రక్కకుఁ జూచుచు] అయ్యాది ప్రభువులకుఁ బ్రమా...[అనుచు అర్ధోక్తిచే విరమించును]

జలం—ప్రమాదమా ?

శిష్యు—చిత్తము.

జలం—[సగర్వముగ] అయినఁ గానిమ్ము. నేనే సర్వదేవతల ననుగ్రహించుచుంటి నని నాకే దేవతానుగ్రహము వలదంటి నని చెప్పుము. నేను రానంటినని చెప్పుము. పొమ్ము. శీఘ్రముగఁ బొమ్ము.

శిష్యు—చిత్తము. [నిష్క్రమించును.]

జలం—ఔరా ! నిఖిలజగత్సంహారణ కారణత్రిణయన నేత్రాగ్నిజ్వాలా స్వరూపుండనై, సాగరానుగ్రహ సంపాదిత విజయశంఖసంకలిత దివ్యచూడుండనై, త్రిభువనరాజ్య లక్ష్మీసనాథుండనై, సర్వ దానవనాథుండనై; దేవతలనెల్ల ననుగ్రహించి యెల్లర కను సన్నల నడిపించుచు,సకలభువనేశ్వరుండనైన నాకొక భువనేశ్వరి యనుగ్రహమా ? ఇది మిగుల లజ్జాకరము. మోసము. అవ మానము. మంత్రము లని, యంత్రము లని కుక్షింభరులు చేయు పన్నాగము లివి. నా యౌన్నత్యమున కంతటికిఁ దానేకారణ మని చెప్పుకొనుటకు ముసలి యాచార్యుఁడు చేయఁబూనిన మోసము. శుక్రుఁడు- రక్ష- అశక్తులకు రక్ష, అసమర్థులకు రక్ష, పసిపాపలకు రక్ష, ఈ రక్ష, పాదరక్ష ఎవ్వరికిఁ గావల యును విశ్వాసముగల మంత్రిసత్తములు వేయిమంది రెండు వేల కనులతో విశ్వపాలన మవలోకించుచుండ, దండధరుడైన

దండింపఁజాలిన లక్షలకొలఁది దండనాయకులు తండోపతండముగ నా కడ నుండియుండ, అఖిలకార్యము లాత్మకులసంభూతు లొనరించుచుండ, సూర్యరశ్మి యెఱుఁగక, తలపూవు వాడక, కాలు క్రిందఁబెట్టక, నిరంతరభోగ పరంపరలచే మహానంద మనుభవించెడినే నవమాన మని యోజింపక యాచార్యునికడ కరుగఁదలఁచి కాలమంతయు వ్యర్థము చేసికొంటిని. కానిమ్ము! [పరికించి] ఎవఁడురా. అక్కడ?

బృంద—[ప్రవేశించి] సేవకురాలు బృంద యభివందనము చేయుచున్నది. [నమస్కరించును]

జలం—[నిర్విణ్ణుఁడై కోపముతోఁ జూచి కోపమడఁచికొని] నీవేలవచ్చితివి? నీకిందుఁ బనిలేదు. పొమ్మావలకుఁ బొమ్ము. [అని ముఖము ద్రిప్పుకొనును.]

బృంద—ఆర్యపుత్రా! కాఠిన్యమును వీడుము. దయామయుఁడవై నా యపరాధములు మన్నించి నన్ను నీపాదదాసినిఁ గావించుకొనుము [అని ప్రార్థించును.]

జలం—[తీవ్రముగఁ జూచి పండ్లుగీటుచు] ఓసీ! ఏమనుచున్నావు?

శా. నాదాస్యం బొనరిఁతువే యకట నా♦నారాజలోకంబు ముం
దా దేవావళి మ్రోలఁ, బెండ్లితరి మా♦ల్యంబట్లు జేఁజార్చి మ
ర్యాదన్ గంగను ద్రోసినావు, హరి దై♦త్యారాతినిన్ గొల్తు వీ
నీ దార్ష్ట్యంబు సహింపనౌనె యసతిన్ ♦ నిన్ ద్రుంపగాఁ జెల్ల దే!

[అని తీవ్రముగఁ జూచి] అయినను తాలిఁగట్టితి నని నిన్నుఁ ప్రాణములతో వదలుచున్నాను. పొమ్మావలకుఁబొమ్ము. ఇంకఁ దొలఁగి పొమ్ము. [అని బృంద చేయిపట్టి త్రోసి, ప్రక్కకుఁ దిరిగి నిట్టూర్చుచుండును.]

బృంద—[వెనుకకు మ్రొగ్గి నివ్వెఱవడి దైన్యముతో] ఆర్యపుత్రా! ఏల యిట్లనియెదరు?

జలం—జగద్వంచకుం డగు నా హరి యేకాంతసేవఁజేయు నిన్నిట్లుగాక యింకెట్లనవలయు! కుటిలవర్తను లగు దేవతాధములు

గూడ నీ మూలమున నా కపకృతి సేయుదురని వారి నెల్లర నంపివైచితిని. శిరమున ధరింపఁదగినదని చేఁబట్టిన పుష్ప మాల కాలాహి యైనది. పతి దేవత వగుదువని తలంచిన నీవు పరదేవతాసక్తవైతివి. ఇంక నా యొడిలోని పాము వు కాఁగలవు. నా కడ నుండఁదగవు. పొమ్ము! ఆవలకుఁ బొమ్ము!

బృంద—[దైన్యముతో] ఆర్యపుత్రా! చేతికి ఫలమందినఁ జెట్టునకు నిచ్చైనవేయువా రుందురా? నీ యనుగ్రహములేక నీ వియోగ మును సహింపనేరక నీ దర్శనభాగ్య మపేక్షించి పరమేశ్వరుం డగు నా విష్ణువు నర్థించితిని.

జలం—ఓసీ? దురాత్మురాలా! త్రిభువనేశ్వరుం డయిన నీ నాథు నవ మానించుటకా, ఆ మాయావికి, విష్ణుహతకునకుఁ బరమేశ్వర బిరుద మొసంగుచుంటివి.

బృంద—ఆర్యపుత్ర! మీ రిట్లన నే నే మనఁగలను? ఎంతవిద్యయున్నను ఎంత బలమున్నను, ఎన్నిలోకము లేలుచున్నను, మానవుఁ డసంపూర్ణుఁడు. అతని శక్తిసామర్థ్యము లసంపూర్ణములు. ఆ శ్రీహరియొక్కఁడే సంపూర్ణుఁడు. అతఁడే సర్వరక్షకుఁడు. ఆతఁడే పరమేశ్వరుఁడు.

జలం—ఓసీ ఏమనుచుంటివి?

మ. పరుఁడెవ్వాఁడును లేక నేనె త్రిజగద్భారంబు పైకొని దాల్ప నె
ల్లరు నన్నే పరదైవతం బనుచు నుల్లాసంబునన్ గొల్వ నా
హరినింకన్ బరమేశ్వరుం డనెదె! నాయౌన్నత్యమున్ మెచ్చ లే
క రిపున్ మెచ్చెడి నీదునాల్కనిటఁ దునుకల్ సేయఁగా రాదఁటే?

[అని తీవ్రముగఁజూచి] కాని మ్రింక నిన్ను గరుణించితిని. పొమ్మావలకుఁబొమ్ము! పోవక యట్లే నిలిచితివో? పాతాళమున కడఁగఁ ద్రొక్కి భయంకర కాలసర్పములమధ్య నిన్నిప్పుడేబంది వెట్టించెద పొమ్మావలకు బొమ్ము [అని పెడమొగముగ నిలుచును.]

బృంద—ఆర్యపుత్రా!నిరంతరము నీసేవజేసి ధన్యతఁ గాంచదగిన నాపై నింత కాఠిన్యమును జూపిన నే నేమనగలదానను? నా హృద

యము నీకడఁగాక యింకెందు నివేదించుకొందును? నా మనోభావములు నీ సన్నిధినిగాక నిం కెక్కడ విన్నవించుకొందును. నాథా! పాదదాసినిఁ గన్నులారఁ దిలకింపుము. నీ సేవకై నియోగింపుము. నన్నుద్ధరింపుము. [అని చేతులు పట్టుకొనును]

జలం—ఓసీ! నేను నీకడఁ జెవిటిని, మూఁగను, గ్రుడ్డిని. నీ ప్రయాసము వ్యర్థము. పొమ్మింక నావలకుఁ బొమ్ము [అని చేతులు వదలించుకొని యావలి కేగును]

బృంద—[దుఃఖాక్రాంతయై యాగి సంభ్రమముతో] నాథా! నాథా! నన్నేమిచేసి చనియెదవు? నాథా! [భర్తకడ కేగి] ఆర్యపుత్రా!

మ. పతియే దైవమటంచుభర్తృపదసే♦వాభాగ్యమే భాగ్య మం
చతిభక్తిన్ భజియించి స్వామికి మహా♦హ్లాదంబు గావించి ధ
న్యతనందం దలపోయ; నన్నిటులఁ ద్రో♦యం బాడియే? కాంతకున్
గతి నాథుండని నీవెఱుంగవె సతిః ♦ గారించుటల్ ధర్మమే!

ఈశ్వరాంశసంభూతుడవు, సకలవిద్యాపారంగతుఁడవు, నీ వెరుఁగని ధర్మముండదు. నీ కటాక్షవీక్షణముల నాపైఁ బ్రసరింపజేసి నాఁ జీవితమును గాపాడుము. న న్నుద్ధరింపుము,

జలం—[నిట్టూర్చుచు] బృందా! నీ ప్రయాసము వ్యర్థము. [నన్ను నిర్బంధించకుము] పొమ్మావలకుఁ బొమ్ము. [పోఁబోవును.]

బృంద—[సమీపించి] ఆర్యపుత్రా! అనవరతము నీ చరణములంటి యుండఁదగిన నాపై నింత కాఠిన్యముఁ జూపిన నే నేమనగలను? నాథా! కేవలము నన్నొక కీలుబొమ్మవలె నీ క్రీడామందిరమందుంచుకొని యానందింపుమని కోరను. పిల్లలకోడివలె నిరంతరముల్లసిల్లవలెనని తలంపను. ఎల్లపుడు మీ భోగభాగ్యములతోఁ దులదూగవలెనని యోజింపను. కేవల మీ యైహికసుఖానందమే పరమానందమని యెంచను. పుణ్యాతిశయమునఁ ద్రిభువనాధిపతివి నాకుఁ బతివైతివి. మీదర్శనభాగ్యము గలిగించుచు మీ దాసినై లోకసేవఁజేయ ననుజ్ఞ యిందు. నాకులభించిన

యీ దేహము, మీ సహధర్మిణీత్వము, నాకుఁ గల శస్త్రాస్త్ర సంపత్తి మొదలగు సర్వశక్తులు సఫలములు గావించుకొనియెద.

మ. శరవిద్యావిభవంబు సార్థకముగా ♦ సాధింతు నీ వైరులన్,
స్థిరధర్మంబలరన్ దిగ్లోకములకున్ ♦ క్షేమంబు కల్పింతు, మ
చ్చరితల్ గ్రాల భవద్యశోలతల నా♦శాచక్రమ ల్లింతుఁ, ద్వ
చ్చరణాంభోరుహయుగ్మముం గొలుతు మ♦జ్జన్మంబు ధన్యంబుగాన్.

ఆర్యపుత్ర! అనుగ్రహింపుము. దాసురాలనై మీ సేవఁజేయు నట్లనుగ్రహింపుము. [అని నమస్కరించును]

జలం—ఓసీ! నీవా నారాజ్యమునకు క్షేమమును గల్పించుదానవు. అయినఅగుదువుగాక! లేదు. నీకు నాకడ తావులేదు. పొమ్ము. నీ పురాకృతమును నిందించుకొనుచుఁ బొమ్ము. కాక యిట్లే నన్నడ్డగించి యలయించెదవా—కఠినశిక్షలపాలు గావించెద. పొమ్ము నామాట విని లోనికిఁ బొమ్ము.

బృంద—ఆర్యపుత్ర! నాదుర్విధికి నే నేమందును. కాంతలకుఁ బతి యనుగ్రహము లేక యే విభవములున్న నేమి? ఏ విశేషములు కలిగిననేమి.

గీ. పతి యనుగ్రహమే కద ♦ సతికి సకల
భోగములు భాగ్యములును, వి♦భూషణములు
అట్టి నాథు ననుగ్రహం ♦ బందనట్టి
తరుణి నెమ్మేను మృతకళే♦బరము గాదె.

ఏమైనను గానిమ్ము. మిమ్ము వదలఁజాలను. మీ సేవాభాగ్యమును బరిత్యజింపఁజాలను. [అని చేతులుఁ పట్టుకొనఁబోవును.]

జలం—ఓసీ! భర్తృప్రతికూలవాదినీ! పొమ్మావలకుఁ బొమ్ము.
[అని మెడబట్టి నెట్టి నిష్క్రమించును.]

బృంద—[క్రిందఁబడి మూర్ఛనందును.]

సరళ—అయ్యో! ఎంతకష్ట మెంతకష్టము. [అని సంభ్రమమునఁ బ్రవేశించి వివశయై పడియున్న బృంద కుపచరించును.] దేవీ!

దేవీ ! స్వప్నహాదప్పినట్లున్న దే ! ఏమి చేయుదును ? [అని విచార మభినయించును.]

బృంద—[తటాలున లేచి కూరుచుని] నాథా! నాథా ! ఎందుఁ బోయితివి. నాథా ! నీ ప్రాణకాంతను బృందను విడనాడిపోతివా ! [లేచి పరికించి] అయ్యో ! ఎందును గాన్పింపకుంటివే ? ఏమి చేయుదును? [సంభ్రమించును.]

సరళ—[బృందను బట్టుకొని] సఖీ ! ఏల పలవించెదవు ? ఇం దొకింత కూరుచుండువు గాని రమ్మా· [అని చేయిఁబట్టుకొని నిలుపును.]

బృంద—[కోపముతో జూచి] ఓసీ ! నా నాథునిఁ జూడనీయవా ? నా పతికడకుఁ బోనీయవా ? దురాత్మురాలా ! పో మ్మావలకుఁ బొమ్మా· [అని నెట్టును.]

సరళ—[వెనుకకు మొగ్గును ]

బృంద—ఆర్యపుత్రా ! ఆర్యపుత్రా ! నీ ముఖారవిందమును గనుఁగొననిమ్మా· నీ పాదపద్మములఁ బట్టుకొననిమ్మా. నిన్ను సేవింపనిమ్మా· [అని పోఁబోయి చెట్టునకుఁ గొట్టుకొనును]

సరళ—[కోపదృష్టితో] బృందా దేవీ ! ఏమి యీ మతిభ్రమణము· శాంతింపుము. [అని బృందను బట్టుకొనును.]

బృంద—ఆర్యపుత్రా ! ఆర్యపుత్రా! [అని క్రిందబడును]

సరళ—అయ్యో! ఎంత దెబ్బ తగిలినది· [విచారపడుచుఁ జేలము చించి కట్టును·]

బృంద—ఆర్యపుత్ర ! ఆర్యపుత్ర ! నా మొఱ వినవా? న నుద్ధరింపవా ! అయ్యో ! నా కేదిగతి ? [నిట్టూర్చి కనులువిచ్చి చూచి దుఃఖముతో] సరళా ! సరళా ! [అని సరళను గాఁగిలించుకొని] నే నెంత యదృష్టహీనురాల నైతినే ? నాథుని యనుగ్రహమునకుఁ బాత్రురాలను గాకపోయితినిగదే ! నన్ను గరుణించి, న న్నాదరించి నన్ను నమ్మించిన నాథుఁ డిట్లు సేయునని యెన్నఁడుఁ దలంపకుంటినిగదే ? [అని దుఃఖించును.]

సరళ—[ఓదార్చుచు] అమ్మా! చీఁకటిదినములు పోయి వెన్నెలదినములు రాకపోవు. లోని కరుగుదము రమ్మా. [అని చేయి బుచ్చుకొనును.]

బృంద—సరళా! నా కింక లోనికిఁ బనిలేదు. నెచ్చెలులతోఁబనిలేదు, వస్తువాహనాదులతోఁబనిలేదు, తీసికొనుము, నా యలంకారములన్నిఁటినిఁ దీసికొనుము. [అని నగలను దీయును] నాథుని యనుగ్రహమునకుఁ దప్పిన నా కింక వీనితోఁబనిలేదు. వ్యర్థమైన దేహమును విసర్జించెద. తెప్పింపుము, నా వస్త్ర భూషణాదులఁ దెప్పింపుము. స్వర్ణపేటికలను, మణిపేటికలను దెప్పింపుము. నా సమస్త వస్తుజాలమును దెప్పింపుము. ముత్తైదువులను బిలుపింపుము. విప్రపుంగవులను రావింపుము. నిఱుపేదలను రప్పింపుము. తనివిదీరఁ జేతులార దానముచేసెద. తెప్పింపుము. నా సర్వస్వమును ముందుఁ దెప్పింపుము. నా యాజ్ఞల నిర్వర్తింపుము. పొమ్మా. [అని సరళను నెట్టును]

సరళ—అమ్మా! త్వరపడకుము. కొంఁదికాలము పతివిగ్రహమును బూజించుచుండుము. అదియే నీకు సర్వాభీష్టములను సమకూర్పగలదు. రమ్మా. పోదము [అని చెయిఁబట్టుకొనును]

బృంద—[నిట్టూర్చి] సరళా! నా కష్ట జీవితము నేల యతిదీర్ఘము గావించెదవు? దుర్భరమైన యీ బాధ భరియింపఁజాలను. వదలుము, నన్ను వదలుము [అని చెయి విడిపించు కొనఁబోవును]

సరళ—[తీసిన ఆభరణములను, బృందచేతిసిఁబట్టుకొని] అమ్మా! వలదు. సాహసమువలదు. భర్తృవిగ్రహారాధన ముగావించుకొందువు, రమ్మా? [అని బృందను లోనికిఁ దీసికొనిపోవును]

ఇది పంచమాంకము

---




# షష్ఠాంకము



[జలంధరుని మందిర ప్రాంతమున దివ్యమణి మాలాలంకృతుఁడై మణిగ్రీవుఁడు ప్రవేశించును]

మణి—సృష్టి చాలా చిత్రమైంది. ఏనుగు ఆకారంలో పెద్ద, బుద్ధిలో నక్క పెద్ద. కాకపోతే, నేను పన్నిన పన్నాగానికి మహారాజులు, మహారాణులు, మంత్రులు, ప్రజలు, ఒకరేమిటి? ముల్లోకములు తారుమారు గావాలీ? ఈ మణి భూషణాలు, ఈ వస్త్రాలంకారాలు, మహామంత్రిపదవి నాకు లభించాలీ? నామాట మీద ప్రభువు శుక్రుడంతవాణ్ని కూడా తిరస్కరించాలీ? అయినా యీ జగత్తులో కాంతా, కనకం సమానం అంటారు. కనకం కంటేగూడా కాంత ఉందే స్త్రీ, ఆడది మహాచెడ్డది. ముక్కుతూ మూల్గుతూ ఉండే ముదుసళ్ళూ సర్వ పరిత్యాగం చేసిన స్వాములూ కూడా చానలంటే కాస్త చంకలాడిస్తారు. ఇంక ఇతరుల విషయం అడగాలె? అదే సత్యం కాకపోతే నేను ప్రయత్నం చేసి తెచ్చిన బాలికలకు రాజమంత్రులు వశ్యం కావటం,నా కింత యోగమూనా? [నవ్వుకొనుచు] కాని, యింతటి ప్రజ్ఞాశాలిని, యింతటి యోగశాలిని, నన్ను బృంద నిందించిందట. సార్వభౌముని సయితము త్రోసిరాజును జేయజాలిన నేను ఇంకొక్కమారిట్టి మాట వింటినా?—తన నాథుని చిత్రఫలక

సేవకూడా లేకుండా చేసి, బృందాదేవిని అడుసులోకి త్రొటి పండులాగ అధోలోకాని కణఁగ దొక్కివేయిస్తా. నా పోత్రినే గాక మంత్రిసామంతుల కన్యకామణుల సైతమ మెందఱినో యాదరించి, మహానంద మనుభవించెడి సార్వభౌము డింక బృంద ముఖం కూడా చూడడు. ఇప్పుడే వాహ్యాళి నెపమున నాయేలికను గాలవాశ్రమమునకు కొనిపోయి, యమ్మునిపత్నిని చెఱ బట్టించి, బృందకు చూపిస్తా. బలాత్కారంగా నేను దెప్పించిన వనితామణులను గూడా చూపించి ఆమె యేమి చేస్తుందో విచారిస్తా. కానిమ్ము, సార్వభౌముడు నాకై యెదురు చూస్తూ వుంటాడు. ఇంక పోయి యభీష్టము నెరవేర్చుకొస్తా ? [నిష్క్రమించును]

[గృహోపవనమున బృంద దీనయై కూరుచుండును.]

బృంద—అక్కటా! ఆర్యపుత్రుఁడు నామొఱ విని నన్నాదరించునని తలంచితిని గాని యింత నిష్ఠురుఁ డగునని తలంపకపోతినే! ఏమి సేయుదును? గోరుచుట్టుపై రోఁకటిపోటు పడినట్లు ఆత్మలాభ పరాయణులై, మంత్రిసామంతు లొనరించు స్వామివంచనము సైతము నాకు దుస్సహమై కన్పట్టుచున్నదే! ప్రభువుమన్నన లకుఁ బాత్రులగు సుపర్వుల నెల్లర నావల కంపించి, యమాత్యు లందఱు సార్వభౌముని సన్మానించు నెపమున గణనాతీతముగఁ దమ కన్యకామణులను, సోదరీమణులను, గానుకలఁగా సమర్పించి భూపాలతిలకుని భోగపరాయణునిఁ గావించి యరనిమునస్మైన నండ వదలకున్నారే? ఔరా! జపాకుసుమసాన్నిధ్యమున శుద్ధ స్ఫటికమువోలె, దురాత్ము లగు మంత్రులమూలమున నిష్కలంకమగు నాథుని హృదయ మెంత వింతగ మాఱినది.

సీ. క్రిమత బాహ్యాభ్యంత•రశుచిత్వ మొదవించు
స్నాన సంధ్యాద్యను•ష్ఠాన మెడలె
స్వర్గాపవర్గ సం•సర్గసాధనము లౌ
నిరతాగ్నిహోత్రముల్ • నిలిచిపోయె

వివిధవిభూతి మ♦ద్విభవ కారణములౌ
వరశివారాధనల్ ♦ సురిగి చనియె
పరవీరమర్దన ♦ ప్రథిత ప్రభావముల్
మంత్రితంత్రంబు లఁ ♦ మాట తొలఁగె
గీ. వేదపఠనంబు వ్యాయామ♦విఖ్యాతి వీఁడె
గురుజనంబుల గౌరవ♦స్ఫురణ దొఱఁగెఁ
బాసెఁ దొలుదొల్తనే లోక♦పాలనంబు
తరమె భరియింప హృదయేశు ♦ చరిత మకట!

ఎప్పుడు చూచినను స్త్రీలు, విహారములు, అడ్డగింపులే కాని సార్వభౌముని దర్శన మెవ్వరికి లభింపకుండెనే! దురాత్ముఁడు మణిగ్రీవుఁడు ప్రవేశించినది మొదలు దినదిన మీ మంత్రులసంఖ్య యధికమై లోకపాలన మంతయు వారి యధీనమై పరస్త్రీ పరధనాపహరణ మధికమై యెల్లవారికిఁ గష్టభూయిష్ఠమై దేవతలకు సైతము నిలువనీడ లేకుండెనే. ఏమిచేయవలె? స్వేచ్ఛాచారు లగు వీరి దుష్కృత్యములు నా మనస్సును మిక్కిలి కలంచుచున్నవి. నీతినియమములులేక ప్రజానురాగము లేక ధర్మరక్షణము లేక యుండిన ప్రభువుల ప్రాభవములు ప్రబలనేర్చునా? ఔరా! స్వార్థపరులగు నీమంత్రులు దుస్తంత్రముల నెంతయు మేరమీఱుచున్న వారే! ఏమి సేయుదును.

ఉ. ఏపనిఁ జూడనీక మఱి ♦ యెవ్వరిఁ జెంగటఁ జేరనీక యా
క్ష్మాపతి జంత్రపుం బ్రతిమ♦చందముగా నొనరించివైచి, తా
మే పదవుల్ గ్రహించి, తమ♦రే భువనంబుల నాక్రమించి సం
తాపముఁగూర్తు రెల్లరకు ♦ ధాత్రి భరించునె యిట్టి కృత్యముల్.
చ. బల మధికారమున్ సిరియుఁ ♦ బ్రాభవ మున్నత విద్య కల్గుచోఁ,
జెలఁగి పరోపకారమును ♦ జేయుట యుక్తముకాని యేరికిన్
గలఁచి ధరాతలంబు నిటుఁ ♦ గష్టముఁ గూర్చుచునున్న యీయఘం
బలమదె బాడబాగ్నిగతి, ♦ నా జనతాపము భూపునోంప దే?

ఈ జనఘోషము కాలకూటమువలె దుర్భరంబై ప్రభువుల సైతము స్పృశింపక మానదు? ఏమిసేయుదును? ప్రజలకష్టములు

పరిశీలించి వారి కేదే నుపకార మగునట్లు యోజింతునా? మునిపత్నుల నైత మపహరింపఁ దలంచు పతి మునిశాపహతుఁడు కాకుండ రక్షించు కొన యత్నింతునా? ఏది కర్తవ్యము? [ధ్యానము నటించి] ఆ శ్రీహరి కృపచే సర్వము నయనగోచర మగుచున్నది మణిగ్రీవునితోఁ గూడి, యార్యపుత్రుఁడు గాలవాశ్రమమున కేఁగుచున్నాడు. ఏదియో ప్రమాదము కలుగక తప్పదు. నేనింకఁ దడయరాదు? ఇప్పుడే పోయి యచ్చటి విశేషములు విచారించి పిమ్మట కర్తవ్యము నిర్ణయించెద.

[నిష్క్రమించును.]

[గాలవఋష్యాశ్రమము. చారుమతి పాటఁ బాడుకొనుచుఁ
బువ్వులు కోసికొనుచుండును.]

[జలంధర మణిగ్రీవులు ప్రవేశింతురు.]

మణి—సార్వభౌమా! ఇదియే గాలవాశ్రమము. మునుల తపములు మీ యౌన్నత్యమున కంతరాయములు కాఁగలవు. మునిపత్నినిఁ బురమునకుఁ గొనిపోవు ప్రయత్నము చేయుఁడు. దానితో మునికి నియమభంగము కాఁగలదు. సామ్రాజ్యము నిష్కంటకమై విరాజిల్లఁగలదు.

జలం—అటులనే చేయుదముకాని యెవరును గాన్పించుటలేదేమి?

మణి—[చూచి సంతసముతో] అదిగో మెఱపుఁదీగఁ జారుమతి. [అని చూపును.]

జలం—[చూచి] నిజము మణిగ్రీవా! నిజము. కనులు మిఱుమిట్లు గొల్పుచున్నవి? నీ వింక గొప్పకవివి కాఁగలవు.

మణి—మీ రిట్టి సుందరీమణులఁ జూపించుమనఁ జూపించుచు, ఆదికవి నటుండ మనునట్టు గొప్ప శృంగారప్రబంధము వ్రాసి మీ కంకితం చేస్తా.

జలం—[మణిగ్రీవుని బుజము తట్టుచు] నిజము, నిజము. నీ వంతటివాఁడవే. కాని యీామె సౌందర్య మసమానము. ఇట్టి సుందరీమణి నీ ముని చిరకాలార్జితం బగు తపోబలంబునఁ గైకొనియుండును.

మణి—అయితే మీ కేం తక్కువుంది. మీరు భుజబలంచేత గ్రహించండి.

జలం—సామదానములకు సాధ్యపడనప్పుడు కదా! కాని యీ రమణి రామణీయక మసమానము. [చూచి నిట్టూర్చి]

గీ. చారుమతి యేమొ? యీ తన్వి ♦ చారుగాత్రి
యనఁగఁదగు నీమె భజియించి ♦ యందియుండు
నతనుఁ డసమాశుగంబుల ♦ నట్లుఁ గాక
సుదతి కను గ్రీవ మరుతూపు ♦ లొందుగనేల.

[అని యాకాంక్షతోఁ జూచుచుండును]

చారుమతి—[జలంధర మణిగ్రీవులను జూచి] ఎవరువారు? అతిథులు కారు కదా? [రెండడుగులు వైచి నిలిచి సంశయముతో] ఏమి, వీరి యాకారములు? మునిపల్లెలకు వచ్చు జలంధర సంబంధులవలె నున్నారే? కర్తవ్యము?—కానిమ్ము.

మణి—[సమీపించి] ఈ యాశ్రమ మెవ్వరిది?

చారు—[ప్రక్కకుఁజూచి] మా యదియే?

మణి—మునిపతి యెచ్చట?

చారు—ఇప్పుడే రాఁగలరు. ఆతిథ్యమును గైకొనుఁడు. [అని లోనికి జనును.]

మణి—మంచిది [పర్ణశాలకడకు వత్తురు]

చారు—[లోనికిఁజని కృష్ణాజినములు తెచ్చి ద్వారముకడ వేసి] ఇందు కూఁగూచుండుడు. [అని లోనికిఁ జనును]

మణి—[ఒక యాసనమును ద్వారమున కీవలిప్రక్కకుఁ దెచ్చుకొని కూరుచుండును].

చారు—[ఫలజలములఁ దెచ్చి వారికడ నుంచి] గ్రహింపుడు.

మణి—ఓ, అలాగే! కాని రాలుకాయల కీ సార్వభౌములు రంజింప నేర్తురా?

చారు—వీరు సార్వభౌములా?

మణి—అబ్బ! వీరినే యెఱుఁగవా?—జలంధర సార్వభౌములు.

చారు—అతిథులుగా వచ్చిన సార్వభౌములు మా కెంతయు నాదరణ పాత్రులు. అల్పమని యెంచక యాతిథ్యమును గైకొనుఁడు.

జలం—సుందరీ!

గీ. ముజ్జగంబులలోనుండు ♦ పూవుఁ బోండ్లఁ
గేరి రసికుల నువ్విళు♦లూరఁ జేయు
తావక మనోజ్ఞరూపంబు, ♦ తరుణి! నీదు
యౌవన ఫలంబు వెలయు, న♦న్యంబులేల.

చారు—[మొగము చిట్లించుకొనును]

మణి—బహు చక్కగాఁ జెప్పారు. అమ్మా! సత్వరమే సార్వభౌమాను గ్రహపాత్రురాలవు కమ్మ.

చారు—[కోపమడంచుకొని]ఇట్టితలంపులుఁతగినవికావు. [లోనికరుగును]

జలం—సుదతీ! నీగృహమును గృహోపకరణములను జూడ వేఁడుకగు చున్నది. [లోనికిఁ బోవును]

మణి—నాకును తపోవన విశేషములు గనుగొన ముచ్చటగుచున్నది. [పరాళించుచుఁ దలయూఁచుచుఁ దోటలోని కరుగును.]

చారు—[సంభ్రమముతో ముందునకు వచ్చును]

జలం—తరుణీ! ఏల తొట్రుపడియెదవు? ఎందుఁ బోయెదవు? మాణిక్య మును మసిపాతం గట్టినట్టు నీ కీ వనవాస ముచితమైనదికాదు.

మ. పువుఁబోఁడీ! యిటు నారచీరలు వనుల్ ♦ పూరిండ్లు నీకేల, వా
చవిపోఁగాయలు గందమూలములు భో♦జ్యం బిట్లుగా నేల, గా
లవు నిస్సారపుసేవ యేల, బహుళా♦లంకార విస్ఫూర్తి ది
వ్యవరారోహలు గొల్వ నేలు నను దీ♦వ్యద్భోగభాగ్యోన్నతిన్.

చారు—[కోపసంభ్రమములతోఁ జూచును]

జలం—చారుమతీ! నీ సౌందర్యముతోఁ బాటు నీ యదృష్టము కూడ నగణ్యమై విరాజిల్లుచున్నది. త్రిభువనసేవ్యమగు మహా వైభవ మనుభవించుచు నిరుపమానంద సుఖసంధాయినివై మహాసౌఖ్య మనుభవింపఁగలవు. రమ్ము! గృహమునకుఁ బోదము, రమ్ము.

చారు—[కోప మడంచుకొని నిట్టూర్చి] సింహ శార్దూలాది క్రూర సత్వములు సైతము ఆశ్రమ ప్రభావమునఁ గామ క్రోధాదులు వదలి సత్వసంపన్నములై యన్యోన్యానురాగమునఁ బ్రవర్తిల్లు చుండ, నిన్నీ వ్యామోహాభూతము వదలజాలనందులకు మిక్కిలి విచారము కలుగుచున్నది. మహా తపస్సంపన్నుండై పరమ శివ సమానుండై బ్రహ్మేంద్రాదులకు సైతము సంసేవ్యుండగు గాలవఋషిచంద్రుని సేవ నిస్సారమా ? ఏమి నీయవివేకము?

శా. ముల్లోకంబుల నేలు మేటివయినన్ ♦ మోహంబు కన్గప్పి మా
పల్లెం జొచ్చి యిటాడెదే మునిపతిన్ ♦ బ్రహ్మణ్యుఁ డీమాని గం
పిల్లం జేయఁడె తాఁదలంచిన నినున్ ♦ విశ్వంబు సర్వంబు నీ
సల్లాపంబులు మెత్తురే మునిసతుల్ ♦ శాపాయుధల్ గానవే ?

మణినుండి కాంతిని, తేనె నుండి తీపిని విడఁదీయనేరని భంగి నన్ను నా ప్రాణపద మగు గాలవఋషిసార్వభౌమునుండి వేఱు పఱుపనేరవు. ఏల వృథా ప్రయాసము? పొమ్ము! నీమార్గమున నీవు పొమ్ము.

జలం—బాలా ! ఏల తూలనాడెదవు. రాజదృష్టి జాతికై నను బ్రమాదము కలిగింపక మానదు. అందును రాజాధిరాజ సకల సుర రాజ కోటీరమణి ప్రభా నీరాజిత పాద నీరేజుండగు, జలంధర సార్వభౌముం డూరక పోవువాఁడుకాఁడు. జగదేకవీరుఁ డీతఁడు పట్టిన పట్టు వదలువాఁడుకాఁడు. ఏల వనవాసక్లేశము! రమ్ము! సకల వైభవములతో మహానంద మనుభవింతువు· రమ్ము !

చారు—ఓయీ! మహాబ్రాహ్మణిని తపస్విని నన్నుఁగూడ నీ యైహిక సుఖంబు లాకర్షింప నేర్చునా?

గీ. పెదవిపైఁ దేనె బిందువుల్ ♦ విభవతతులు
బుడగ లిమ్మేను లిజ్జగం♦బులు మెఱుంగు
లరయ శూన్యంబులో వీని♦ తెఱఁగు లెఱుఁగు
బ్రహ్మఋషిపత్ని నీకు లోఁ♦బడునె వెడఁగ !

సార్వభౌముండననియు, సర్వలోకవందితుండ ననియు, జగదేక

వీరుండ ననియుఁ జాటుకొనుచుంటివి. నీవును నీ లోకపాల విజయమును నీ సార్వభౌమ పదవియు నీ పశుబలమును దపోధనాగ్రగణ్యుఁడగు నా పతి పాదధూళికైన సరిపోవని తలంపుము.

మ. మునినాథుండు తపం బొకింతయు వ్యయం బున్ జేయఁడే కాని,యు
య్యనఘుం డట్లొనరించెనేని నొక బ్రహ్మాండంబు కాఁజాలదే?
ఘన భోగోన్నతు లుల్లసిల్లవె ? సురల్ కంపింపరే? వీరధీ
రనికాయంబులు వెల్గవే? ఋషి తపఃప్రావీణ్య మీ వోర్తువే ?

ఇంద్రాదులను గూడ గడగడ లాడించిన మహర్షిసత్తములును, త్రిమూర్తుల సైతము బాలురఁ జేసిన పతిదేవతలును గలరు. సతుల కలుక వొడమినఁ గుబుసముల విడిచిన నాగుబాముల విధమునఁ గసిమసంగకమానరు. ఏల వృథాప్రయాసపడెదవు ? అపరాధివై మునికంటఁ బడక గృహమునకుఁ బొమ్ము!

జలం—తరుణీ ! నా ధైర్యమును బరిశీలింపు చుంటివా ? కటాక్ష మాత్రమున ముల్లోకంబుల నేలు పురుష సింహమున కెంత పిఱికిమందుఁ బోయుచుంటివి! గాలవుఁడు కాదు, త్రిమూర్తులు వచ్చినను నా పట్టు వీఁడువాఁడనుగాను. ఇంక నీవేమిసేయుదువో? ఎందుఁబోయెదవో విచారించెద [అని సంరంభమును జూపును]

చారు—ఓయీ ! జలంధరా ! త్రిలోకనాథుఁడ నని గర్వించి, అబల నని, యొంటిగా నుంటి నని సాహసింపఁ దలఁపకుము. నా పాతివ్రత్యమే నాకు వజ్రకవచము కాఁగలదు. నా తపఃప్రభావమే నాకు దివ్యాయుధమై, సర్వరక్షకమై విరాజిల్లఁగలదు. ఇంకెంత వారును నన్నుఁ దేఱి చూడనేరరు. పొమ్ము! ఆశ్రమమును దొలఁగి శీఘ్రముగఁ బొమ్ము.

జలం—ఏమీ! నీ పాతివ్రత్యము నీకుఁ గవచమై నీ తపం బాయుధంబై విరాజిల్లునుగా ! అవి నిన్నెట్లుద్ధరించునో చూచెద. నీకెవ్వ రడ్డు పడియెదరో విచారించెద. ఇప్పుడే నీ పాణిగ్రహణ మహోత్సవము గావించెద. [అని సమీపించును]

చారు—[వెనుకకుఁ దొలఁగి కోపముతో] ఓరీ! జలంధర పాతకా నిలువు మిది పిన్నాటకాదు. సమీపించిన భస్మము కాఁగలవు.

ఉ. శ్రీమహితుండ నంచు సుర♦సేవిత పాదతలుండ నంచు ను
ద్దామభుజుండ నంచు నిటు ♦ ధర్మము వీడి చరింపనౌనె? నా
స్వామిఁ దలంచి నిగ్గనిన ♦ శౌర్య మణంగదె నాదు పాణియున్
బౌము శిరంబువట్టుకొనఁ ♦ బ్రాణసమీరము భార మయ్యెనే.

జలం—ఏమీ! ఏమనుచున్నావు? [అని మీదికిఁ బోఁబోవును]

చారు—కాచుకొ మ్మిదే శాపజలము. [అని కమండలువు గ్రహించి శాపోదకము విడువఁబోవును.]

బృంద—[తెరలో] తల్లీ! చారుమతీదేవీ! పతిభిక్ష వెట్టుము. నన్నుద్ధరింపుము.

చారు—[ఆగి చూచును]

జలం—[ఆశ్చర్యముతో నుండును]

మణి—[దూరమున నుండి సంభ్రమముతోఁ జూచును]

బృంద—[ఆతురతతోఁ బ్రవేశించి] చారుమతీదేవీ! ఈ బృందకుఁ బతిభిక్ష పెట్టుము. న న్నుద్ధరింపుము.
[అని కొంగుపట్టి చారుమతికి నమస్కరించును.]

మణి—[భయ మభినయించును.]

జలం—[ఆశ్చర్యాగ్రహములతోఁ జూచుచుండును.]

చారు—[కోప మడంచుకొని] బృందాదేవీ! నీ మూలమున నిప్పట్ల నీ భర్తప్రాణములు దక్కినవి. ఇంక నీపతిని గృహము సేర్పుము.

బృంద—తల్లీ! నన్ను రక్షించితివి. ఇంక నా కాజ్ఞ యిమ్ము. [నమస్కరించును.]

చారు—మంచిది. పోయిరమ్ము.

బృంద—[భర్తచెయిఁ బట్టుకొని] నాథా! పోవుదము రండు. [అని యాశ్రమమునుండి ముందునకుఁ దీసికొనివచ్చి మణిగ్రీవునిఁ దీవ్రముగఁ జూచి] మణిగ్రీవా! తాఁ జెడ్డకోతి వనమెల్లఁ జెఱచినట్లు నీవు దుశ్శీలుఁడ వగుటయేగాక మంత్రులకు, సార్వ

భౌములకుఁ గూడఁ గళంక మాపాదించుచుంటివే? ని న్నేమన
వలయును?

మణి—సార్వభౌముని యాజ్ఞ నిర్వర్తింపుచుండు మనవలయును.

బృంద—[తీవ్రముగఁజూచి] అటులనా? కానిమ్ము! ఆర్యపుత్ర! మిమ్ము
విషయలోలురఁ గావించి దుష్టశాసనము లొనరించి స్వార్థ
పరులై ప్రవర్తించు నీ మంత్రుల దుర్మంత్రంబుల విచారింప
కుంటివే? ప్రజల యలజడి నెఱుంగ లేకుంటివే! కలుగుచున్న
యీ జగత్సంక్షోభమును జూడకుంటివే? ఏమనవలయును?

సీ. దేవతాయతన ప్ర♦భావప్రశస్తులు
చేడ్పడఁ దార్మొఱు ♦ చేసినారు
అవనీసురప్రా♦క్తనాగ్రహారమ్ముల
దుర్గతిమెయిఁ గూలఁ♦ద్రోసినారు
పరిణయవిధులను ♦ భంజించి కులశీల
గౌరవమ్ముల నేటఁ ♦ గలిపినారు
భారతమహిళాప్ర♦పత్తి, దుస్స్వాతంత్ర్య
శిఖిశిఖాతతిఁ ♦ బూఁది సేసినారు
గీ. ప్రభుని యోజకులును బ్రజా♦ప్రతినిధులును
మంత్రివరులును నిఖిలసా♦మంతనృపులుఁ,
బ్రాజ్యరాజ్యరక్షైక చ♦క్రంబు ధర్మ
మెడలె, రూపఱె గనవేల? ♦ పృథివిపాల!

ఇంతియే కాక ఋషులు దైవధ్యానపరాయణులు, మహా
తపస్సంపన్నులు. మహామూర్తులకుఁ గూడ వా రభివందనీయులు. అట్టి
మహనీయుల యెడ మీ రపచారము చేయఁజనదు. దేశకాలములఁ
బట్టి ధర్మమును నడిపింపకున్న ఉత్తమక్షేత్రముల నుమ్మెత్తవిత్తన
ములు వేయఁదలఁచు విధమై, ధర్మము పదభ్రష్టమై, లోకము వ్యాకుల
పడక మానదు. అయ్యది ప్రభువులకు హానికరము కాకతీరదు. ప్రాక్త
నార్యధర్మంబులఁ జెడనీయక, సకల ప్రజారంజన మొనరించుచు మీ
పరిపాలనమును జిరస్థాయి నొనరింపఁ బ్రార్థించుచున్నాను.

జలం—[శిరఃకంపము చేయుచు] బృందా! నీ యుపన్యాస మైనదా?

బృంద—ఆర్యపుత్రి! ఇది యుపన్యాసముకాదు. ఉక్తి ప్రియుక్తులు కావు. యథార్థమునకు దూరముగ నున్న ప్రభువుల హితము గోరి చెప్పు వాక్యములు. దయతో వినవలె. సత్యమును గ్రహింపవలె.

జలం—మంచిది, కానిమ్ము. నీ విచ్చటి వృత్తాంత మెట్లు తెలిసికొంటివి? అసహాయవై యెట్లు రానేర్చితివి.

బృంద—మహావిష్ణువు నన్ననుగ్రహించుట వలన.

జలం—ఏమి? హరి యనుగ్రహముననా నీ కీ శక్తి కలుగుట?

బృంద—భగవానుఁడై భక్తపరాధీనుఁ డగు విష్ణుదేవున కశక్య మే ముండును?

జలం—[కోపమడంచుకొని] అటులనా! కాని మ్మింక నీవు గృహము నకుఁ బొమ్ము.

బృంద—ఆజ్ఞకు బద్ధురాలను. కాని మీ రీ యాశ్రమమున కెప్పుడు రావల దని ప్రార్థించుచున్నాను. అనుగ్రహింపుడు. పోయి వచ్చెద. [నమస్కరించి నిష్క్రమించును.]

జలం—[కోపదృష్టి నిగిడ్చి] ఔరా! ఈ విష్ణుహతకుఁ డెంత దుండగీఁడై ప్రవర్తింపుచున్నాఁడు. బృందాహృదయపంజరముం జొచ్చి, నన్ను స్తంభితుఁ జేసి నా హృదయమును మార్చి, నా యభీష్ట మున కంతరాయము కల్పింపఁ జూచుచున్నాఁడే! ఓరీ! ద్రోహీ! విష్ణూ! దానవారి వని వినియుండియు నింతకాలము నీ యుపకృతు లను మఱచి యున్నందులకుఁ దగిన ప్రతిక్రియలఁ జేయుచు నన్ను మేల్కొలుపుచుంటివా?

చ. నిరతము కుంభికుంభముల నెత్తురుఁగ్రోలు మృగేంద్ర మొక్కెడన్
గరిశిశులూన కేసరశిఖంబయి తత్పరిభూతి యోర్చినన్
వెఱచునె లేడిపిల్ల యును? వీఁడిదియా ననురారి కంఠమున్
నఱకక సైచుచో, భువననాథులు మెత్తురె కొల్వవత్తురే?

మణి—దేవా ! చూచితిరిగదా, దురాత్ముఁడు విష్ణువానరించు పన్నాగము? ఇంక నా ద్రోహిని మీరుపేక్షింపఁదగదు.

జలం—ఓరీ! దైత్యారీ! విష్ణుహతకా! ఇప్పటికిని నీ దౌష్ట్యమును వదలనేరకుంటివే ! ఏమిసేయవలె? మహాబల సంపన్నుండ ననియుఁ జక్రాది దివ్యసాధనము లుండె ననియు గర్వించుచుంటివి కాఁబోలును. లోకైకవీరుఁడగు నీ జలంధర సార్వభౌముఁడు నిన్ను, నీ బలసంపదలను నీ యుద్ధసాధనములను క్షణమాత్రమున విధ్వంస మొనర్చునని తలంపుము.

శా. వక్రత్వమ్మొక విద్యగా వికృతరూ♦పస్వీకృతి న్నీవు ని
ర్వక్రప్రాభవులైన దైత్యవరులన్ ♦ వంచించి, నేఁడివ్విధిన్
వికాంతిన్ వెలయింతె దంపతులకున్ ♦ భేదంబు గల్పించి, యో
చక్రీ ! చక్రము శార్ఙ్గముం దునిమి ♦ మచ్ఛౌర్యాగ్నినిన్ వేల్చనే.

ఆపైని బృందను జిత్రవధఁ గావించి శత్రుశేషములేకుండ నభీష్టసుఖము లనుభవించెద. ఓయీ! మణిగ్రీవా!

మణి—దేవా! [అని చేతులు జోడించును]

జలం—ఇప్పుడే పోయి వైకుంఠమును ముట్టడింపవలయును. సేనాపతులతో సేనల సిద్ధము చేయు మని చెప్పుము.

మణి—చిత్తము.

జలం—విష్ణు విప్పు డేమిచేయునో చూచెదఁగాక [అని సంరంభముతో నిష్క్రమించును]

మణి—కోరిక కద్దుకలిగితే ఎవ్వరికైనా కోపము వస్తుందన్నమాటే! దాంతో సర్వము సంపూర్ణ మన్న మాటే [అని నిష్క్రమించును]

ఇది షష్ఠాంకము.

---




## సప్తమాంకము



[ వైకుంఠోపవనమున నారదుఁడు, శ్రీ మహావిష్ణువు కూరుచుని యుందురు. ]

విష్ణు—నారదా! జలంధరుని మంత్రులు స్వర్గమును గూడ నలజడిఁ బడఁ జేయుచుండిరా?

నార—అలజడియేమి? దేవతలు కూడ మోయుమన్న రాక్షసాధముల మూటలు సైతము మోయవలె. ఇంక నప్సరసల విషయమై యడుగఁ బనిలేదు. ఆ మంత్రులు, సేనాపతులు చేయు దుండగములు, వారి విజృంభణములు అపరిమితములు.

విష్ణు—[శిరఃకంపముచేసి] మంచిది. విజృంభింపనిమ్ము. సాగరదత్తంబైన శంఖంబు హరించినగాని, జగదపకారియైనను జలంధరు నెదిరింప సాధ్యముకాదు. నాతో యుద్ధమునకు వచ్చి నప్పుడెట్లో శంఖహరణోపాయము గావించెద. బృందాదేవి వచ్చిన యసాధ్యము. ఆమె నేదో విధమున నీవు నేఁడిటకు రాకుండఁ జేయవలె.

నార—ఏదో యేమి! మీ గుణగణాభివర్ణనము మీ భక్తపరాయణత్వము నుపన్యసించి మీ నామపారాయణమున నేను దనియుచు, నామెను దనియఁజేయుచుఁ గొంతకాలము గడపి వచ్చెద.

విష్ణు—మంచిది. పోయిరమ్ము [అని బుజము తట్టును.]

నార — చిత్తము. [అని నమస్కరించి నిష్క్రమించును.]

[తెరలో కలకలము.]

విష్ణు — [వినుట నభినయించి] రణదుందుభులు మ్రోఁగుచున్నవి. ఇంకఁ దడయరాదు. [శిరఃకంపము చేయుచు] జలంధరుఁడు పరాక్రమోపేతుఁడు, దుర్దముఁడు, మాయావి, మిగుల సాహసుఁడు. ఆతని యనుచరులు సైతము శౌర్యసాహసోపేతులు, బలపటిష్ఠులు, రణకోవిదులు, అయినఁ గానిమ్ము. నేను నిమిత్తమాత్రము. ఎవరి దుష్కర్మములే వారి నడంపకమానవు.

సీ. ఈలువతనమున ♦ నిల నేలఁగాఁ జాలు
కులసతి నేఁ చెడు ♦ కూళతనము
పరహితమతు లయి ♦ పఱఁగు మునీంద్రులఁ
గీడ్పడం జేసిన ♦ క్రించుఁదనము
లోకరక్షణసేయు ♦ లోకపాలుర నెల్లఁ
దిప్పలు పెట్టిన ♦ మొప్పెదనము
నిరతంబు నన్నెంచు ♦ పరమభక్తులఁ బట్టి
పరిమార్పఁ గడఁగిన ♦ పలువతనము

గీ. తరుణులం బట్టి గేస్తులఁ ♦ బరిభవించి
క్షోణికాంతకు నెగ్గొనఁ♦గూర్చునట్టి
మొఱకుఁదన మొక్కరూపయి ♦ మొనసి కడఁగి
తుళ్ళడంచి జలంధరుఁ ♦ దుంపకున్నె ?

శంఖచక్రాది దివ్యాయుధములఁ బంపి సేనల సేనాపతులఁ బరిమార్పఁ జేసెద. నేనుపాయమున జలంధరు వశమొనర్చుకొనఁ బ్రియత్నించెద. కానిమ్ము. కాలకాల ఫాలానలజ్వాలామాలికాస్వరూపుండనని లోకముల నెల్ల భస్మీకరింతు నని, గర్వించెడి యా జలంధర హతకుఁ డెంత సాహసమును జూపునో, ఎంత ధీరుఁడై ప్రవర్తించునో, విచారించెద. [నిష్క్రమించును.]

[యుద్ధసన్నద్ధుండై జలంధరుఁడు వైకుంఠప్రాంతమున విడిసి మణిగ్రీవునితో సేనాపతులకడకు వచ్చుచుండును.]

సేనాపతులు—[ప్రభువు నెదుర్కొని] జలంధరసార్వభౌమునకు జే. త్రిలోకనాథునకు జే. [అని నమస్కరింతురు.]

ప్రథముఁడు—సార్వభౌమా! సేనలు మొనలుతీఱి యున్నవి. ఇంకఁ దమ యాజ్ఞకై వేచియున్నారము.

జలం—[సేనాపతుల మధ్యకు వచ్చి] సేనానాయకులారా! వీరశిఖామణులారా! నిర్వక్రపరాక్రమోపేతులై త్రిలోకసేవ్య మగు నీ దానవరాజ్యమును గాపాడు మీకుఁ జెప్పవలసిన దేమియు లేదు. అయినను నా యీ పలుకులు సావధానులై వినఁగోరుచున్నాను.

సీ. చెనఁటివై దనుజులఁ ♦ జెనఁకిన యా శౌరి
కౌటిల్యము నడంచు ♦ కాల మిద్ది
పరదుర్భరంబైన ♦ బాహాబలప్రౌఢి
వెలయింపఁ జేసెడు ♦ వేళ యిద్ది
దేహముల్ విడిచిన ♦ దివిజారులం దన్పఁ
జక్రి రక్తం బోడ్చు ♦ సమయ మిద్ది
శత్రుశేష మడంచి ♦ సకలలోకంబులు
దానవోత్కర మేలు ♦ తరుణ మిద్ది
గీ. నిరుపమ పరాక్రమక్రమ ♦ నిర్జితారి
చక్రసాహసధైర్య వి♦స్తారవీర
నాయకవరేణ్యులార! సే♦నానులార!
వెఱవక కడంగి దునుముఁడా ♦ హరిని గిరిని.

మీ పరాక్రమ విజృంభణమున కిదియే తరుణము. వెనుదీయక విష్ణులోకము నున్మూలింపవలయును. ఆ విష్ణుహతకుని సంహరింపవలయును.

అందఱు—దేవర యాజ్ఞానుసారము ప్రవర్తించెదము. [అని కత్తిఁబట్టి నమస్కరింతురు.]

జలం—ఓయీ! నీవు నీ సేనలతోఁ బట్టణము ముట్టడింపుము. [మఱియొకనితో] నీవు నీ సేనలతో నగరమార్గముల నిరోధించి

యుండుము. [ఇతరులవంకఁ దిరిగి] మీ రెల్లరు మీ మీ బల ములతో శత్రుసేనలఁ దునుమాడు చుండవలయును. పొండు. ధీరులై ప్రవర్తింపుడు.

అందఱు—చిత్తము. జే జలంధరసార్వభౌమునకు జే! త్రిలోకనాథునకు జే. [అని నిష్క్రమింతురు.]

[తెరలో దుందుభిధ్వానములు.]

జలం—[వినుట నభినయించి] ఏమి యీ రణదుందుభులు! ఎంతయు శ్రవణపర్వ మొనర్చుచు నీ సమరయాత్రామహోత్సవము సాటిలేకున్న దే. [పరికించి సంతసముతో]

సీ. నవమేఘములు పయి ♦ నడయాడుగతిఁదోఁప
బలితమై ధూళి యం♦బరము గప్పె
వ్రేఁగున నుత్పాత♦లూఁగి ధాత్రియుడంగు
భంగి సేనలు యుద్ధ♦రంగ మలమె
దిక్కరికర్ణముల్ ♦ వ్రక్కలించుచు ఘోర
దుందుభిధ్వానముల్ ♦ గ్రిందుకొనియె
బ్రహ్మాండభాండంబు ♦ బ్రద్దలయ్యె ననంగ
బహుతరరణగుణా♦ర్భటులు వెలసె

గీ. ఆజికై పిల్వనంప రాఁ♦డయ్యెఁ జక్రి
కనఁడొ మద్వాహినులఁ, గల♦కలము వినఁడొ?
దాఁగెనో లేక యెటకేని ♦ దరలి చనెనొ?
చెదరి గుండియ, ప్రాణముల్ ♦ వదలుకొనెనొ?

మణి—నిజము; నిజము. దేవర యథార్థముచెప్పినారు. మీకు భయపడి విష్ణువు ప్రాణముల విడుచుటయే సత్యము.

జలం—సమరమునకు రాక తడయుచు విష్ణువు నా యుత్సాహమునకంతరాయమును గల్పించుచున్నాఁడే! మణిగ్రీవా! చూడు మా హరి యెటనుండియైన వచ్చుచుండెనేమో?

మణి—[చూచుట నభినయించుచు] దేవా! నల్లనల్లగా, పచ్చపచ్చగా దూరంగా ఎవ్వఁడో కనఁబడుచున్నాఁడు. వాఁడే దురాత్ముఁడు విష్ణువు కావచ్చును.

జలం—[చూచుట నభినయించి] ఓహో! ఇదియేమి? ఇట్లు వచ్చుచున్నాఁడు.

మ. తురగస్యందనముల్ వెలుంగవఁటఁ దో♦డ్తో సైన్యముల్ లేవు, ముం
దఱఁ దార్క్ష్యధ్వజముం గనంబడదు, చే♦తన్ జక్రముండో, యప, దొ
క్కరుఁ డేతెంచెదు కాంచనాంబరుఁడు మే♦ఘశ్యాముఁ డిట్లే వనాం
తరమందుం బదచారియౌనె? హరి యా♦తం డిట్లు రాఁ జెల్లునే?

మణి—[సమీపించి] స్వామీ! నల్లని దేహము, పచ్చనిబట్టలు, వనమాల, మణిహారము చూస్తే నిజంగా అన్నీ విష్ణుచిహ్నాలే! తప్పక యాతడే మీవైరి కావచ్చును.

జలం—నిజము. మణిగ్రీవా! నాకు నట్లే తోఁచుచున్నది. కాని నిరాయుధుఁడై వచ్చుటకుఁ గారణము?

మణి—అది యడుగవలెనా? దేవర సముద్రోద్భవు లగుటచేత సిరికిఁ దోబుట్టువులుగ నెంచి ప్రాణభీతితో బంధుత్వాన్ని దెలిపి పాదాలపైఁ బడి బ్రదుకవచ్చునని—

జలం—మణిగ్రీవా! బాగుగ యోజించితివి. లక్ష్మీకళత్రుం డనియే యింతవఱకు నేనును వీనిని గనికరించితిని. కాని యిప్పట్ల మాత్రమీతనిని వదలువాఁడను గాను. ఓరీ! విష్ణుహతకా! మాయావివై మా వంశీయుల నెల్లరఁ బొలియించుటయేగాక బృందను బ్రేరేపించి నన్నుఁగూడ వంచింపఁ జూచుచుంటివిగా? దృగ్గోచరుండ వగుచుంటివి. ఇం కెందుఁ బోయెదవో విచారించెద. మణిగ్రీవా!

ఉ. ఒక్కఁడె వచ్చుఁగాక, విపి♦నోర్వులలోఁ జరియించుఁగాక, చేఁ
జిక్కక నల్దెసల్ దిరిగి ♦ చేడ్పడుఁగాక, ధృతిం దొఱంగి యే
దిక్కును గానలేక పరి♦దేవనముం బొనరించుఁగాక, నేఁ
డక్కుటిలాత్ముఁ బట్టికొని ♦ యార్వ శిరంబును వ్రక్కలింపనే?

[తెరలో కలకలము వినఁబడును]

జలం } —[వినుట నభినయింతురు.]
మణి }

జలం—[ఆశ్చర్యముతో] మణిగ్రీవా! అదియేమి? సేనలో దీనారావ ములు వినంబడుచున్నవి?

మణి—[చూచి భయముతో] దేవా! అటుచూడుఁడు. ఆ చక్రము బండిచక్రమువలెఁ బెనుమంటలెగయ సైనికులఁ గాల్చుచున్నది. [వినుట నభినయించి] ఆహా! ప్రళయ భైరవారావములం బోలె భయంకరధ్వనుల నీనుచు నా చిందం మెంతయు గందరగోళము సేయుచున్నది. సైనికుల యార్తనాదములు సెలరేఁగుచున్నవి. దేవా! ఇంకఁ దోడుపడవలయును.

జలం—[ఆశ్చర్యముతోఁ జూచుచు వెనుకకుఁ దిరిగి విష్ణువును జూచి] ఔరా! ఈ దురాత్ముఁడు, విష్ణుహతకుఁడు తన యాయుధముల నన్నిఁటిని సైన్యములపై కనిపి, నిరాయుధుఁడై యిటు వచ్చు చున్నాఁడే! ఇప్పుడేది కర్తవ్యము? [యోజించి] మణిగ్రీవా! విష్ణువెంతయు మోసగించినాఁడు! నాకు మాఱుగ నీవు పోయి సేనల సేనాపతులఁ బురికొల్పి నీ ధైర్యసాహసములఁ బ్రకటింప వలె. శత్రువుల శత్రుసాధనముల నిర్మూలింపలె. విజయము చేకూర్చవలె. ఇదియే కర్తవ్యము. పొమ్ము, శీఘ్రముగఁ బొమ్ము.

మణి—సార్వభౌమా! మీరు విజయమునకై విచారింపవలెనా? ఉత్సా హమున వచ్చితిరిగాని మీరేల? మేము చాలమా?

చ॰ అరిగణ కాలమేఘ పవ♦నాభులు శూరు లనేకులుండ, దు
స్తరతర వైరి వీరమద♦సామజసింహులు మంత్రులుండ, వీ
రరణ గరిష్ఠ విక్రమ వి♦రాజితుఁ డీ హితవర్యుఁ డుండ నా
హరిగిరి యాగునే? యిఁకఁ ద♦దాయుధముల్ బలముల్ సెలంగునే?

నే నిప్పుడే పోయి యాయుధములతోఁ గూడ శత్రువులఁ బరి మార్చి విజయమును గైకొని వచ్చెద.

జలం—మంచిది, నీవట్లే గావింపుము. నే నిటు పోయి యా హరి కేశ పాశముం బట్టి యీడ్చుకొని వచ్చెద. [నిష్క్రమించును.]

మణి—[నిట్టూర్చి] అక్కటా! ఇప్పుడీ సార్వభౌముని యాన మోయ

రాని భారమైనదే ? ఏమి చేయవలె ? [దిక్కులు చూచి] ఆహా ! ఇది యేమి ? ఆ హరి కనఁబడినట్లే కనఁబడి దరియుచుఁ దక్కుచుఁ దాఁటుచు, జలంధరు నెందో గొనిపోవుచున్నాఁడు. బలములకు దూర మగు నీతని నొక్కని నేమిచేయునో గదా ? [సేనలకై చూచి] అబ్బా ! ఈ చక్రాద్యాయుధముల సంరంభ మెంతయు నోర్వరాకున్నదే ! స్వామియాజ్ఞ నెట్లు నెఱవేర్తును? ఎట్లూరకొందును. [భయకంపములతో] ఆ గరుడమూర్తి తన పక్షానిలవేగమున సైన్యమునంతయుఁ జాపచుట్టవలెఁ జుట్టుచుఁ, బాదహతుల రథముల భంజించుచుఁ జండతుండమున హాస్తికులఁ బొడుచుచు, భయంకరుఁడై పరివర్తిల్లుచున్నాఁడే ? ఆహా ! ఇది యేమి? విష్ణువు విల్లు శార్ఙ్గము కాఁబోలును ? తాళపత్రిమాణముగ నుండి శస్త్రవర్షమును గురియుచు, రథగజాశ్వములఁ దుత్తుములు సేయుచున్నది. అక్కటా ! ఆ గదాదండము, కాలదండమునకంటె భయంకరమై గిరగిర ద్దిరుగుచు, మదకుంభి కుంభముల మ్రిందఁజేయుచు రథములఁ గూల్చుచు రథ్యముల మోఁదుచు, వాహినులనెల్లఁ బొలియించుచు, గగ్గోలుపఱచుచున్నది. ఇంక నేను దలచూపిన నివియన్నియు నా పైనిఁ బడును, నన్ను మ్రిందఁజేయును, ఇంక నేనందుఁ బోఁజాలను. అటు సైన్యములే నశించుగాక, ఇటు సార్వభౌముఁడే మడియుఁగాక, నా యుసురుల కేల హాని కల్గించుకొనవలె ? వెనుకకు మఱలి యిందెందైన దాఁగి నా ప్రాణములు నేను దక్కించుకొనియెద. [అని భయముతో నిష్క్రమించును.]

[మహారణ్యప్రాంతమున జలంధరుఁడు మార్గాయాస మభినయించుచుఁ బ్రవేశించును.]

జలం — ఔరా ! ఈ విష్ణుహతకుఁ డెంత మోసగించు చున్నాఁడు. చేతికిఁ జిక్కినట్లే చిక్కి, లెక్క కెక్కువగఁ గొండలు, గుహలు, నదులు, మహారణ్యములుఁ దిరుగుచు నెంతకుఁ బట్టువడకున్నాఁడే! ఏమిసేయుదును ? వీని యాయుధార్భటులకుఁ

గల్లోలపడిన నా సైన్యము లేమయ్యెనో తెలియరాకున్నదే ?
[యోజన నభినయించి] నా సేనాపతులు బాహుబలసంపన్నులు, ప్రభుభక్తి పరాయణులు, ఆ గరుఁడునిఁ దునుమాడి చక్రాయుధాదుల వ్రక్కలించి, సేనలను రక్షించి, వైకుంఠనగరమును వ్రయ్యలొనర్చియుందురు. [ముందుఁజూఁచి] వాఁడుగో దురాత్ముఁడు విష్ణువు. సముద్రతీరమునఁ జల్లగాలికిఁ దిరుగాడు చున్నాఁడు. [తీవ్రముగఁ జూచి పండ్లుగీఁటుచు] ఓరీ ! విష్ణు హతకా! పాఱుఁబోతా ! నాకుఁ గూడ శ్రమను గలిగించు చుంటివిగా? ఇం కెంతకాల మి ట్లొనరించెదవో చూచెదఁగాక. గిరుల నదుల దూరుటగాదు. సముద్రమున దూఁకినను, ఆకస మున కెగసినను, పాతాళమునకుఁ బాఱినను నిన్ను వదలను. నిన్ను సంహరింపక విడువను. [అని సంరంభముతో నిష్క్రమించును.]

విష్ణు—[సముద్రతీరమునఁ బ్రవేశించి చిఱునగవుతోఁ దలయూఁచుచు] ఇప్పటికి సార్వభౌమునకుఁ జెమ్మటలు పోసినవి. ఇంక నరము లూడి సంధిబంధములు వదలవలె. [కోపముతో] సంపదంధుఁడై ముల్లోకముల కొండయుండ నను గర్వమునఁ గన్నుఁ గాన కున్నాఁడు. నన్ను సంహరించునఁట. సాధ్వీమణిని బృందను నఱకివైచునఁట. దురాత్ముఁడు నే నుంటినని, ధర్మహానికి నే నోర్వనని యెఱుంగఁడు కాఁబోలును? ఇటే వచ్చుచున్నాఁడు. రానిమ్ము. అహంకారమునఁ బెచ్చుపెఱిఁగిన వీని యొడలితీఁట వదలించెద. [శిరఃకంపముచేసి తీవ్రముగఁ జూచును.]

జలం—[తెరలో] ఓరీ ! విష్ణుహతకా! నిలు నిలు! పాఱిపోకుము.

విష్ణు—[చూచుచు] రానిమ్ము. రానిమ్ము.

జలం—[తెరలోనుండి] ఓరీ, ఇం కెందుఁబోయెదవురా ! [అని లోపల నుండి సంరంభముతోఁ బ్రవేశించును.]

విష్ణు—[జలంధరు నటునిటుఁ ద్రిప్పి, సముద్రప్రాంతమున అంతర్హితుఁ డగును.]

జలం—[పరిభ్రమించి చూచి] ఏఁడీ ? వీఁ డెందుఁబోయెను? [దెసలు చూచి] ఎందునను గానరాకుండెనే! ఓరీ! మాయావీ! చేపవై సముద్రమునఁ బడితివా? మూఁఢుడా! నా కీ సముద్రములు, గిముద్రములు, లెక్కలోనివి యనుకొంటివా? నా సామర్థ్య మిప్పుడే నీ వెఱుంగఁగలవు.

ఉ. నిండిన వార్థినీరముల ♦ నే నిదె నొక్కటఁ బుక్కిలింతు లో
నుండెడు బాడబానలము ♦ నొయ్యన మ్రింగుదు వెన్నపోల్కి భూ
మండలిఁ ద్రిప్పికొట్టుదును ♦ మార్పడి లోకము తుంగ, నింక ను
ద్దండభుజాబలం బడర ♦ దైత్యవిరోధిని నిర్హరింపనే?

ఓరీ! ద్రోహీ! చేఁపవుగాదు, జెల్లవైనను, సముద్రమునగాదు, ఇం కెందు దాఁగినను నిన్ను వదలను. [అని సముద్రమున దూఁకును.]

విష్ణు—[చూచి యాశ్చర్యముతో] ఔరా! వీఁడెంత సాహసుఁడు? కోపావేశ వివశుఁడై సముద్రమున దూఁకి మహార్ణవమునంతయు నల్లకల్లోలము గావించు చున్నాఁడే?

చ. అడుసున దూరుఁ, బై కెగయు, ♦ నంతరమందున సంచరించుఁ బె
న్వడి వెడలించి లోఁగొనెడి ♦ భంగములన్ విరజిమ్మువైచు, వెం
బడిఁబడు ఘోరనక్రముఖ♦వారిచరంబులతోడఁ బోరు, నే
మడియగఁజూతు శౌరి నను ♦ మందరమట్లు మథించు నంబుధిన్.

ఇప్పటికి వీనికి సంపూర్తిగ శ్రమకలిగినది. ఇంక నేను రూపాంతరమును గైకొని వీని శంఖహరణోపాయమును గావించెద.

[అని నిష్క్రమించును.]

జలం—[తెరలోనుండి] ఓరీ! విష్ణుహతకా! నిలు, నిలు. పాఱిపోకుము. [అనుచు శ్రమ నభినయించుచుఁ బ్రవేశించి] ఏఁడీ విష్ణువు. ఎందును గానరాకుండెనే? ఔరా! ఈతఁడు బాహుబలసమగ్రుఁడని పరాక్రమోపేతుఁ డని వింటినిగాని యింతటి నిరభిమాని యని, పాఱుఁబోతని తెలియఁజాలకుంటినే? రణరంగమునువదలి శత్రువులకు వెన్నిచ్చి పరుగిడు నిట్టి యధమునిఁ

బట్టనెంచుట మగంటిమిగల వారి కెవ్వరికైనను పౌరుషలోపమే గాక పాపావహముకూడ కాకమానదు.

ఉ. స్యందనముఁ ద్యజించి శర♦చాపము లూడ్చి, సుదర్శనంబు నం
దెందొ, కరంబువో విడిచి, ♦ యేపఱి, చచ్చి సగంబుగా వనం
బందున నన్నుఁ గాంచి, భయ♦మందుచుఁ బాఱిన పంద, శౌరి నే
చందమునన్ వధింపఁదగుఁ ♦ జచ్చినపామును జంప న్యాయమే ?

అయిన నీయరణ్యమున నెందైన దాఁగియుండునేమో? ఇంచుక పరిశీలించెద. [అని ముందునకుఁబోయి దెసలు చూచుట నభినయించి] లేఁడు లేఁ డెందును లేఁడు. ఆవిష్ణువు పాఱిపోవుటయే నిక్కువము. [అని ముందునకుఁ బోయి వినుట నభినయించి] వర్షాకాలమునఁ గోకిలాలాపమువలె మహారణ్యమధ్యమున నేదియో మనోజ్ఞమగు గానరవము వినఁబడుచున్నదే! ఏమిది? పోయి విచారించెద. [పోఁ బోయి ముందుఁ జూచి] ఆహా! ఏమి యీ మోహనాకారము. అసదృశముగ నున్నదే ?

గీ. మధుర మిమ్మేను గానంబు ♦ మధురతరము
వర్ణ్యమగు మానికం బయి ♦ వనము నెంతొ
గ్రాలఁ జేసెడు నీ ముద్దు♦బాలుఁ డౌర!
జలనిధిఁ దనర్చు నబ్జాల♦చందు్రిఁడనఁగ!

ఏమి ఈతని మనోధైర్యము. ఈ నిర్జనారణ్యమున నిర్భయచేతస్కుండై యుండి గానామృతవాహినుల వెలయఁ జేయుచున్నాఁడే. కానిమ్ము. సమీపించి యీతని వృత్తాంతమును దెలిసికొనియెద.

బాలుఁడు—[శిలాతలమునఁ గూరుచుండి పాడుచు, ఆనంద మభినయించుచుండును.]

జలం—[సంతస మభినయించుచు] బాలకా! నీ విందెవ్వరినైనఁ జూచియుంటివా ?

బాలు—నేను తప్ప నింకేమియు లేదే? చూచుట యెట్లు? కనుట యెట్లు ?

జలం—నీ వెక్కడ నుందువు ?

బాలు—అంతట నుందును.

జలం—నాకడ నెప్పుడైన నుంటివా ?

బాలు—అంతట నుండువాఁడను నీ కడ మాత్రమె ట్లుండకుందును ?

జలం—అటులనా ? అయిన నిన్నెప్పుడు చూచినట్లు లేదేమి !

బాలు—నన్నుఁ జూచెడి దృష్టి లేకపోవుటచేత. ఆ యదృష్టము కలుగక పోవుటచేత.

జలం—అది యెట్లు ?

బాలు—ఇం దేమికలవు ? [అని వనమును జూపును.]

జలం—చెట్లు, పుట్టలు, గుట్టలు.

బాలు—ఇం కేమియును లేవా ?

జలం—[చూచుట నభినయించుచు] కలవు. ఆ సెలయేఱు, నీవు కూరుచున్న శిల, నీవు, నేను.

బాలు—ఇంకేమియును లేవా ?

జలం—లేవు.

బాలు—నిక్కమా ?

జలం—ముమ్మాటికిని.

బాలు—అయిన నియ్యది పగలా ? రాత్రియా ?

జలం—సకలావభాసకుఁడై మనోజ్ఞముగ వేవెలుంగు వెలుంగుచుండ నిది రాత్రి యెట్లగును ?

బాలు—అయినఁ దొలుఁదొల్త నీ వీక్షణములకు సోఁకి నీకు సర్వమును గోచరింపఁజేయు దినకరప్రభను నీవేల పేర్కొనలేదు ?

జలం—నిజము కుమారా! నిజము. నేను బొరపడితిని ?

బాలు—నాయెడఁ గూడ నిట్టి యజ్ఞానమే నీకుఁ గలిగి యుండును.

జలం—బాలకా! నీవు స్వేచ్ఛగఁ బల్కుచున్నావు. భయసంశయము లక్కఱలేదా ?

బాలు—ఏకాకిని, బ్రహ్మచారిని, నాకేమి భయము? నాకేమి సంశయము ?

జలం—అటులనా ! కాని యిందేమి చేయుచుందువు ?

బాలు—బాలకులు క్రీడాసక్తులు గదా ?

జలం—[ఆశ్చర్యముతో] భయంకర మృగశరణ్యములే యీ వనస్థలములు, ఇవియా నీ క్రీడాస్థానములు ?

బాలు—ఔను.

జలం—ఈ కొండలు, గుహలు, నదులు, నీ కడలు గలిగించుటలేదా ?

బాలు—నన్నుఁ జూచినవారికే యే యడలు గలుగదే? ఇంక నాకెక్కడి యడలు ?

జలం—బాలకా ! నీ పలుకులెంతయు వింతఁ గొలుపుచున్నవి ?

బాలు--ఇంతకే వింత పడుచుంటివా? నా విహారణస్థలముల నన్నింటిని విన్నఁ గన్న నింకెంత వెఱఁగుపడుదువో ?

జలం—ఏమీ ? నీ విహారస్థలము లంత వింతఁ గలిగించునా ?

బాలు—సందేహ మేమి ?

జలం—అయిన నవి యేవి ?

బాలు—

సీ. మిను మ్రింగు గతి లేచు ♦ వననిధి కెరటాల
నొయ్యన నుయ్యాల ♦ లూఁగుచుందు
గ్రహకిరీటం బనఁ ♦ గన్పట్టు ధ్రువునిపై
పదము మత్పదముగాఁ ♦ బాడుకొందు
కడఁగి పిపీలికా♦గర్భ పీఠంబునఁ
గొలువు సాగించి నేఁ ♦ గూరుచుందు
కుండలీంద్రుని మేని ♦ కుదుటి చుట్టల మెత్త
పై లీల నొకవేళఁ ♦ బండుకొందు
గీ. అడలు నెడరును లేక నే ♦ నరుగుచుందు
నెఱుఁగువారల యెఱుకల ♦ నెఱుఁగుచుందుఁ
బేరులేనట్టి వానికిఁ ♦ బేరులకును
ఆటకానికి నెలవుల ♦ కవధి యున్నె ?

జలం—బాలకా! మాయావులమై, మహామోగులమై, సకల జాలవిద్య

లెఱింగిన మాకుఁ గూడ నలవికాని పనులను వాకొనుచుంటివే? నీ వైంద్రజాలికుఁడవా? జలస్తంభనాదుల నేమైన నెఱింగి యుంటివా?

బాలు—జాలికులలో మిగుల జాణను, యోగులలో మేటియోగిని, మాయావులలో గొప్పమాయావిని. నన్నెఱుంగుట కష్టము.

జలం—అటులనా! పెద్దలు సేయు చెయిదములకంటె, చేసెద నను పాల నోటి పలుకులు మిక్కిలి మనోరంజన మొనరించును. కానిమ్ము, ఇట్టి విచిత్రవాగ్రచనాప్రవీణుని నిన్నుఁగన్న తల్లిదండ్రు లెవరు?

బాలు—నాకుఁ దలిదండ్రులు లేరు. అందుచేత అందఱు నన్నే తల్లి తండ్రి అందురు. ఎవ్వ రేమనుకొన్నను నే నెల్లర హృదయము లలో మెలంగుచుందును.

జలం—నిజము కుమారా! నిజము. ఇట్టి ముద్దుపట్టిని చూచిన నెవ్వరి హృదయసింహాసన మధివసింపఁ జేసికొనదు. నిక్కముగ నా హృదయపీఠమును గూడ నాక్రమించుకొంటివి. నాకు మిగుల విస్మయమును గలిగించుచుంటివి. ఇట్టి ముద్దులమూటవు నీ వే ప్రభుపోషణములో నుందువు?

బాలు—[సహేలముగ] నా కొక ప్రభువు; పోషణమునా?

గీ. ఉపనిషత్సారములఁ దేలు♦చుండి యుందు
అమృతఫలముల నేనెప్డు ♦ డలరుచుందు
బ్రహ్మచారికి వేఱొక్క ♦ ప్రభువు గలఁడె
వాస్తవం బిద్ది నాకు నే ♦ ప్రభువరుండ.

జలం—వటూత్తమా! నీ మూర్తివోలె, నీ పలుకులు గూడ నవ్యక్తము లయ్యును, మిక్కిలి నన్నానందింపఁ జేయుచున్నవి.

బాలు—అవ్యక్తులకు నిజముగ నేను అవ్యక్తుఁడనే?

జలం—కుమారా! నీ వే మనినను నాకు సంతసమే కలుగుచున్నది. కాని నీ కింతటి ప్రబోధముచేసి నిన్నింతటి ప్రజ్ఞాశాలినిఁ జేసిన వా రెవ్వరు?

బాలు—ఎంతవారును నా దరికి రానేరరు, చూడనేరరే ? అట్టి నా కెవ్వరు బోధకులు కాఁగలరు ?

గీ. వీఁచుచుండును బవనుండు, ♦ వెలుఁగు నగ్ని,
భానుఁ డుదయించు, మృత్యువు ♦ పఱచుచుండు,
నా భయంబుననే, యింక ♦ నాకు బోధ
కుఁ డెవఁ డుండు, నిఖిల బోధ♦కుఁడను నేనె ?

జలం—[ఆశ్చర్యముతో] కుమారా! నీ సామర్థ్య మెట్టులున్నను పలుకు లెంతయు వింతగొల్పుచున్నవి. రమ్ము! నా కడ కొక్కమాఱు రమ్ము. [అనియర్థించును.]

బాలు—నేను గదలువాఁడను, వచ్చువాఁడనుగాను, నా కడకే అందఱును రావలయును.

జలం—అటులనా? అయిన నేనే వచ్చెద. [అని సమీపించి లాలించుచు] బాలకా! రమ్ము, నా కనువిందుఁజేయుచుందువు, మా యింటికిఁ బోవుదము, రమ్ము.

బాలు—నాయిల్లు చాలపెద్దది. మిక్కిలి యందమైనది. మిగుల నానందకరమైనది. అందఱయిండ్లు నా యింటిలోని భాగములే.

జలం—అటులనా? అయిన వింతవస్తువుల నిచ్చెద, రథగజ తురంగముల నిచ్చెద, మహారాజును గావించెద. రమ్ము! నాతోఁ గూడ రమ్ము.

బాలు—ప్రభువు పండితమండలినింబోలె, బ్రహ్మాండమును పరీక్షించి దానికి సర్వము నేనే సమకూర్చుచుండెద. అట్టి నాకింక నీ వేమియ్యఁగలవు.

జలం—అటులనా? కుమారా! నీ బాలభాషణములు, నీ మనోహరాకృతి, నా కాహ్లాదమును గలిగించినవి. నీ ముఖారవిందము నా డెంద మలరారఁ జేయుచున్నది. నిన్నర్థించెద. రమ్ము, నా యంకపాళి నధివసింపుము.

బాలు—అర్థించినవారి నెన్నఁడు వ్యర్థపుచ్చను. [అని నిలుచుండును]

జలం—[నివ్వెఱపడి] అటులనా? [అనుచు సాదరముగ బాలుని

గ్రహించి] బాలకా! నీ యాకృతి యెంతమనోజ్ఞమైనది? నీవాక్యము లెంత మధురములైనవి? రమ్ము, రమ్ము [అని తొడ మీద నుంచుకొని లాలనఁజేయుచు ముద్దిడుకొని యాలింగనము చేసికొనుచు ఆనంద మనుభవించును]

బాలు—[జలంధరు నొడలు తడుముచు] ఓయీ! శిరమున నున్నదిది యేమి?

జలం—అదియా! అది మహాశంఖము.

బాలు—అటులనా! నా మొలలోని శంఖమువలె నీ తలలోని శంఖము కూడ మ్రోఁగునేమో చూడవచ్చునా?

జలం—చూచుటయేమి? సాగరానుగ్రహసంపాదిత మీ శంఖము. బహుపుణ్యఫల సంపాదనీయము నీ సాన్నిధ్యము. కొనుము. ప్రీతిపూర్వకముగఁ గైకొనుము. [అని శంఖమునిచ్చి] కుమారా! నీవానందరాశివి, మహామధురమూర్తివి. ఏ యానందములును నీ యాలింగనసుఖమున సహస్రాంశమైనను బోలఁజాలవు. రమ్ము, నా గృహమునకుఁ బోదము రమ్ము. నా సర్వస్వ మర్పించెదను రమ్ము. [అని యాలింగనము చేసికొని] ఆహా! దీనియందెంత జీవరస మున్నది? ఈ సుఖ మమేయము, అవర్ణ్యము. [అని సుఖవివశుఁ డగును]

బాల—[శంఖమును గ్రహించి చూచి మొలనుండి శంఖమును దీసి యూఁదును]

జలం—[మూర్ఛితుఁ డగును]

బాల—[నిష్క్రమించును]

జలం—[లేచి చూచి] ఏఁడీ? బాలకుఁడేఁడీ? నామనోజ్ఞమూర్తి యేఁడీ? నా ముద్దులమూట యేఁడీ[వెదకుచు] బాలకా! పోకుము,పోకుము. [అని చూచుచు] మహానంద సంధాయకుఁడే—ఎందుఁబోయెనో కదా? బాలకా! బాలకా! రమ్ము? నీ తనుస్పర్శసుఖ మిమ్ము. [అని పరిభ్రమించుచుండును]

మణిగ్రీవుఁడు—[ప్రవేశించి యాశ్చర్యముతోఁజూచి] ఇదియేమి? సార్వభౌముఁ డిట్లు పరిభ్రమించుచున్నాఁడు.

జలం—బాలకా! బాలకా! [అని మణిగ్రీవునిఁ బట్టుకొనును]

మణి—[నవ్వుచు] సార్వభౌమా! నేను బాలకుఁడనుగాను. మణిగ్రీవుఁడను.

జలం—నీవు బాలకుఁడవుకావా? [అని తేఱి పాఱఁజూచి] మణిగ్రీవా! నీవు బాలకునిఁ జూడలేదా?

మణి—ఎవ్వరా బాలకుఁడు.

జలం—[పెదవి విఱిచి] మణిగ్రీవా! నీ వంధుఁడవు. నీ వభాగ్యుఁడవు. దర్శనీయవస్తువును దర్శింపలేదు. నీవు వ్యర్థుఁడవు పొమ్ము. బాలకా! బాలకా! [అని వెదకుచుండును]

మణి—[అటునిటుఁజూచి పార్వతినిఁ గనుంగొని జలంధరుని సమీపించి] సార్వభౌమా! మీరు చూచిన దీ వ్యక్తి కాదుకదా? [అని పార్వతినిఁ జూపును.]

జలం—[చూచి నిర్విణ్ణుఁడై] అంతకంటెను మధురతరమై ప్రకాశించుచున్నదే! ఏమి యీ సౌందర్యము.

గీ. సురుచిరాకార దరహాస ♦ శోభితాస్య
భాసురవిలాసనదన లా♦వణ్యరాశి
యెందుఁబొడమెనో? యుపమల ♦ కంద దొకట
నెవఁడు సృజియించు నిది స్వయం♦భువు నిజంబు.

ఔరా! ఎంతయు నుజ్జ్వలాకారమున వెలుంగుచుఁ జూడ్కులకు సైతము చోటు నీయకున్నదే? ఏమి యీ యద్భుతము?

గీ. ప్రకృతి శోభకు మూలమా ♦ ప్రభ యిదేమొ?
తనువుఁదాల్చిన తేజోని♦ధాన మేమొ?
కాక యీయింతి సౌందర్య ♦ గరిమ యింత
దేఱి గనరాక యిట్లు చె♦న్నారఁగలదె?

మణిగ్రీవా! కనులు మిఱుమిట్లుగొల్పుచున్నవి. నేను వర్ణింపఁజాల. ఆ సుందరి యెవ్వరు చెప్పుమా!

మణి—ఆమెయా ? త్రిపురసుందరి.

జలం—[చూచి యాశ్చర్యముతో] మణిగ్రీవా! నీవెంత యుపకారి వోయీ! త్రిపురసుందరీ సందర్శనము చేయించిన నీ కిదే వందనము. నీ వీ ప్రాంతమున నుండుము. నే నామెను గొనివచ్చెద. [అని పోఁబోవును.]

మణి—దేవా! ఆమె పతి ప్రమథపతి. ఇందే యున్నవాఁడు. ఆతని కంటఁబడిన నీ యభీష్టము నెఱవేఱుట కష్టము విచారించి పయనము కమ్ము.

జలం—[ఆగి, యోజన నభినయించి] ఆ! ఏమీ! ఆమె పతి ప్రమథపతియా? మిత్రమా! చక్కఁగ జ్ఞాపకము చేసితివి. నా సామర్థ్యమున నామెపతి నిప్పుడే గృహవిముఖునిఁ గావించి నా యభీష్టము నెఱవేర్చుకొనియెద. [నిష్క్రమించును.]

మణి—[ఆశ్చర్యముతోఁజూచి స్మరణ మభినయించి] అక్కటా! గురు తిరస్కారము, భువనేశ్వరియెడఁ జూపిన నిరాదరణము, ఫలము నకు వచ్చుచున్నవి. అవియే గాకున్నఁ బహుప్రియమగు నింతటి దుర్వ్యామోహమున జగన్మాతయై మాతృభావమునఁ జూడఁదగిన పార్వతీదేవినిఁ గూడ హరింపఁదలంచుటయా? ఈమహాపాప మీతని కింకఁ బతనహేతువగు ననుటకు సందియము లేదు. నిశ్చలముగ వెలుంగుచున్న నా ప్రతాపజ్యోతికిఁ గూడ నిది యాఘాతము కాకమానదు. [ముందుఁజూచి] ఓ రా! సార్వభౌముఁ డెంత మాయఁబన్నినాఁడు. తన సామర్థ్యమున మాయాగౌరిని సృష్టించి, మాయాజలంధరుఁడై యా గౌరీదేవిని హరించుచున్నట్లు, ఆమె యాక్రందనము చేయుచున్నట్లు నటించి యీశ్వరుని దూరదూరము గొంపోవుచుఁ దా నుద్వేగమునఁ బార్వతిని సమీపించుచున్నాఁడు. ఇది తెలిసిన నింక దానవేశ్వరునిపై నీశ్వరునికిఁ గోప మధికము కాకమానదు. దేవతలు విష్ణువుకూడ ఈతని విషయమై ద్రోహచింతనము సేయక మానరు. కానిమ్ము, ఏమగునో విచారించెద.

[నిష్క్రమించును.]

[కైలాసము - ఉద్యానవన ప్రాంతము]

జలం—[ప్రవేశించి వెనుకకుఁజూచి సంతసముతో] పీడ పోయినది ? మాయాపార్వతినిఁ గని నిక్కంపుభార్య యని ముక్కంటి వెంట నంటుచున్నాఁడు. పోనిమ్ము ! దూరదూరము పోనిమ్ము. [ముందుఁజూచి] ఇటులనే వచ్చినది. త్రిపురసుందరి యెచ్చట కరిగియుండునో? [ముందునకు నడిచి] ఇదే యుపవనద్వారము. లోని కరిగియుండును. [ముందునకుఁ బోయి] ఎవఁడురా ? అక్కడ ?

వనపాలకుఁడు—[సమీపించి] ఎందులకు ?

జలం—ఇటులఁ బార్వతి వచ్చెనా ?

వన—[కోప మడంచుకొని] ఎవరు నీవు ?

జలం—ఎవరైన నేమి ? పార్వతి వచ్చె నేమో చెప్పుము.

వన—[కోపముతోఁ జూచి] దేవదేవి యుద్యానవనము. ఇచటి కితరులు రాఁజనదు. చనుము. నీ వింక వెలుపలికిఁ జనుము.

జలం—[కోపముతో] ఓరీ మూర్ఖుఁడా ? పార్వతివృత్తాంతముఁ జెప్పుము.

వన—ఓయీ ! నీ వింక బుద్ధిగలిగి వెనుకకుఁ బొమ్ము ?

జలం—ఓరీ! ఏ మనుచుంటివి ? [అని పండ్లుగీఁటుచు భటుని మెడఁ బట్టి నొక్కుచు] ఏమీ వెనుకకుఁ బోవలయునా ? పోవుచున్నాను. పోవుచున్నాను. [అని వెనుకకు నెట్టుచు బాగుగ గొంతు నలిమి] చావు మింక నా కడ్డుపడకుండఁ జావుము. లేవకుండ జావుము. [అని నెట్టిపడవేసి పోవును.]

[ఉద్యానవనమునఁ బార్వతి పాడుకొనుచుఁ బూలు కోయుచుండును.]

జలం—[పార్వతి నాకాంక్షతోఁ జూచి] ఏమి యీ దివ్యమూర్తి ? దేదీప్యమానముగ వెలుంగుచున్నది. [అని తలయూఁచుచుఁ జెట్టుచాటునుండి పువ్వును గోసి పార్వతిపై వేయును.]

పార్వతి—[చెట్టువంకఁ జూచుచు జలంధరునిఁ జూచి] [స్వ] వీఁడు జలం

ధరుఁడే. ఎందుల కిట్లు వచ్చుచున్నాఁడు. [తలయూఁచి] బాలకా! ఏల యిట్లు వచ్చితివి?

జలం—ముదుసలిని వదలి న న్నేలుకొను మని చెప్పుటకు.

పార్వతి—కుమారా! న న్నెవరినిగాఁ దలంచితివి?

జలం—[సంతసముతో] శిరముపైఁ దాల్పఁదగిన యమూల్యమణిగాఁ దలంచితిని. వక్షమున ధరించి లాలింపఁదగిన మందారమాలగా నెంచితిని. సన్నిధి నుండఁదగిన రత్నపు త్రిరికగా నిశ్చయించితిని.

పార్వ—బాలకా! ఏమేమో యనుచుంటివి. అన్యునిగాఁ దలంచి యుందువు. పరమేశ్వరుని పత్నిని. నీకుఁ దల్లిని.

జలం—[నవ్వుచు] పాపము, నవమాసములు మోసి, కడుపారఁగంటివి కాఁబోలును. ఏల యీ కాలహరణము. రమణీమణీ! నీ సౌంద ర్యమున కాసించి వచ్చితిని. ఆలసింపక గృహమునకుఁ బోవు దము రమ్ము.

పార్వ—బాలుఁడవు, పాపము మతిపోయిన ట్లున్నది. ఎవ్వఁడురా? అక్కడ వనపాలకుఁడు.

జలం—వాఁడు లేఁడు.

పార్వ—ఎందుచేత?

జలం—ఇతరులున్న నింతులు సంశయింతు రని నీ యేకాంతమును గోరి వాని నంతకుపురి కంపివచ్చితిని

పార్వ—[కోప మడంచుకొని నిట్టూర్చి] జలంధరా! ఎంత మూఢుఁడ వైతివి? తుచ్ఛ మగు కామమును దీర్చుకొనుటకుఁ గలిగిన కాంతలు, చేఁబట్టిన తరుణులు, చాలకుండిరా! మాననీయమగు మాతృస్థానమును గూడ నాక్రమింపఁ దలంచుచుంటివే? ఇట్టి ద్విపాత్పశువును నిన్నేమి చేయఁదగదు? నేను తిండ్రించితినా, లోకములు తిండ్రించును. నేను కంపించితినా, లోకములు కంపించును. ఇంతయేల? దేవదేవుని యర్ధశరీరమను. నీకు మాతను. నిఖిల జగన్మాతను. కావున బాలకుఁడవని నీ బాల్యచాపలమును మన్నించితిని. బహుజన్మ సుకృత పరిపాకమున లభించిన

త్రిలోకాధిపత్య మను మహావృక్షము నెక్కి తమి దీర నందలిఫలము లనుభవింపక యవివేక మను గొడ్డలిచే, నెక్కిన కొమ్మ నఱకు కొని యేల యధఃపతితుండ వయ్యెదవు! ఒక్క విషబిందువు పడినను నిండిన క్షీరభాండ మంతయు నేలఁ గలుపవలసివచ్చును. ఒక్క సీలయూడినను బరుఁగిడు మహారథము కూలవలసివచ్చును. అటులనే, ఎట్టి పండితునకైనను, ఎట్టి ప్రభువునకైనను, ఇంకెట్టి వానికయినను ఒక్క దుర్గుణమున్నను అయ్యది హానిచేయక మానదు. నీతిని విడిచి ధర్మము నుజ్జగించి స్వేచ్ఛాసంచార మొనరింపకుము. కుమారా! నీ వెఱుంగవు. తనయునిపైఁ దల్లి ప్రేమ యపారము. తండ్రి యనురాగ మమేయము. దానవపతివి, సర్వలోకాధిపతివి. వినుము, నామాట వినుము.

గీ. రాజ్యపాలనఁజేసెడు ♦ రాజమౌళి
నేర్పునఁ జరింపవలె ధర్మ♦నియతి సెడక
కానిచో నిల్వనేర్చునే ♦ వానిసిరులు
కట్టతెగిన తటాకోద♦కములు కానె?

కావున నిప్పటికైన నా మాట విని దుష్క్రియాసక్తిని వదలి సన్మార్గ మవలంబింపుము, పొమ్ము.

లం—సుందరీ! నీ వేమనుచుంటివో నేను వినుటలేదు. నా చెవులు కూడఁ గన్నులైనవి. ఆ కన్నులు చకోరములై నీ ముఖ చంద్రుని సేవించుచున్నవి. ఆహా! నీ మధుర స్వరవిన్యాసము, నీ వయోవిలాసములు అసమానములు.

గీ. కలికి నిన్ను సృజించిన ♦ కమలభవుఁడు
మెఱపు నిగ్గులు దేఱిచి ♦ మేలిసుధలఁ
గలిపి కరువునఁబోసె ని♦క్కంబ కాక
యిట్టి మధురస్వరాకృతు ♦ లెట్లు గలుగు?

ఇంతటి మహత్తరాకారసంపన్నను నిన్ను నేను వదలనేరను.

మ. కమనీయాంగలతామనోజ్ఞమయి దృ♦గ్భ్రాజీవ సంసేవ్యమై
సమవక్షోరుహ పుష్పగుచ్ఛములు నా♦సల్ గూర్చు నీ యౌవన

ప్రమదారామము, దీనిలోన విహరింపన్ వేడ్క, నస్మన్మనో
భ్రమరం బువ్విళు లూరుచుండె నిఁక నిల్వంగ బోదు శాతోదరీ!

ఈ వెండికొండయేమి? బంగారుకొండ వెలయింతును, రమ్ము. అందు వసింతువు రమ్ము. [అని సమీపించును.]

పార్వ—[కోపముతో] ఓరీ తులువా! దూరముగ నుండుము. రుద్రుని కోపాగ్ని కింధనము కాఁగలవు. పొమ్ము, దూరముగఁ దొలఁగి పొమ్ము.

జలం—[ధైర్యముతో] నేనే ఆ కోపాగ్నిని. కాననమునఁ బుట్టిన కారుచిచ్చువలెఁ దలఁచికొనిన రుద్రేంద్రాదులతో సర్వజగత్తును భస్మముగావించెద. వచ్చెదవా? బలాత్కరింపు మనియెదవా?

పార్వ—బలాత్కరింతువా? నన్నుఁ గదలింతువా? ఓరోరి! ప్రమథ నాయకులారా! [అని కేక వేయును]

జలం—బాలా! ఎంత బేలవు. ప్రమథులా నన్నడ్డగించువారు?

శా. బల్లెంబుల్ శరచాపముల్ గొనుచు నీబంటుల్ ననుం దాఁకనీ,
ముల్లోకంబులు నేకమై కడఁగి నన్ముట్టన్ బ్రయత్నింపనీ,
ద్రళ్యంజేసెద వీని నే ననుచు నుద్రేకింపనీ శూలి, య
త్యుల్లాసంబున నిన్నుఁ జంకనిడి నే నుంకించి గొంపోవనే?

ఏల కాలహరణము? రమ్ము. ఇంకఁ గదలకుంటివా? పెకలించి కైలాసముతోఁగూడ నిన్నెత్తుకొని పోయెద.

ప్రమథులు—జయ జయ భవానీమాతా! జయజయ జగదీశ్వరీ! [అనుచుఁ బ్రవేశింతురు]

జలం—ఓరోరి ప్రమథాధములారా! ప్రాణములపై నాశయున్నఁ దొలఁగి పొండు? గౌరీ! ఇంక రమ్ము [అని సంరంభించు చుండును]

ప్రమథులు—దురాత్మా! నిలువుము [అని సంరంభముతో శూలములఁ జూపింతురు]

పార్వ—ప్రమథనాయకులారా? మీ రూరకుండుఁడు. [అని చేసంజ్ఞ చేయును]

ప్రమథులు—[నిలచి యుందురు]

జలం—ఆపనేల? రానిమ్ము [అని సంరంభమును జూపును]

పార్వ—ఓరీ మూఢా! అహంకారమునఁ గన్నులు నెత్తికి దెచ్చుకొని నన్నుపాసించి నాచే సర్వదా రక్షింపనెంచిన యాచార్యుని మాటలఁ దిరస్కరించి నా శాపమునకుఁ బాలుపడి నన్ను మాతృభావమునఁ గనుంగొనలేక పోతివి. త్రిలోకనాథుఁడ నని విఱ్ఱవీఁగుచుఁ గామాంధుండవై పతివ్రతలఁ జెఱఁబెట్టుచుఁ గాలాంతకు నర్ధదేహమును నన్నుఁగూడ నాకాంక్షించుచుంటివా? ఇంక నీ దుండగము సహింపరాదు.

జలం—[సహేలముగ] అటులనా? అంగనల ప్రగల్భములు ముంగిలి వఱకు. అతివల కోపము లఱినిముసము వఱకు. సహింపక యూఁడుది చేయున దేమో చూచెద.

పార్వ—ఓరీ! మందమతీ! ఆఁడువారెంత నేర్పరులో, ఎంత సహనశీలలో నీ వెఱుంగవు. బాలుర రక్షించునది, పురుషులఁ బోషించునది, ఇంతేయేల? గృహస్థులకు గృహమై,సన్మార్గ ప్రదాయినియై, సర్వానంద సంధాయినియైనది యాఁడుది. అందు ననేకదుష్కరకార్య నిర్వహణంబొనర్చి హరిహరాదులచేతఁగూడ నాదరింపఁబడు నన్ను నీవంటి సంపదంధులు, రాజ్యాంధులు, కామాంధులు దెలియుట దుర్లభము. ఇప్పటికైన వివేకము కలిగి దాసోఽహమని పదములంబడిన నిన్నుఁ గరుణించి నిత్యానందసంధాయకంబై సర్వోన్నతంబగు పదంబు నందించెద. పరిజ్ఞానములేక ప్రవర్తించితివో! క్షణమాత్రమున నిప్పుడే భస్మావశేషునిఁ జేసెద. ఇంకనైనఁ దెలివిగలిగి ప్రవర్తింపుము, పొమ్ము.

జలం—ఇంతీ! ఇంతయేల? నీ కరగ్రహణమహోత్సవపదవికంటె నితరపదవు లన్నియు నాకు విపదములు. ఇంక నే నోర్వను. నీ చేయునదేమో చూచెద. నీ కెవ్వ రడ్డుపడెదరో విచారించెద. రా రమ్ము. [అని యుద్రిక్తుఁడగును.]

పార్వ—ఓరీ! యుక్తాయుక్తములు లేక దుష్కర్మ మాచరింపనెంచు నిన్ను మన్నించుట కెందఱో కావలయునా? నా సేవకుఁ

డొక్కఁడు చాలఁడా? చివఱకు నా పాదనఖాంకురము చాయం దిరుగు పిపీలికము చాలదా ? ఇంతయేల ?

గీ. భైరవస్వామి నీ శిఖఁ ♦ బట్టనేల
తివిరి ప్రమథులు నిన్ను మ♦ర్దింపనేల
నీలకంఠుఁడు రానేల ♦ నీదుశిరము
మల్లెమొగ్గను బలె నేను ♦ గిల్లివెతు.

దురాత్మా! నిలువుము. [అని క్రోధఘూర్ణితనేత్రయై సంరంభించును.]

బృంద—[తెరలో] తల్లీ ? జగజ్జననీ ! త్రిపురసుందరీ ! మాంపాహి ! మాంపాహి! మాంరక్ష! మాంరక్ష! [అని మొఱవెట్టును.]

పార్వతి—[కోపమడంచుకొని వినుట నభినయించును.]

జలం—[సాశంకముగఁ గ్రోధముతోఁ జూచుచుండును.]

అందఱు—[ఆశ్చర్యముతో వినుట నభినయింతురు,]

బృంద—[తెరలో] దేవదేవీ! జగదీశ్వరీ! పతిభిక్ష! పతిభిక్ష! [అనుచుఁ జెమటతోఁ దడిసిన శరీరముతోఁ గురులు వీడ దీనయై భయ సంభ్రమములతో వచ్చి] తల్లీ! మాహేశ్వరీ! నన్నుద్ధరింపుము. నా పతినిఁ బ్రతికింపుము. [అని పాదములపైఁ బడును.]

పార్వ—బృందా ! నీ పతిభక్తి యసమానము. నిన్నాదరించి నీభర్తను వదలితిని. విడువుము, పాదములు విడువుము. [అని యాదర మున లేవఁదీయును.]

బృంద—[చేతులు దోయిలించి] అమ్మా! బ్రతికితిని. ధన్యనైతిని.

శివుడు—[తెరలో] ప్రేయసీ! ప్రేయసీ!

పార్వ—వచ్చుచున్నాను. [అనుచు] బృందా! నా హృదయేశ్వరుం డిటకు వచ్చిన నపాయము. వెంటనే నీభర్తను గృహమునకుఁ గొనిపొమ్ము.

బృంద—తల్లీ ! దయతోఁ జూచుచుండుము. నాకు ముదలయిమ్ము ? [అని నమస్కరించును.]

పార్వ—[కనుల నాదరించి నిష్క్రమించును.]

బృంద—నాథా! మనమింకఁ బోవుదము రమ్ము? [అని భర్త చెయిఁ బట్టుకొని నిష్క్రమింపఁజేయును.]

[రంగము పూర్తియగును.]

[బృందా జలంధరులు - కైలాసప్రాంతము.]

బృంద—నాథా! చండముండాద్యనేక దానవసంహారిణి, సర్వమంగళ, సకలలోక సంసేవ్య భవాని, విశేషించి మీ జననియగు పార్వతీదేవినిఁ గూడఁ బరిభవింపఁ జూచుచుంటిరే? ఎంత సాహసము.

సీ. ధరణీతలేశ్వరుల్ ♦ దనియింప నిడినట్టి
కాంతాజనం బెంతో ♦ వంతఁగుడువఁ
గులనాయకులు ♦ కూర్మిఁగొనఁగోరి యొసఁగిన
కన్యలు లోలోనఁ ♦ గనలుచుండఁ
గత్తికిఁ బెండిలిఁ♦గావించి తెచ్చిన
తరుణు లుదిక్తలై ♦ తలరుచుండఁ
బలిమిమైఁ దెచ్చిన ♦ పడఁతు లింకెందఱో
ప్రాణముల్ విడ సిద్ధ♦పడుచునుండఁ
గీ. గాంచఁ బోవించుకయును నీ ♦ ఘనతఁ గనవు
అంతకాంతకు కాంత లో♦కైకజననిఁ
జెనకఁ జూచెదు శిరమునఁ ♦ జేర్పఁదగిన
వజ్రమును నూరి త్రావెడు ♦ భంగి నకట.

ఆర్యపుత్రా! ఇంతటినుండి యైనను రాజ్యపతన హేతువులును ప్రాణాపాయకరములు నగు నిట్టి దుష్కార్యములను వదలి ధర్మ మార్గమున సంచరింపుఁడు.

జలం—బృందా! పిలువని పేరంటము వచ్చి నా యభీష్టముల కంత రాయములను గల్పించుటయే గాక ధర్మోపన్యాసము గావించు చుంటివే? ఔరా! ఎంత స్వాతంత్ర్య మవలంబించుచుంటివి?

బృంద—నాథా! అర్ధాంగినే. యథార్థము చెప్పుటకుఁ గూడ అధికారము లేదా!

జలం—[కోపముతో] నా యానందమున కంతరాయము కల్పించు నీవు నా యర్ధాఁగివిగఁ గాదు, పాదాంగివిగఁ గూడ నుండఁ దగదు. నీ వీ ప్రపంచములోఁ గూడఁ దిరుగఁదగదు, మనఁ దగదు, చావుము. ఈ చటియలపై ముక్కముక్కలై క్రిందఁ బడి చావుము. [మెడఁబట్టి నొక్కి విసరి పడవేయును]

బృంద—హా! భక్తవత్సలా! [అని పడిపోవును.]

జలం—[చూచి] నాకష్టములు గట్టెక్కినవి? ఇంక బృంద నా ప్రియత్నముల కడ్డుపడ నేరదు. ఇప్పుడేపోయి పార్వతిని బలిమిమై కొని వచ్చెద? [అని పోఁబోయి యాఁగి] నేనిట్లే పోయిన నాకోరిక నెఱవేఱునా? [యోజించి] కైలాసవాసు లెల్లరు కలవరపడు చుందురు. మహేశ్వరుఁడు సైతము మనస్సు చెడియుండును. కాదు, తరుణముకాదు సమయమును జూచి నాకోరిక నెఱవేర్చు కొనియెద. పార్వతీ! ఫాలనేత్రుని బాహుపంజరము నందుంటి నని, బలశాలు రగు ప్రమథకోటులు నా బల మని గర్వింపకుము. కొలఁదికాలములో నీవు జలంధరాధీనవు కాకమానవు? [అని శిరఃకంపము చేయుచు నిష్క్రమించును.]

[బృందాదేవి ఉద్యానవనము]

విష్ణు—[బృంద నుపవనమునకుఁ జేర్చి వస్త్రముతో విసరుచు] పతిరక్షణకై బృంద మిగుల శ్రమనందుచుఁ బ్రాణాపాయమును గూడఁ బొందుచున్నదే?

బృంద—[కనులువిచ్చిచూచి] ఆహా! ఇచ్చటి కెట్లు రాఁగలిగితిని? అపాయమెట్లు తొలఁగినది? [వెనుకకుఁజూచి] ఆహా! నాభజించు విష్ణు దేవుఁడా? [సంభ్రమముతో లేచి] దేవా! నన్నేల బ్రతికించితివి? నాథుని చేతిమీఁదుగ గంగలోఁబడి జలజంతువుల కాహారమై యుందునే?

విష్ణు—బృందా! మరణము శ్రేయముకాదు. విచారింపకుము. పోయి వచ్చెద. [అని పోఁబోవును]

బృంద—దేవా! నా సపర్యనైనఁ గైకొనకుంటిరే?

విష్ణు—వలదు, ఏమియువలదు. భక్తియే చాలును? [నిష్క్రమించును.]

బృంద—ఆహా! ఏమి శ్రీహరి భక్తత్రాణ పరాయణత్వము! కానిమ్ము, సరళా! సరళా! [అనుచు నిష్క్రమించును.]

[ఇది సప్తమాంకము.]






# అష్టమాంకము



[నారదుని ప్రవేశము]

నార—ఐహిక సుఖలాలసులై పరమార్థ మెఱుఁగని భోగపరాయణులగుటంజేసి జగదపకారులై మహాక్రూరులై ప్రవర్తించు రాక్షసరాజ మంత్రుల దుండగములు బ్రహ్మాండమంతయు నిండిపోయినవి. శ్రీమంతులకుఁ జీఁకటిరోజులువలెఁ బడుచు భార్యలుకలవారికా పాపాత్ముల దుశ్చరిత్రములు భరింపరాకున్నవి. జలంధరుని మూలమున శంకరునకుఁగూడ భార్య చంక తాళ్ళ కావలసి వచ్చినది. [వినుటనభినయించి] ఎవ్వరా గుంపులు గుంపులుగఁ బోవునది? [పఱికించిచూచి] దేవతలు,మునులునా? వీరెల్లరు మొఱఁబెట్టుకొనుటకు విష్ణుమందిరమునకే పోవునట్లు తోఁచెడిని. కానిమ్ము, నేనును అచ్చటికేపోయి కర్తవ్యము యోజించెద. [నిష్క్రమించును.]

[వైకుంఠమున విష్ణువు కూర్చుండి యుండును]

విష్ణు—భక్తుల యార్తనాదములు, దేవతల దీనారవములు, నాకు వినంబడుచు హృదయమును గగ్గోలుపఱచుచున్నవే? ఏమి సేయుదును? [వినుట నభినయించి] నారదుఁడు వచ్చుచున్నాఁడు. ఇంకను విశేషవిషయములుఁ దెలియకపోవు. రానిమ్ము.

నార—[ప్రవేశించి సంతసముతో] వైకుంఠనాథునకిదే నారదుఁడు నమస్కరింపుచున్నాఁడు. [అని నమస్కరించును.]

విష్ణు—ఆనందప్రాప్తిరస్తు. నారదా! రమ్ము, కూర్చుండుము. [అని పీఠము చూపును.]

నార—[ఆసీనుఁ డగును.]

విష్ణు—నారదా! బృందారకులస్థితి యెటు లున్నది?

నార—వారివలననే వినఁగలరు.

విష్ణు—దేవతలుగూడ వచ్చుచుండిరా?

నార—మందలు మందలుగ.

విష్ణు—శంకరుఁడెట్లు లుండినాఁడు?

నార—భార్యారక్షణము భారమై పలుఁగు లిడుచున్నాఁడు.

విష్ణు—శంకరునకుఁగూడ సంకటము కలిగెనా?

ద్వారపాలకుఁడు... దేవా! కైలాసపతి విచ్చేయుచున్నాఁడు.

విష్ణు—ఓహో! ఎవరక్కడ? పూజాద్రవ్యము. [ముందుఁజూచి] ఇందే యున్నది, కానిమ్ము. [అని సంభ్రమముతో నెదుర్కొని] గౌరీ నాథునకు విష్ణు వభివందనము చేయుచున్నాఁడు. [నమస్కరించును.]

శంక—కల్యాణప్రాప్తి రస్తు.

విష్ణు—[శంకరుని చేయిఁబట్టుకొని] దేవా! ఇటు దయచేయుఁడు. పీఠముపైఁ గూర్చుండఁబెట్టి పుష్పమాలవేసి నారదవిష్ణువులు వింజామరలు వేయుచుందురు.]

శంక—లక్ష్మీనాథా! నారదా! కూర్చుండుడు.

నారద విష్ణువులు—[కూర్చుందురు]

విష్ణు—ప్రమథనాథా! జలంధరుఁడు మీ మాహాత్మ్యమును గూడ సరకుఁగొనక పోయెనా?

నార—ఎట్లు సరకుఁగొనును? వారి యనుగ్రహాప్రభావమేకదా?

శంక—[నిట్టూర్చును]

విష్ణు—నారదా! మహేశ్వరున కేమి, నాకేమి? ప్రార్థించిన నెట్టివారి

కైన వరము లీయక తప్పదు. భక్తిగలిగి వివేకమునఁ బ్రవర్తించిరా? వారందని పదవి యుండదు. భస్మాసురునివలెఁ బ్రతిఘటించిరా, అట్టివారి విషయమై ప్రతిక్రియఁ జూడక తప్పదు.

శంక—లక్ష్మీనాథా! బుద్ధిహీనుఁడగు కొమరుఁడు కంటిలోని ఱాయి వలె నెంత కష్టము కలిగించునో నీ వెఱుఁగనిది కాదు. లోక దూరుఁడగు కొడుకును గన్నవానికి వేఱు యమలోక ముండ నేరదు.

విష్ణు—మహేశ్వరా! జలంధరుం డింకను కైలాసమునుండి దృష్టిని మఱల్చుకొనలేదా?

శంక—ద్యూతము, పానము, స్త్రీవ్యాపారము మొదలగునవి సామాన్యముగ నెంతవారికినిఁ దిరుగని సన్నిపాతములు. అవి వదలినవాఁడు తిరిగి పుట్టినవాఁడే. జలంధరునకుఁ బార్వతీ వ్యామోహము మితిమీఱుచున్నది. ఆ దురాత్ముఁడు ప్రమథునివలెఁ వచ్చి భటులఁ బ్రతిఘటించును. నందివలె గనుపించి కొందఱను మ్రిందఁజేయును. సింగమువలెఁ జేర చెలుల సెలఁగి చెరలాడును. ఇంతయేల? నన్నుఁబోలి పార్వతికి సన్నలఁజేయును. వానికి నిదుర లేదు సరిగదా! పార్వతికి లేదు, నాకు లేదు. కైలాసముకూడఁ గన్నుమూయుట లేదు. చెప్పి చెడితిని. ఎట్టకేలకుఁ బుత్త్రప్రీతిని బోఁద్రోలి, మొన్న నా మాయావినిఁ గనిపెట్టి కేలఁ గంఠమూఁది శూలమెత్తితిని. బృంద పదముల వ్రాలెను. ఆమె ప్రార్థనము నన్ను బందిగొనెను. ఏమి చేయుదును?

నార—మహాదేవుడు భార్యకై మనసు ఱాయిచేసికొనినట్టు విష్ణుదేవుఁడు లోకరక్షణకై బృందయందుఁ గొంచెము విరక్తి నందవలె.

విష్ణు—ఆహా! బృంద మహాసాధ్వియే! పరమభక్తిపరాయణయే! ఎట్లు విరక్తి నందుదును? వరప్రభావ మెట్లడంచు కొందును? బృందా రక్షణము, జలంధర సంహారమా? ఔరా! పాముచుట్టము, పడగ పగ యన్న సామెత చక్కఁగ నా కనువర్తించినది.

దేవతలు—[తెరలో]

శా. హా కైలాస నివాస! శంకరవిభూ! ♦ హా దీనమందార! హా
వైకుంఠాధిప! భక్తరక్షణకళా ♦ పారీణ! విష్ణు ప్రభూ!
లోకాధీశుల మేము మానితతితో ♦ లోకస్థితుల్ దెల్పఁగా
మీకై వచ్చితి మార్తిఁదీర్పరె కృపా♦మేయుల్ మమ్ముం బ్రోవరే.

వైకుంఠాధిపతికి జే! కైలాసనాథునకు జే! [అనుచుందురు.]

విష్ణు శంకరులు—[ఆలించుచు నిట్టూర్చుచుందురు]

నార—అయ్యలారా! వింటిరిగదా! దేవమానుల యార్తారావములు!

భటు—[ప్రవేశించి] దేవా! దేవతలు మానులు వచ్చి వాకిట నిలిచి యున్నారు.

విష్ణు—కొంచెము సే పుండుమనుము.

భటు—చిత్తము [నిష్క్రమించును]

విష్ణు—ఔరా! దైత్యబాధలకు లోకములు లోకేశ్వరులుకూడఁ దల్లడిల్ల వలసి వచ్చెనే?

శంక—జలంధరుని మాయలు పన్నాగములు దోహములు స్వయముగఁ గూడఁ జూచుటచేతనే పుత్రప్రీతిని విడనాఁడవలసి వచ్చినది.

నార—అటులనే రమానాథుఁడుకూడ బృంద కిచ్చిన వరప్రభావమును నిరోధించుకొనవలె.

విష్ణు—నారదా! బృందా ప్రభావ మనిర్వాచ్యము.

ఉ. ఎందరు లేరు సుందరు ల♦హీనమతుల్ పతిదేవతల్ జగం
బందున బృందఁబోలు సుగు♦ణాన్విత భర్తృహితానురక్త నే
నెందును గాన, నాథున కొ♦కింత శ్రమంబు ఘటిల్లె నన్నఁదా
నందుల కోర్చునే హరిహ♦రాబ్జజు లంచు గణింప నేర్చునే?

పాతివ్రత్యమహిమచే జగంబులఁ గీడ్వఁజుపఁ గలదు. శస్త్రాస్త్ర సంపదచే సర్వమును సమయఁజేయఁ గలదు. వానిని నిరోధించుటెట్లు?

నార—స్వామీ? తాతకు దగ్గునేర్పుదుమా? సర్వశక్తి సంపన్నులు తామే యోజింపఁగలరు? పోయినట్టులుండి మొలకలెత్తు బొమ్మ జెముడువలెఁ బుత్త్రప్రీతి మొదలంటఁ బోవుట కష్టము. మహే

శ్వరుఁ డా ప్రియత్నము చేయవలె ? సర్వదా పతినే ధ్యానించు బృందా దేవికి యుద్ధపర్యంతము భర్తృస్మరణ లేకుండ విష్ణుదేవుఁ డింట నిలుపవలె ? ధర్మరక్షణకై లోకపాలనమునకై జలంధర హరణవిధానభారమును పార్వతీనాథరమానాథులు పంచు కొనవలె ?

విష్ణు—[నిట్టూర్చి] నారదా! ధర్మతత్పరయై పరమభక్తురాలగు బృంద కే విధమునఁ గూడ నపకృతి యన్న మాటఁగూడ వినఁజాలనే? అట్టియెడ నేనై యామెను వంచింపఁ దలంచుట హృదయమును పాషాణమును గావించుకొనుట కాకుండునా ?

నార—హృదయమైనను సరియే, మీరైనను సరియే. లోకోద్ధరణము, ధర్మోద్ధరణము కావలె ?

దేవతలు, మునులు—[తెరలో] వైకుంఠాధిపతికి జే. కైలాసవాసు నకుఁ జే. [అనుచుందురు.]

విష్ణు—ఎవఁడురా, అక్కడ ?

భటు—[ప్రవేశించి] దేవా! ఆజ్ఞకై వేచియున్నాము.

విష్ణు—మునిబృందారకుల నెల్లఁ దోడ్కొనిరమ్ము.

భటు—చిత్తము [నిష్క్రమించును]

విష్ణు—[నిట్టూర్చి] ఇంక బృందానిరోధము, జలంధరవధ తప్పని కార్యములు.

మునిబృందారకులు—[లోపలినుండి] జయము, జయము రమానాథు నకు. జయము జయము పార్వతీశ్వరునకు. [అనుచుఁ బ్రవేశించి సాష్టాంగ నమస్కారము చేయుదురు]

విష్ణు శంకరులు—సురేశ్వరులారా ! మౌనిపుంగవులారా ! లెండు.

అందఱు—[నిలుచుందురు]

ప్రథముఁడు—మహాదేవా ! విష్ణుదేవా ! లోకమునఁ గర్మలు నశించి నవి. ఆచార మడుగంటినది ? ధర్మము పోయినది ? నీతి దొలఁగి నది ? జలంధర పరివార బాధితులమై యల్లాడుచుంటిమి. ఆపన్నులము. రక్షింపవలయును.

విష్ణు—ఇంక మీ బాధలు తొలఁగఁగలవు ? విచారింపకుఁడు.

నారద—హరిహరులు జలంధర హరణోపాయ భారమును బంచుకొని నారు.

శంక—మీరు నిర్భయులు కండు ? మునిశ్రేష్ఠులారా ! మీ జపతపో బలంబుల మాకు సాయము చేయుఁడు ? బృందారకులారా ? మీ రెల్లరు మాకుఁ దోడ్పడ సమరసంసిద్ధులై రండు, పొండు ?

అందఱు—మహాభాగ్యము. [నిష్క్రమింతురు]

విష్ణు—మహాదేవా! నారదా? మన యింక లోని కరుగదము, రండు.

[నిష్క్రమింతురు]

[జలంధరుని శయనమందిరప్రాంతము.]

వజ్రి—[ప్రవేశించి వెనుకకుఁ దిరిగి చూచి] సార్వభౌమునకుఁ గొంచెము కన్ను మూఁతవడినట్లున్నది. ఎంతసేపు? క్షణము నిద్ర, క్షణము కలవరింత. క్షణములో మేల్కొనుట. ఈమనోవేదనకు మందు లేదు. నిద్రలో సయితము పార్వతీ స్మరణము తప్ప వే ఱొకటి లేదుకదా ! మణిగ్రీవుఁడు కూడ సార్వభౌముని ప్రేరేపించుచు నెంత నీచుఁడై ప్రవర్తించుచున్నాఁడు? దురాత్ముఁడు. సూది వలె వచ్చి దబ్బనముగాఁ దేలి నన్నుఁగూడ వెనుకకు దన్ని రోఁకలిబండయై చివఱకుఁ గాఁడిమ్రానై ముల్లోకము లల్లకల్లోలము గావించుచున్నాఁడు. ఏమి సేయవలె? [వినుట నభినయించి] సార్వభౌముఁడు మఱలఁ గలవరించుచున్నట్లున్నది. ఇతరులు రాఁగూడదు. నేను సయితము దగ్గఱ నుండఁగూడదు. ఎచ్చటికిఁ బోఁగూడదు. ఇంత దుర్వ్యామోహము, ఇంతయవివేకము ఊరకపోదు. సేనలతో సేనాపతులతో మణిగ్రీవుని కైలాసమును ముట్టడింపు మని యాజ్ఞ. నిఖిలమంత్రి సామంతులకుఁ ద్రిలోక వీరులకు రణరంగమునకు రమ్మని యుత్తరువు. గురువుల వారిని శుక్రాచార్యులను త్వరితముగ బిలువుమని యాన.

బృంద—[ప్రవేశించి] ఎవ్వ రా ద్వారముకడ నున్నది?

వజ్ర—[చూచి నివ్వెఱపడి] అమ్మా! నమస్కారము. నేను వజ్రకంఠుఁడను. కాని యసమయమున వచ్చితిరేల?

బృంద—నాథుఁడు తిరిగి కైలాసమున కరిగెనేమో విచారించుటకు. వీలగునెడల నుపచరించుటకు.

వజ్ర—సార్వభౌముఁడు శయనించియే యున్నాఁడు. మిమ్ముఁగాంచిన నాగ్రహించును. మీరు వెడలుఁడు. నేనే యుపచరించుచుండెద.

బృంద—మంచిది, నాథునికడ నప్రమత్తుఁడవై యుండుము. నేను బోయి వచ్చెద.

వజ్ర—తల్లిగారి యాజ్ఞకు బద్ధుఁడను.

బృంద—[నిష్క్రమించును]

వజ్ర—మహాసాధ్వికి బృందకు నిరంతరము పతిచింత. సార్వభౌమునకు శంకరార్ధ శరీరిణిపైఁ జింత. ఏమిచేయవలయును? [వినుట నభినయించి] సార్వభౌముఁడు పిలుచుచున్నట్లున్నది. పోయి వచ్చెద. [లోని కరుగును]

[జలంధరుని శయనమందిరము]

జలం—[పాన్పుపైఁ బొరలుచు] పార్వతీ—పార్వతీ—నంది—నంది—ప్రమథులు-సుందరీ-ఏఁదుఁ బోయెదవు? [తటాలున లేచి కూర్చుండి] పానీయము [అని చూచుచుండును]

వజ్ర—[పాత్రఁగొని] ఈ చూపు తిరుగదు? [సమీపించును]

జలం—సుందరీ! నీ సౌందర్య మసమానము! ఎందుఁబోయెదవు? పోనీయను-పోనీయను [అని లేచి మంత్రినిఁ బట్టుకొనును]

వజ్ర—దేవా! పానీయమును గ్రహింపుఁడు.

జలం—[రిచ్చవడిచూచి తలయూఁచి నిట్టూర్చి జలపాత్ర గ్రహించి] [స్వ] ఇయ్యది చిత్తవిభ్రమణము. [పానీయము గ్రహించి] వజ్రకంఠా! యుద్ధసన్నాహము చేసివచ్చితివా?

వజ్ర—చిత్తము.

జలం—ఆచార్యులవారు వచ్చిరా? వారేమనిరి?

వజ్ర—ఇది యుద్ధమునకుఁ దగిన యదను కాదనిరి.

జలం—ముదుసలి భయపడి యుండును. ఇది జలంధర సార్వభౌముని రణకేళి యని యెఱుంగఁడు కాఁబోలును. కానిమ్ము, చివఱ కే మనియెను?

వజ్రి—ఎట్టకేలకు వచ్చెద ననియెను.

జలం—మంచిది. సేనలు, సేనాపతులు, కూడ కైలాసముకడకేగి యుందురు. నా యభీష్టమున కంతరాయము కల్పించు బృంద యంతరించి యుండును.

వజ్రి—సార్వభౌమా! ఇది యేమి? దేవి మరణించినదా? ఎవరు చెప్పిరి?

జలం—వజ్రికంఠా! దేవి మరణించలేదా?

వజ్రి—దేవా! క్షణము క్రింద మీా క్షేమ మరయవచ్చిన దేవి మరణించుట యెట్లు?

జలం—ఏమీా! బృంద యిప్పుడిచటకే వచ్చెనా?

వజ్రి—ఔను.

జలం—[కోపముతో] ఓసీ! దుశ్శీలా! నీ కొనరించిన మారణప్రయత్నము లన్నియు వ్యర్థములై నా కోరికలకు భంగ మొనరించుట కొఱకు మొండివై యింకను బ్రదికియుంటివా? ఏమి సేయవలయును?

చ. జలములఁ ద్రోసివచ్చినను ♦ జావక వచ్చితి, కొండనుండి భూ
స్థలిఁ బడవైచినన్ మృతికి ♦ దప్పితి, వెప్పుడు పొంచియుండు వే
కలికిని ముట్టఁబోయినను ♦ గ్రిన్నన వచ్చి కరంబుపట్టు దే
వలనను వీఁడవైతి, కర♦వాలమె నిన్ దునుమాఁడు నేఁడిఁకన్.

వజ్రికంఠా! తెమ్ము. కరవాలము తెమ్ము. ఆ పాపిష్ఠను నఱికి వచ్చెద. [అని సంరంభించును.]

వజ్రి—[భయసంశయములతో] దేవా! ఎందుల కింత సాహసము? బృందాదేవి మీాకడ్డుపడు నని తోఁచిన నామెను చెఱలో నుంప నాజ్ఞయిందు. తరుణులఁ జంపుట తగవుకాదు.

జలం——అట్లైన నీవిపుడే పోయి ఆ బృందను బందివెట్టించి రమ్ము ?

వజ్ర——చిత్తము [నిష్క్రమించును.]

జలం——ఇంక బృంద చెఱసాలనుండి రానేరదు ? నా కడ్డుపడ నేరదు ? ఇంక నన్నెవ్వరు నాపనేరరు. నా శక్తిసామర్థ్యముల నన్నింటినిం జూపి పరబలంబులు వెఱఁగుపడ స్వేచ్ఛాసంచార మొనర్చెద ? బలపరాక్రమంబులు మెఱయ రణరంగమున నెదురులేక వీర విహారంబు గావించెద. ప్రమథులు గిమథులునా నన్నడ్డగించు వారు?

చ. అదిమితినా! రసాతలము ♦ నంటఁగఁబోవు మహీతలంబు, నే
నెదిగితినా! దివంబు గన♦నేఁగు మహామహితాంబరంబు, నేఁ
జదిమితినా! సువర్ణగిరి ♦ జాఱును వ్రక్కలు వ్రక్కలౌచు నే
గదిమితినా! గదం గొని య♦కాండలయం బగు నొక్క వ్రేల్మిడిన్.

ఎవఁడురా అక్కడ ? [అని పిలుచును.]

సేవ—— దేవా! ఆజ్ఞకై వేచియున్నాను.

జలం—— ఓరీ! నీవుపోయి సకల శరశరాసనంబులతోఁ బరిఘపట్టసప్రాస కుంతతోమర భిండివాలాద్యఖిలాయుధంబులతో నా రథము నాయత్తపఱుపు మని సారథికిఁ జెప్పుము. నా కరవాలమును గదాదండము నిటకుఁ గొనిరమ్ము.

సేవ——చిత్తము? [నిష్క్రమించును]

జలం——ఓహో ? సకలాయుధోపేతుండనై సమస్తవీరవర పరివేష్టితుం డనై మాయాబలంబు మెఱయ యుద్ధరంగమున సంచరించు నా కొరు లడ్డుపడ నేర్తురా? నన్నితరులు తేఱిచూడఁ జాలుదురా? ఆహా? ఇప్పుడుగదా నాశక్తి సామర్థ్యములు చూపి సంతసింపఁ దగిన సమయము! ఇప్పుడొక్క కైలాసమునేకాదు? హరి హరాదులనే కాదు. సర్వలోకములను దాఱుమాఱు చేసెద. నా యభీష్టము నెఱవేర్చుకొనియెద?

సీ. దివియలార్చెడు భంగి దీప్తుల నార్చెద
　　　　గ్రహమండలంబులఁ గలియఁబట్టి
పానకంబులఁ ద్రావు పగిదిని ద్రావెద
　　　　సప్తపాథోనిధుల్ సరవిఁబట్టి
బంతివిసరుభాతి బలిమిమై విసరెదఁ
　　　　గైలాసగిరిఁ గేలఁ గదియఁబట్టి
అనఁటుల నఱకు నట్లవలీల నఱకెదఁ
　　　　బ్రమథవర్యుల నెల్ల వరుసఁబెట్టి
గీ. ఊఁకనూఁదిన పోలిక నూఁది సురల
　　నంది ముఖ్యుల నఱకాలి క్రింద రాచి
　　శూలి శూలంబుతోఁగూడఁ గూలఁదన్ని
　　ప్రమద మందుదు నింకఁ బార్వతి గ్రహించి.

సేవ—[ప్రవేశించి] దేవా! ఇదిగో గదాదండము. ఇదిగో కరవాలము. [అని సమర్పించును]

జలం—[కత్తిని గ్రహించి] ఓఖడ్గరాజమా! నీ కఱవు తీఱినది?

ఉ. భానుకరోగ్రదీధితుల భాసిలి, మృత్యుకఠోరజిహ్వానా!
　మానితవై, భుజంగవిభుమాడ్కి రహించెదు నీవు, పార్వతీ
　జానిముఖామర ప్రమథసంఘము రాసద శత్రుకోటి ప్రా
　ణానిలముల్ గ్రహించి ముదమందు మిదే తరుణంబు ఖడ్గమా!

[అని సాదరముగ ధరించి గదను జూచి] ఓగదాదండమా! నీకుఁ బండువు వచ్చినది. రమ్మి! నా కరతలము నలంకరింపుము. [అని పట్టుకొని] ఓరోరి ప్రమథులారా! నిలుఁడు నిలుఁడు. పాఱిపోకుఁడు!

శా. రండోయీ యిఁకరండు రండు ప్రమథుల్, రండెల్ల పీనుల్,గదా
　దండంబున్ గయిఁ బట్టితిన్, రిపుల దోర్దర్పంబు మాయంగ బ్ర
　హ్మాండంబంతయుఁ గావు పట్టుదును, హాహాకార మొప్పన్ శివున్
　గండల్ కండలు చెండి రక్తజలధుల్ గావింతు భూమండలిన్.

పార్వతీ! ఇంక నా యధీనవు కాక మానవు? [పై పద్యపాదము చదువుచు నుత్సాహముతో వెడలును]

[ఉద్యాన వనప్రాంతమున వజ్రకంఠుఁడు ప్రవేశించును]

వజ్ర—కాళ్ళకు వేయఁదలఁచిన బంధము కంఠమునకుఁ దగిలించు కొన్నట్లు, బృందాదేవినిఁ జంపునని సార్వభౌముని వారింపఁ బోయి యామెను జెఱయందుంచెడు బాధ్యత నాపైఁ బడవేసి కొంటిని. ఏమి సేయుదును? నాకుఁ బ్రభుఁడు, ఆమెకు విభుఁడు; మాయిద్దఱకు సార్వభౌముని యాజ్ఞ యనతిక్రమణీయమైనది. భర్తృసహాయార్థము యుద్ధసన్నద్ధురాలైనను మహాపతివ్రత యగుటచే బృందాదేవి కారాగారమునందే నిలిచినది. ఏమి కానున్నదో? యుద్ధసన్నద్ధుండనై నేనును నా ప్రభువునే యనుస రించెద.

[బృంద చెఱసాలలో నుండును]

బృంద—నాథా! నా కెట్టి సంకటము కలిగించితివి?

గీ. తను మనంబులు స్వాధీన ♦ మొనరఁ జేసి
విభున కాత్మార్పణము సేయ♦ వేగఁ జనెడు
సతిని నన్నిట్టు లీ చెఱ♦సాల నిడుటె
యంబుధిం జేరు నాపగ♦నాఁగు పగిది.

దైవమా! బ్రతికియుండియు నాథునకు సాయపడఁజాలని దానను జేసితివే! ఏమి సేయుదును? ఈ కారాగారము నుండి యెట్లు విముక్తురాల నగుదును. [నిట్టూర్చి] ఎవఁడురా అక్కడ.

భటుఁడు—తల్లీ! ఏమి సెలవు?

బృంద—సార్వభౌములు సంగ్రామమునకుఁ బోయిరా?

భటు—ఒక సార్వభౌములేమి? మంత్రులేమి, సామంతులేమి? కాసెగట్ట నేర్చిన కడవీరుండును వీరాధివీరుఁడై యుద్ధరంగమున కుఱికి నాఁడు. మీ రక్షణ కొఱ కున్న మేము తప్ప మందునకైన మగవాఁడు పట్టణమునఁ గనబడుట కష్టము.

బృంద—అటులనా? సరియే.

భటు—[ఆవల కేఁగును]

బృంద—ఔరా! లోకకంటకు లగు మంత్రులఁ బాఱఁదోలి లోక

హితము గావింప నెంచుచుండ నాథుని రక్షించుకొనుటయే దుర్భర మగుచుండెనే! ఇంకెట్లు నా మనస్సునకు శాంతికలుగ గలదు? అయ్యో! హరుఁడే! సకల జగత్సంహారుఁడే! అట్టి వానితోఁ బోరాటమా? సురలు తోడ్పడ దిక్పాలురు ప్రోవు సూపఁ జక్రిధరుఁడు సాయముసేయ, మునులు సైతము తమ జప తపోబలంబుల నిచ్చుచుండ, దుర్నిరీక్ష్యుఁడగు నా ఫాలాక్షున కడ్డు నిలుచువారుందురా? ఆకాలకాలుని మ్రోల కేగువారుందురా? ఈ ఘోరసంగ్రామమున సకల దానవవినాశము కాకమానదు. మంత్రిసామంతులు మడియక మానరు? ప్రజానాశనము కలుగక తప్పదు ఆపార్వతీనాథుఁడు నా హృదయనాథునిపైకి రాకమానఁడు. ఆర్యపుత్త్రున కయ్యది యపాయకరము కాకతీరదు. అయ్యో! నా నాథునకుఁ దోడ్పడక యిందుఁ గుందవలసివచ్చెనే? పతియాన దాటరాదని యిందుఁ బ్రవేశించితినిగాని, ప్రాణాపాయ సమయమున భర్తృసన్నిధి నుండనేమో యని విచారింపలేకపోతినే! అక్కటా? వజ్రదుర్భేద్య మగు నీ చెఱసాలనుండి నేను పోవు టెట్లు? నా హృదయేశ్వరుని రక్షించుకొనుట యెట్లు? [చూచి] కారాగారమా! పతికడకుఁ బోవ నన్ను గ్రహించి పంపివేయుము. [దెసలుచూచి] ఆహా! ఇది నాకు దారినీయదు. కానిమ్ము. నా పతి సేవావిధి నన్నురక్షింపఁ జాలదా? ఇంతయేల! పతికడకేఁగ ననుగ్రహించిన నా విష్ణు కృపయే నన్నుద్ధరింపఁగలదు. జగన్నాథా! విష్ణుదేవా! నీ దయకు మేరలేదు. నీకుఁ జేయరానిది లేదు? నీ యనుగ్రహమునకు మించినది లేదు? రక్షింపుము. నీ భక్తురాలిని బృందను రక్షింపు మిదే తరుణము.

గీ. ఆశ్రమము చేర్చి రజతాద్రి ♦ కనిపినావు
విభుని రక్షణ కనువు గా♦వించినావు
జీవములు వీఁడు తఱిఁ దఱిఁ ♦ జేర్చినావు
ప్రేమ దళుకొత్తఁ జెఱ విడి♦పింపు దేవ!

[అని నమస్కరించును. చెఱసాల తలుపులు తెఱవఁబడును.]

భటు—[ఉలికిపడి చూచి] ఏమి ? ఈ తల్లి సామర్థ్యము ! అమేయ ముగ నున్నదే ?

బృంద—[కనులు తెఱచి] ఆహా ! ఏమిది. ఈ చెఱసాల ద్వారములు తెఱువఁబడినవి. ఇది పరమేశ్వరుని యనుగ్రహము. ఇంక నేఁ దడయరాదు [వెలుపలికి వచ్చును.]

భటు—తల్లీ ! ని న్నెచెఱ బంధింపఁగలదు? ఏ భటు లడ్డగింపఁగలరు?

బృంద—సేవకా! నీవు పోయి యుద్ధ పరికరములతో నా రథ మాయత్త పఱుపుమని సారథితోఁ జెప్పుము. శర శరాసనంబులు గొని రమ్మంటి నని మా నెచ్చెలికి సరళకుఁ జెప్పుము.

భటు—చిత్తము. [నమస్కరించి, నిష్క్రమించును]

బృంద—ఇపుడు నాకు ధైర్యము కలిగినది. ఇంక నే రణరంగమున కుఱికి నా పతికి బాసట యయ్యెద. హృదయేశ్వరున కొక్క ములికి యైనఁ దగులకుండ, ఏ యపాయము కలుగకుండ, సంగరక్షకురాలనై సంగర రంగమున సంచరించెద. ఇంక నెవ్వ రడ్డగించెదరో, నా ప్రాణేశ్వరు నెవ్వ రలయించెదరో, విచారించెద. సరళా ! సరళా ! ఏవీ ధనుర్బాణములు?

సరళ—దేవీ ! తెచ్చితిని [అని యిచ్చును.]

బృంద—[గ్రహించి] నీవు పోయి, నాయుద్ధపరికరముల నేమియు మఱువకుండ రథముపైఁ బెట్టింపుము. పొమ్ము.

సరళ—చిత్తము.

బృంద—ఆహా ? ఏమి నా యదృష్టము ? శరశరాసనములతోఁ దోడ్పడి నా నాథుని సేవించుభాగ్యము కలిగినది. నేను ధన్యను. నాకు సాధ్యముకానిది లేదు.

ఉ. శక్తిధరుండు శక్తిఁ గొని ♦ శౌర్యము మించి చరించుఁ గాక, యా
శక్తి కరాళకాళి రిపు ♦ సైన్యముఁ జండతఁ జెండుఁ గాక, దో
శ్శక్తు లెసంగ శూలియును ♦ శైవగణంబులు నిల్చుఁ గాక ని
ర్ముక్త శరప్రకాండముల ♦ ముంచనె? నొంచనె? వైరివీరులన్.

దేవా! విష్ణుదేవా! పడతులకు భర్తృరక్షణమే పరమధర్మ మని

యెంచి పరమేశ్వరునితో సైతము పోరనెంచిన నా యీ సాహసమును మన్నించి యాపత్కాలంబున నాకభయదానం బొసంగ నిన్ను వేఁడు కొనుచున్నాను. నిన్నే నమ్మితి, నీవే నాకు శరణ్యము, తప్పక దర్శన మిచ్చి నన్ను ధన్యురాలను జేయుము.

మ. ప్రమథానీకము నోర్చి శూలధరు ♦ నా ఫాలాక్షు నిర్జింపఁగాఁ
బ్రమదం బొప్పఁగఁ బోయెఁ బ్రాణపతి యొ♦బ్బంగిన్ జయం బందునో
సమరక్ష్మాతలి నిల్చి మన్విభునకున్ ♦ సాయం బొనర్పంగ నే
ర్పమరం జేయుము మున్నుసిల్చి విజయం ♦ బందింపు శ్రీవల్లభా!

[అని నమస్కరించును]

విష్ణు—[ప్రవేశించి] ఏమి యీ భక్తి పారవశ్యము? ధనుర్బాణములు కూడ ధరించినది. ఇట్టి మహాసాధ్వి రణరంగమునఁ బతికిఁ దోఁడుగ నడిచిన నెవ్వ రాపఁ గలరు? కానిమ్ము. కొంచెము పరీక్షించి ప్రయత్న భంగము కాకుండ సంచరించెద? [సమీపించి] బృందా దేవీ! [అని పిలుచును]

బృంద—[కనులు తెఱచి] వచ్చితివా? తండ్రీ! ఇదే నమస్కరించు చున్నాను.

విష్ణు—అభీష్టావా ప్తిరస్తు. బృందా దేవీ! ఏల పిలచితివి?

బృంద—కన్నులారఁ గాంచుటకుఁ జేతులారఁ బూజించుటకు. అనుగ్రహబలము వడసి యాత్మేశ్వరునకుఁ దోఁడుపడుటకు.

విష్ణు—బృందా దేవీ! నీవుకూడ గౌరీశ్వరునిపైఁ గాలు దువ్వుచుంటివా?

బృంద—గౌరీశ్వరునిపైఁ గాలుదువ్వుటగాదు. ప్రాణేశ్వరునకు బాసట కాఁదలంచు చుంటిని.

విష్ణు—జలంధర సంబంధుల మని విఱ్ఱవీఁగుచు దానవు లెట్లు ధర్మ విధ్వంస మొనర్చియుండిరో, యీ దురాత్ముల మూలమున లోకము లెంత తల్లడిల్లుచుండెనో నీకుఁ దెలియని విషయము కాదు. నీ పతి యొనర్చు దుష్కార్యకరణము, లోకద్రోహము, పరసతీ వంచనము, మాతృభావమును గూడ మఱచి శంకరార

ధ

శరీరిణిపైఁ జూపెడు దుర్వ్యామోహము నీ వెఱుంగనివి కావు. ఎఱిఁగి యెఱిఁగి యట్టి యసత్కర్మనకు సాయపడి మేల ధర్మహాని యొనరింతువు?

బృంద—దేవా! స్త్రీలకు సర్వధర్మమూలము భర్తృసేవ. అట్టి సేవ కాలంబన మగు పతి కనపాయస్థితి ననుసంధించి, యవ్విభుని యధర్మాచరణమును పీలగునంతవఱకడ్డుపఱుపనగును గాని, పతి యుపాధికే భంగము వాటిల్లఁబోవు సమయమునఁ బతిధర్మము దక్క యన్యధర్మములు గోచరించు టెట్లు? ఇంతయేల? అర్ధశరీర మాహవభూమిలో నుండియుండ మిగిలిన యర్ధాంగ మింట నుండ నేరదు.

విష్ణు—చికిత్సకుఁడు దుష్టాంగమును ఖండించి శేషాంగమును రక్షించుట ధర్మము కాదా!

బృంద—శేషాంగము సఫలమగుం గావున వాని కయ్యది తగినదియే?

విష్ణు—ఇది మాత్ర మేల సఫలము కాదు?

బృంద—[వెఱఁగుతో] అది యెట్లు?

విష్ణు—పరమపవిత్రమై మహాసమర్థమైన నీ యీ శరీరము దానవలోకమున నేగాక లోకత్రయమునను ధర్మసస్యసమృద్ధి నొనరించి సఫలమగుఁగాక.

బృంద—ఆర్యా! దేవునిఁ ద్యజించు భక్తుఁడు, గురువును వీడుఁ శిష్యుఁడు, పతిని వదలు సతియు వ్యర్థజీవితులై అధోగతినందుచుండ, అట్టివారు లోకోద్ధరణ మొనరించి సాఫల్యమునందుటయా? ఇంతియేఁ గాక భర్తృసేవయే పడఁతికిఁ బరమధర్మమని యెఱింగిన నేను, ధర్మరక్షణమే సర్వోన్నత్యసాధన మని, నిరుపమాన నిత్యనిరతిశయాత్మానందసంధాయకమని యెఱిఁగిన నేను, ప్రాణపతి నెడము చేసికొని లోకపాలనము చేయఁబూనుట చేఁజేత మణిమాల వదలి గురిజపేరుల ధరింప నపేక్షించు విధము కాకుండునా?

విష్ణు—కాదు, బృందా! జలంధరుఁడు—[అనఁబోవుచుండ.]

బృంద—దేవా! ఇం కేమియు ననవలదు. ఎట్టివాఁడేనిఁ గానిండు. నా హృదయేశ్వరుఁడు నాకు సంసేవ్యుఁడు. పతిసేవకొఱకే భగవత్సేవ కూడఁ జేయుచుంటిని. తత్పరిపోషకము కాదేని దానిని గూడ ధర్మమని తలంపఁజాలను.

విష్ణు—[ఆశ్చర్యముతోఁ జూచి] బృందాదేవీ! నీ నాథుఁడు మహామూర్ఖుఁడు. వినకయే చెడుచున్నాఁడు. ప్రాజ్ఞురాలవు, నీకు మౌర్ఖ్యము తగదు. నా మాట విని యుద్ధవిముఖురాలవు కమ్మి.

బృంద—దేవా! నన్నుఁ బరీక్షించు చుంటిరి. కాకున్న ధర్మసూత్రముల లోకము నడిపించు జగన్నాథుఁడవైన నీవు పతిదేవతనని యెఱింగి, ప్రాజ్ఞురాల వని యుగ్గడించి యిట్టు లన నేరవు? తండ్రీ! దేవదేవా!

సీ. లోక పరిచారంబు ♦ లోపించు ననికాదె
విధి కొసంగితి వీవు ♦ వేదచయము
జగమొనర్చెడి దోష♦సమితిఁ గానఁగఁ గాదె
కాఁపు వెట్టితి శశి♦కమలహితులఁ
బాపాత్ములను బట్టి ♦ బాధించుటకుఁగాదె
యమరించితివి ఘోర♦యమపురంబు
ధర్మరక్షణ దీక్షఁ♦దాల్చియుండుటగాదె
వెలయఁజేసితి వాత్మ ♦ వివిధగతుల
గీ. దుష్టవాంఛలఁ భోఁద్రోలి ♦ దురిత మడఁచు
భవ్యతమ రూపమున నుండు ♦ ప్రభుఁడవీవు
నీవె యిట్టుఁ బల్క నేర్తువే? ♦ నిగమవేద్య!
కవచమే మేను మ్రింగినఁ ♦ గలదె దిక్కు?

దేవా! నే నబలను. మీ పరీక్ష కాగఁజాలను. యుద్ధభూమికరిగిన భర్తను విడిచి క్షణమైన నే నింక నిలువఁజాలను. అనుగ్రహంబల మొసంగి నన్నుఁ బంపివేయుఁడు. ఇయ్యది మీ కనంగీకార మందురా? నేనే నా సర్వశక్తులు వినియోగించి భర్తృసహాయమునకుఁ బొల్పడిరెదను. మీతి

మీఱిన నా హృదయేశ్వరుని ముందఱఁ బ్రాణముల వదలెదను. ఇదియే నా నమస్కారము. [అని నమస్కరించి వెడలఁ బోవును.]

విష్ణు—బృందాదేవీ! నీ మనోనిశ్చయ మసమానము. నీ పతిభక్తి యపారము. నీ ధర్మదీక్ష ధర్మాధర్మముల కతీత మగు బ్రహ్మానందపదవి నందింపఁ జేయు ననుటకు సందియములేదు. నీ వన్నిఁట ధన్యవైతివి. నీ కే కొఱంతయుఁ గల్గనేరదు. నిన్ను మెచ్చి నీ పతి యుద్ధవిముఖుఁడై పశ్చాత్తప్తుడై యిప్పుడే నిన్ననుగ్రహించున ట్లొనరించెద. యుద్ధప్రయత్నములు మాని యితరచింతలు వీఁడి లోని కరిగి పతి రాకను నిరీక్షించు చుండుము.

బృంద—మహాభాగ్యము. దేవదేవా! సర్వదా నన్ననుగ్రహింప నెంచిన మీ వాత్సల్య విశేషమున కెంతయు సంతసించు చున్నాను. ఇప్పుడే యంతిపురి కరిగి పతి రాకను నిరీక్షించు చుండెద. నా యీ మనఃపూర్వక మగు ప్రణామము నందికొన వేఁడుచున్నాను. [అని నమస్కరించును.]

విష్ణు—మంచిది పొమ్ము. ఇంక గృహమునకుఁ బొమ్ము. [అని నిష్క్రమించును.]

బృంద—ఆహా! ఏమి యీ విష్ణుదేవుని వాత్సల్యము! అపారమైనదే! సరళా! సరళా! [అని పిలుచుచు లోనికిఁ బోవును.]

ఇది అష్టమాంకము.






# నవమాంకము



[విష్ణువు ప్రవేశించును.]

విష్ణు—బృందను యుద్ధ విముఖురాలినిఁ జేయుట యెంతయుఁ గష్ట మయ్యెనే! ఇపు డేమి చేయవలె? పతిరూపమును జూడకున్న ఆమె యింట నిలువనేరదు. నన్ను శపింపక మానదు. ఒడలు తెలియని యుద్వేగమున సంగ్రామరంగమున సంచరించుపతి నెట్లు చూడఁగలదు? నా మాటలను విశ్వసించి యుద్ధవిముఖురాలై యంతిపురి కరిగిన బృందాదేవి కడ కెవరినైన జలంధర రూపమునఁ బంపుదునా? ఆ సాధ్విని సమీపింప నాకే జంకు కలుగుచుండ నితరు లెవ్వరు సాహసింపఁగలరు? ఆమె సాన్నిధ్యమున నెవ్వరు నిలువఁగలరు? మహా పతివ్రతయే? ఆమెను వంచించుట కామె భర్తరూపమున నేనే పోవుటయా? పతి, పతి యని కలవరించుచు మహోత్కంఠతో నున్న యామె విభుని సందర్శించితి నని యెంత వేడుకపడునో? ఎట్లు ప్రవర్తించునో? విలాసవతియై ఏకాంతమున భార్యవలె సంచరించు విరిబోఁడి కడ నిర్వికారముగ నుండుట చాలఁ గష్టము. కరస్పర్శన మంగీకరించుటయు మర్యాదాతిక్రమణము. అది మిగుల సాహసము. ఇట్టి పనిని నేనా చేయవలసినది? చేయకున్న మఱి కర్తవ్యము?

అక్కటా! ఈ విషయమెంతయు నన్ను సంకట పెట్టుచున్నదే! ఔరా! వశీకృత మాయుండనై సర్వశక్తిసంపన్నుండ నగు నాకా కార్యసంకటము? [యోజన నభినయించి] కలదుకదా! చతుర్దశ భువన సమ్మోహినియై బహురూపిణియగు వైష్ణవి. తన్మూలమునఁ గార్యము సాధించెద. [తెరవంకకుఁ దిరిగి] వైష్ణవీ! వైష్ణవీ!

వైష్ణవి—[తెరలోనుండి] దేవా! ఇదె నిత్యసన్నిహితనై యుంటిని. [అని ప్రవేశించి, నమస్కరించును]

విష్ణు—అప్రతిహతవిజయా భవ!

వైష్ణవి—ఏమి యాజ్ఞ?

విష్ణు—ఇప్పుడొక మహాకార్యము నాకు నిర్వాహణీయమై యున్నది.

వైష్ణవి—మీ యిచ్ఛామాత్రమున సకలకార్యనిర్వాహణమునెడ జాగరూకనై ఈ సేవకురాలుండ మీరై నిర్వర్తింపఁదగిన దేముండును? ఈశ్వరాజ్ఞయే యవశిష్టము. సర్వము చక్కఁబడును, సెలవిండు.

విష్ణు—దానవసార్వభౌముఁడగు జలంధరుని, దన్మూలమున నగు ధర్మహాని, లోకోపద్రవములను నీ వెఱుంగుదువు కదా?

వైష్ణ—ఎఱుంగ కేమి? అవి లోకరక్షణతత్పరు లగు దేవరకు దుస్సహము లనుట నిక్కువము.

విష్ణు—దుష్టశిక్షణ పూర్వకముగ శిష్టరక్షణ మొనరించి ధర్మసంస్థాపన మొనరించుట నా పూనినపనియైనను జలంధర సంహారవిషయమునఁ బరమ పతివ్రతా తిలక మగు నా బృందా దేవి యనన్య భక్తి నన్ను నిరోధించుచున్నది.

వైష్ణ—నిరోధించుఁగాక! అతఁ డొనరించు ఈశ్వరద్రోహమూలమునఁ బ్రకృతము సంఘటిల్లిన యుద్ధము వానినిఁ గడతేర్పఁజాలదా?

విష్ణు—అది యసమర్థము. పాతివ్రత్యమహిమోపేతయగు బృంద జలంధరునకుఁ దోడుగని వజ్రకవచము.

వైష్ణ—అయినఁ గర్తవ్యము?

విష్ణు—యుద్ధావసాన పర్యంతము మాయా జలంధరునిఁ గల్పించి, తత్సాన్నిధ్యమున బృందాదేవికి నైజభర్తృయోగక్షేమములు మఱుఁగుపడఁ జేయవలయును.

వైష్ణ—ఎట్లు ?

విష్ణు—నీ విపుడు జలంధరరూపమున బృంద కడకరిగి స్వీయకృత్యముల యెడఁ బశ్చాత్తాపము నటించుచు నాయమ భ్రాంతయై భర్తృ భావమున నిన్ను భజింపఁ బ్రొద్దుఁ బుచ్చవలయును. ఇంతలో నంతయుఁ జక్కఁబడఁగలదు?

వైష్ణ—[దైన్యముతో] దేవా! సర్వశక్తిసంపన్నులగు మీరే వెనుకంజ వేయుచుంటి రన, ఇక్కార్యమున నబల నగు నన్నా నియోగించెదరు? ఇది నా కపాయకర మని తలంతును.

విష్ణు—మత్ప్రభావమున సకల జగద్వ్యామోహిని వగు నీవా యబలవు? నిత్యసన్నిహితుఁడనై నేనుండ సంశయించెదవేల ? ఇంతయేల? నీ యపాయము నా యపాయము. విజయ మందుదువు గాక! పొమ్ము. అప్రమత్తవై సంచరింపుము.

వైష్ణ— దేవరయాజ్ఞకు బద్ధురాలను. [నిష్క్రమించును]

విష్ణు—ఇప్పటికిఁ గార్యసాధనమునకు మార్గము కలిగినది. సర్వము కృతప్రాయము. కాని సత్యహానికి, మోసమునకు, నాకేదో యొక ఆపద కలుగక మానదు. ఏమైనను లోకరక్షణము తప్పదు. [ముందుఁ జూచి] ఓహో! యుద్ధమెంత తీవ్రముగ జరుగుచున్నది? సముద్రములన్ని యొక్కమా ఉప్పొంగిన ట్లుభయ సేనలు పొరలి ప్రమథులని, దేవతలని, దానవు లని తెలియరాకున్న దే! [మఱియొక వంకకుఁజూచి యాశ్చర్యముతో] వీఁ డెవ్వఁడు? రక్తసిక్తగాత్రుఁడై, పాదచారియై, సంభ్రమించుచు నిటు వచ్చుచున్నాఁడు [పరికించి] దురాత్ముఁడు, వీఁడు మణిగ్రీవుఁడు. ఈ విప్లవమున కంతటికిఁ గారణభూతుఁడు. ప్రాణరక్షణకై వచ్చుచుండును. వీఁడు బ్రతుకగూడదు. వీనిని ఇట్టి దుష్టగణమును, బొలియించుటకు నాకు మాఱటగ నా చక్రా

ద్యాయుధముల నంపి ద్రోహులఁ జుదముట్టింపఁజేసెద. వైష్ణవి యెట్లు ప్రవర్తించునో విచారించెద. [నిష్క్రమించును]

మణి—[సంభ్రమించుచు నెత్తుటఁదడిసిన గుడ్డలతోఁ బాదచారియై ప్రవేశించును.] అబ్బ! ఇప్పటికి ప్రాణాలతో బ్రతికి బయట పడ్డా! తన మాట వినలేదని సార్వభౌమునిపై శుక్రాచార్యులకు వచ్చిన కోపం ఇంతవఱకు తీరక పోవటంచేత చచ్చినరాక్షసులు చచ్చినట్టే, గుట్టలు గుట్టలుగా పడిపోయినారు. రణరంగమంతయు పీనుగులపెంటయై నెత్తుటేర్లతో నిండిపోయినది. ఎన్ని యుద్ధాలో చూచాగాని యింత ఘోరయుద్ధం ఏ రాక్షసుల కాలంలో గూడా జరగలేదు. నా శక్తి సామర్థ్యాలన్నీ వుపయోగించి యెలాగో చావు తప్పించుకున్న నేను తప్ప ప్రపంచంలో రాక్షసాంకుర మంటూ ఇంక వుండబోదు. ఎవరికర్మం వారిది. నా కేలోటు లేకుండా నా ప్రాణాలుమాత్రం నేను దక్కించుకున్నా. [వినుట నభినయించి] ఏమి యీ కోలాహలము? భూమివణక, దిక్కులదర ఆకసము కూడ చిల్లివడునట్లున్న దే! [ముందుఁజూచి సంతసముతో] బలే బలే! శుక్రుడు అలుకవీడి తన మృతసంజీవనీ ప్రభావమున నిద్రనుండి లేపినట్టు పడిపోయిన దానవకోట్ల నెల్లర బ్రదికించుచున్నాడు. వారి సంరంభమే యీ కోలాహలము. సేనలు, సేనాపతులు ఉత్సాహమున పెచ్చుపెఱిగి ప్రమథులను దేవతలను దునుమాడుచున్నారు. ఇంక రాక్షసులకు నాశములేదు. మా విజయమున కంతరాయ ముండదు. ఈ సంతోష సమయమున నేనును ప్రభువును సమీపించి నా విజృంభణ మభినయించెద. [పోఁబోయి చూచి భయము నభినయించి] ఓరా! ఇదియేమి ఘోరాకారము? ఎంతయు భీతిని గలిగించుచున్న దే! ఈశ్వర జటాఘాతమున బుట్టిన యీ మహాశక్తి మిన్నొరయుచు శంకరుని రూపమున వెండికొండ నెక్కి జలంధరుని క్రిందికి నెట్టి మంత్రశక్తి జూపు శుక్రాచార్యుని కంఠము పాదముల నదిమి

పెట్టి యెందో గొనిపోవుచున్నది. ఇంక వానిని మటుమాయము చేయక మానదు. అప్పుడే దివ్యగణములు సెలరేగినవి. ప్రమథులెల్ల బాహువు లప్పళించుచు విజృంభించుచున్నారు. బృహస్పతి బహురూపుల సంచరించు జలంధరుని మాయాబల మంతయు పటాపంచలు సేయుచున్నాడు. ఈశ్వరుడు త్రిశూలధారియై సంరంభమున సేనలపై కుఱుకుచున్నాడు. ఇంక నేనందు బోజాలను. ప్రాణములను వదల జాలను. ఇంక నాకు వనములు గుహాలే శరణ్యము. [అని పోబోయి వెనుకకుఁ జూచి భయముతో] ఔరా! ఇది యేమి? ప్రమథగణములు నలుదిక్కుల చుట్టినవే! ప్రళయకాల మేఘములవలె పరాగ పటలములు దెసలావరించి కన్నులు మూయుచున్న వే! ఇంకెందు బోదును? ఎందు జొత్తును. అయ్యో! ఆ శూలాయుధులు, ఆ ముసలాయుధులు, ఆ శరచాపధరులు చుట్టుముట్టు చున్నారే? ఏమి సేయుదును? [మఱియొక వంకకుఁ జూచి] ఇవి యేమి! ఇవి యా శ్రీహరి దివ్యాయుధములు. అవి యన్నియు దానవ సేనల నన్నిటిని తుత్తుముఱు చేయుచు నిటే వచ్చుచున్నవి. అవి నన్ను బ్రతుకనీయవు. బృంద కొనరించిన కీడు, పతివ్రతలబట్టిన పాపము, ప్రభువును వంచించిన మోసము, లోకమునకు గలిగించిన హాని నాకనులకు కనబడుచు ప్రతిఫల మనుభవింప జేయుచున్నవి. నన్ను గట్టి కదల నీకున్నవి. అదిగో! శార్ఙ్గము అదిగో! ఖడ్గము. అదిగో! గద. నలుదెసల దిరుగుచు నన్ను మ్రింగజూచుచున్నవి. ఏమిచేయుదును! [మఱియొక వంకకుఁదిరిగి] అయ్యో! ఈ చక్రరాజ మగ్నివర్షము కురియుచు పెనుమంట లెగయ నాపైకి వచ్చుచున్నది. ఓ చక్రరాజమా! నీకు మ్రొక్కెద. నాపైకి రాకుము. నన్ను ముట్టకుము. నన్ను చూడకుము. అయ్యో! సమీపించుచున్న దే? బృందాదేవీ! నా యపరాధములు మన్నింపుము. నన్ను క్షమింపుము. హా! దుర్భరము! దుర్భరము! హా! హాతోఽస్మి హాతోఽస్మి. [అని చక్రాహతిచే గూలి మరణించును.]

[బృందాదేవి శయనమందిరము]

బృంద—[అలంకరించుకొనుచు] సరళా! నా యీ యలంకారము సమంజసముగ నున్నదా ?

సరళ—[నవ్వుచు] చూడఁ గన్నులు జాలకున్నవి.

బృంద—చాలు నీ పరిహాసము. [అని బుగ్గ నులిమి మఱల సవరించుకొని, అద్దము చూచుకొని,] కుదిరినది. [అని తృప్తి నభినయించి] నెచ్చెలులారా! మార్గమునఁ బన్నీరు జల్లితిరా? అత్తరువులు పోసితిరా? మణితోరణములు కట్టితిరా? ధూపద్రవ్యము లుంచితిరా?

సరళ—అమ్మా! అన్నియుఁ జేసితిమి.

బృంద—అటులైన గంధమాల్యాదుల నిం దుంచుడు.

సరళ—చిత్తము. [అని గంధము, పుష్పమాలలు, పువ్వులు, అత్తరువులు, ధూపద్రవ్యములు, ఫలములు మొదలయిన వుంచుదురు.]

బృంద—[శయ్యా, పీఠము తుడిచి, పువ్వులు చల్లి, అత్తరు, పన్నీరు చల్లి, తనపైఁ జల్లుకొని, చెలులపైఁజల్లి, దారిచూచి] ఇంకను నాథుఁడు రాకున్నవాఁడే? నెచ్చెలులారా! మీరు పోయి మార్గమువంకఁ జూడుఁడు.

చెలులు—చిత్తము. [నిష్క్రమింతురు.]

బృంద—ఆహా నేఁడెంత సుదినము.

ఉ. వచ్చెదవే? మనోహర! శుభంకర! యో జగదీశ! నేఁటికిన్
వచ్చునె నీ కృపారసము! ♦ వాంఛ జనించెనె నన్నుఁ బ్రోవ నా
ముచ్చటదీర గేహమునఁ ♦ బూజ్యపదం బిడి విశ్రమించి, నే
నిచ్చు సపర్యలంది కృప ♦ నేలెదవే! తపముల్ ఫలించెనే!

[మఱల దారిఁ జూచి] ఇంకను నాథుఁడు రాకుండెనే? ఏమి చెప్పుమా! [నిట్టూర్చి, యోజించి] ఆ భగవానుని మాటగూడ అసత్యముగువా? [నిట్టూర్చి] భగవానుఁడు భక్తుల హృదయమును మార్చును గాని ప్రబల విరోధియగు నా నాథుని మనస్సును మార్చునా?

నాకడకుఁ బంపనేర్చునా ? ఆ విష్ణువు మాటలునమ్మి మోసపోయితిని. ఏమిసేయుదును? జీవితేశ్వరా ! నే నీ జన్మమున నిన్నుఁ జూడనేరనా? నిన్ను సేవింపనేరనా? అయ్యో ! ఎంత యదృష్టహీనురాలను. [అని విచారముతో స్మరణ మభినయించి] ఆహా! ఇది యేమి యిట్లు తలంచుచుంటిని. సర్వాంతర్యామి యగు నాజగన్నాథుని మాట వ్యర్థమగునా? కల్ల. కల్ల. ఆ విష్ణుదేవుని కసాధ్య ముండనేరదు.

గీ॥ మూఁగనైనను బ్రౌఢవా♦జ్ముఖరుఁ జేయుఁ
గుంటి నెక్కించు నెగయించి ♦ కుధరశిఖరి
నెవని సత్కృప, యా రమా♦ధవుని మాట
తిరుగనేర్చునె గ్రహగతుల్ ♦ తిరిగి చనిన.

[చూచి, సంతోష సంభ్రమములతో]అదుగో!వచ్చుచున్నాఁడు. వచ్చుచున్నాఁడు. ఆహా! ఏమి నాభాగ్యము? భగవానుఁడా ! ఏమి నీ యనుగ్రహము? [సంతసముతో] సరళా! సరళా! [అని పిలిచి, కౌఁగిలించుకొని] ఎంతపుణ్యమే. ఎట్టి సుకృతమే! ఏమిసుదినమే! [అనుచుఁ బుష్పమాలఁ దీసికొని యెదురుగాఁ జని, మాయాజలంధరునిఁ బుష్పమాలాలంకృతునిఁ జేసి తీసికొనివచ్చును.]

మాయాజలం—[సంశయముతోఁ జూచుచు నిట్టూర్చును.]

బృంద—నాథా! ఏమి నా భాగ్యము? ఏమి నా యదృష్టము? రండు.

[అని చేతులు పట్టుకొని]

ఉ. చేసిన సద్వ్రతమ్ములును ♦ జేసిన దానము లెల్లఁబండి వి
చ్చేసితి వీవు, నాథ! దయ♦ సేయుము, పీఠ మలంకరింపు, నా
చేసిన నేరముల్ మఱచి ♦ చేయు సపర్యల నందికొమ్మఁ కే
లా సతి కన్యముల్, పతికి ♦ నర్చయొనర్చుటె? స్వర్గమోక్షముల్.

ఈ మణిపీఠము నలంకరింపుఁడు. [అని కూర్చుండఁబెట్టి యుపచారము చేయుచు] హృదయేశ్వరా! ఎన్నిదినముల కిట్టి భాగ్యము కలిగినది.

గీ. మండువేసవి సుడివడి ♦ మాఁడుచున్న
పంటచేనికి వర్షంబు ♦ పడినభంగిఁ

ద్వద్విరోగాగ్నికీల సంతప్తనైన
నన్నుఁ గరుణించితివి భాగ్య మెన్నవశమె?

నాథా! మీదర్శనస్పర్శన భాగ్యములచేఁ గడువివశనై యెక్కడ నుంటినో, యేమిచేయుచుంటినో, తెలియఁ జాలకుంటిని. అట్టి నా యపరాధములు మన్నించి న న్నేలుకొనవలె. ఏదీ నీ మందహాస సుందర వదనారవిందము. [అని ముఖ మెత్తును.]

మాయాజలం—బృందా! నన్ను క్షమించితివి. కాని నేను వంచకుఁడను. నిన్నుఁజూఁడదగదు, ముట్టఁదగదు[అని పెడ మొగము పెట్టుకొనును.]

బృంద—ఆర్యపుత్రి! వలదు. అటులనవలదు. నీవే నాహృదయవల్లభుఁడవు, నీవే నాభాగ్యనిధివి, నీవే నా యానందరాశివి, నీవే నాజీవిత సర్వస్వము. దయామయత నేలుకొని నన్ను ధన్యను జేయవలయును. [అని అనునయించును]

జలం—బృందా! నాచిత్తమునకు శాంతిలేదు. ఇం దొకింత విశ్రాంతినిఁ బడయనిమ్ము. [అని సంశయమునఁ దలవంచుకొనును]

బృంద—మహాప్రసాదము. అటులైన నీ పర్యంకము నధిష్ఠింపుఁడు. ఏల పరాఙ్ముఖు లయ్యెదరు? సంశయింపకుఁడు. దయచేయుఁడు. [అని శయనముపైఁ గూర్చుండఁబెట్టి] ఆర్యపుత్రా!

గీ. ఎంత శ్రమనంది వచ్చితో ♦ హృదయనాథ!
కలపము లలంది వీతునా? ♦ లలితమృదుల
పదము లొత్తుదునా? భవత్ప్రణయ మహిత
బృంద సేయు సపర్యల ♦ నందికొనవె.

[అని పాదములు పట్టుకొనును.]

మాయా—[నిట్టూర్చి యోజన నభినయించి, యనునయించుచు]వలదు వలదు. ఇపుడేమియు వలదు. [అని చేతులు పట్టుకొని] దేవీ! నీయెడఁ జేసిన యపరాధమునకు నామనస్సు కలఁతవడుచున్నది. ఇంచుక విశ్రాంతిఁ దీసికొనియెద.

మ. తరుణిన్ నిన్నబలామణిన్ బతిపద ♦ ద్వంద్వప్రియన్ వంచనా
పరతన్ నే నలయించి నందులకు మ♦ద్భావం బిటుల్ వేఁగు, నే
కరణిన్ జిత్త మెలర్పఁబోదు విలస♦త్కంఠధ్వనిన్ నీమనో
హరగానామృతవార్ధి దేల్పుమిఁక బృం♦దా! డెంద మింపొందఁగన్.

చిత్తవిశ్రాంతికి సంగీతము సిద్ధౌషధము. కానిమ్ము.

బృంద—హృదయేశ్వరా! ఏవిధముననైన మిమ్మారాధించి తృప్తి నొందుటయేకదా నా జీవితపరమార్థము. అట్లే గావించెద. [పాడును]

మాయా—బృందా! ఏమి నీ గాన మాధుర్యము. అసమానముగ నున్నదే!

గీ. పుక్కిట న్నించెనో? కండ♦చక్కెరలను
మేళవించెనొ? గళమున ♦ మేలిమధువు
అమృతమునఁ జేసెనో! స్వరం ♦ బజ్జభవుఁడు
స్వాంత మలరించెఁ ద్వద్గాన♦సరణి రమణి!

బృందా—నాథా! ఎంత కాలమునకు మీపొందగ్తను గను భాగ్యమందఁ గఁటిని. పాదసేవఁజేసి కృతకృత్య నయ్యెద. [అనిపాదములు పట్టఁ బోవును.]

మాయా—[ప్రైకిఁజూచి సాభిప్రాయముగఁ దలపంకించును.]

[జలంధరుని శీర్షము రక్తసిక్తమై క్రిందఁబడును.]

బృంద—[చప్పుడు వినుట నభినయించి పడిన తలను జూచి] ఇదియేమి? [అనియాశ్చర్యముతో సమీపించి చూచి నిర్విణ్ణయై భయమున] శిరము, శిరము, నాథుని శిరము. [అని భయ కంపములతో శిరమును గ్రహించి, మాయాజలంధరునిఁ జూచి నిశ్చేష్ట యగును. శిరము క్రిందఁ బడును]

బృంద—[భయ కంపములతో మాయాజలంధరుని, శిరమును జూచి] నాథా! ఇది యేమి? [అనుచు నిశ్చేష్టయై మాయా జలంధరునిఁ జూచును]

మాయా—[నిర్విణ్ణుఁడగును.]

బృంద—[సంభ్రమాశ్చర్యములతో] నాథా! విరోధు లొనరించిన ద్రోహము, పరిపంథు లొనరించిన మోసము. కనులారఁ జూచియు నూరకుంటి రేల? లెండు. [అని చెయిఁ బట్టుకొనును]

మాయా—[నిర్విణ్ణుఁడై] బృందా [అని విరమించును.]

బృంద—[సంశయముతో] {స్వ} ఏమి ఈ నిశ్చలత్వము? ఏమి యీ నిర్విణ్ణత? [ప్రకా] సార్వభౌమా! అభిమానధనుఁడవే! వీరాధివీరుఁడవే? శత్రుకృతపరాభవమును గనులారఁ జూచియు నూరకొందు వేల?

మాయా—[నిట్టూర్చి శిరఃకంపము చేయుచు] ఊరకుండక చేయున దేమి?

బృంద—[తమకముతో] ఏమిది! బడబానలము చల్లఁబాఱెనా? ప్రళయ ప్రకంపనుఁడు స్తంభించిపోయెనా? ఈ ద్రోహకారకుల నిర్మూలింపవలదా?

మాయా—ఎవరి ద్రోహము వారి నున్మూలింపక మానదు?

బృంద—[సంశయముతో] ఎక్కడి దీ శాంతి. ఎక్కడి దీ నిర్వేదము? అక్కటా! నేనెవ్వరి యెడలను ఏ ద్రోహము చేసి యెఱుఁగనే! నాయెడ నింతటి వంచనమేల? నా కీ ఘోర పరాభవ మేల?

మాయా—లోకవంచనమునకు, ఈశ్వర ద్రోహమునకు, ఇయ్యది ప్రతి ఫలము.

బృంద—[రిచ్చవడి] ఔరా! ఇదియంతయు మోసము. [తీవ్రముగఁ జూచి] నీవు నా నాథుఁడవు కావు. పయోముఖవిషకుంభమవు. చెప్పుము. నిజము చెప్పుము.

మాయా—[మంచము దిగి] నిక్కముగ నీ నాథుఁడను గాను.

బృంద—[మాయాజలంధరుని తీవ్రముగాఁజూచి, దుఃఖముతో శిరము వంచి(జూచి] హా నాథా! నాథా! [అని భర్తశిరముపైఁబడును.]

మాయా—[స్వ]. దుర్భరము! దుర్భరము, మహాపతివ్రత! ఏమి కానున్నదో!

బృంద—[దుఃఖముతో] హృదయేశ్వరా! నిరంతరము నిన్ను నమ్మి నీ యభివృద్ధినిఁగోరి, నీయనుగ్రహము కొఱకు నీ విగ్రహమునే నిన్నుఁగ భావించి పూజించెడి యీ బృందకుఁ జివఱకీ విధముననా నీ దర్శనము. [కరుణ క్రోధములతో ముఖమునఁ బడిన వెండ్రుకలు తీయుచు నిట్టూర్పుచు] ఓరీ మాయావీ! దుశ్శీలుఁడా! ఎవఁడవురా? నీవు చెప్పుము. నిజము చెప్పుము. చెప్పకుంటివా! [అని అర్ధోక్తిలో నాఁగును.]

మాయా—[భయకంపములతో నిజరూపమునఁ బొడకట్టి] తల్లీ! క్షమింపుము. నేను వైష్ణవమాయను.

బృంద—ఏమీ వైష్ణవమాయ నని నన్ను మోసగింతువా? కాదు. నీవు నన్ను వంచింప వచ్చిన పెనుభూతమవు. చెప్పుము, నిజము చెప్పుము. చెప్పకున్న నిన్నిప్పుడే శాపదగ్ధను గావించెద [అని తీవ్రముగఁ జూచి శాపజలమును గ్రహింపఁ బోవును.]

వైష్ణవి—హా! దేవదేవా! విష్ణుదేవా! అభయము! అభయము! [అని భయ సంభ్రమములు చూపును.]

విష్ణువు—[ప్రత్యక్షమగును.]

వైష్ణవి—[నిట్టూర్చి భీతభీతయై వెడలును.]

బృంద—[చూచి నిశ్చేష్టయై] ఆహా! నా తండ్రి విష్ణుమూర్తియా!

విష్ణు—[తల వంకించును]

బృంద—[కోపమడంచుకొని] దేవా! ఎవ్వరి కెట్టి యపకృతి గావించి యెఱుఁగని నా హృదయమునఁ జిచ్చువెట్టిన వారెవ్వరా ద్రోహులు? ఎవ్వరా వంచకులు? ఎవ్వరా పాపులు?

విష్ణు—బృందా! నేనే!

బృంద—[ఉలికిపడి చూచి భయకంపములతో] అయ్యో! భక్తపాలన పరతంత్రుఁడవే? దీనజనపోషకుఁడవే? ఆశ్రితావన దీక్షితుఁడవే! లోకరక్షకుఁడవే! ధర్మోద్ధరణ భారధూర్వహుఁడవే! అట్టి నీవా నన్ను వంచించినది. నీవా, నాకీ దుఃఖమును గలిగించినది! నీవా, నన్ను వ్యర్థురాలను జేసినది? నీవా, ధర్మభంగము గావించినది.

విష్ణు — అవును.

బృంద—అయిన నీవు నా విష్ణుదేవుఁడవు కావు. నన్నుఁ బరిభవింప వచ్చిన పరమకిరాతుఁడవు. పరమద్రోహివి. దురాత్మా ! చెప్పుము. నిజము చెప్పుము. [తీవ్రముగాఁ జూచును.]

విష్ణు—బృందా ! లోకరక్షణార్థము, ధర్మస్థాపనార్థము చేసిన కృత్యమిది. నేనే విష్ణువును.

బృంద—[కరుణాక్రోధములతోఁ బెడమొగమై] ఆహా! నా లోకము, నా జీవము, నా ప్రాణము, నా ధర్మము, నా పెన్నిధానము, నా యానందము, నా దైవము, నా సర్వస్వము, నానాథుఁడే! అట్టి నానాథుని సంహరించుట లోకరక్షణమా ? పతివ్రతనైన నన్ను వంచించి పరాభవించుట ధర్మరక్షణమా! అయ్యో ! నా బాలభాస్కరుఁ డస్తమించెనా! నా కనులు చీఁకట్లు గ్రమ్ముచున్నవి. అయ్యో ! నా యేలిక కూలిపోయెనా? నా హృదయము చీలికలగుచున్నది. అయ్యో! నా యొడయఁడు మడసిపోయెనా! నా యొడలు మండుచున్నది. అయ్యో ! యీ తాపము భరియింపఁజాల. ఈ యవమానము నే నోర్వఁజాల. అయ్యో, అయ్యో, నా ప్రాణేశ్వరుని నిలువున నీఱుచేసిరే! నే నేమిసేయుదును? నా లోకము లేని నాకీ లోకము లేల ? నా ధర్మము లేని నాకీ ధర్మములేల ! నా దైవములేని నాకీ దైవములేల ? వనితావంచకుఁడవై పాషాణసదృశుఁడవై, యింతటి ఘోరకార్య మొనరించిన నీవు విష్ణువవుకాదు, విష్ణు ప్రపితామహుఁడవు కాదు, మఱి యెవ్వఁడవైనను బాషాణమవు కమ్ము. కమ్ము, శిలవు కమ్ము. [అని క్రోధముతోఁ జూచి నిట్టూర్చి, కనులు మూసి మూర్ఛిల్లును.]

విష్ణు—నేను విష్ణువునైనను నా చేయు కృత్యము లోకరక్షణార్థమైనను అసత్యమునకు, వంచనకు, ఫల మనుభవింపవలె. బృందాదేవి శాపమునకుఁ బాత్రమగుచున్నాను. గండకీ నదీ ప్లావితమగు నీ ప్రాంతము మహాక్షేత్రమగుఁగాక. ఇచ్చటి పాషాణము లన్నింటికిఁ బూజార్హత కలుగుఁగాక. [శిలయగును.]

బృంద — హా నాథా! నాథా [అని లేచి] నాథా! మీదర్శనభాగ్య మీ జన్మకు లేదా? రక్తసిక్తమయి భయంకరమగు మీ శిరస్సే నాకు గతియా? [శిరస్సు చేతఁబుచ్చుకొని] అయ్యో! ఆర్యపుత్ర! ఈశ్వరాంశ సంభూతుఁడవే, అధిక తపశ్శాలివే, మహాబల సంపన్నుఁడవే, లోకైకవీరుఁడవే, నీ కప్పుడే ఆయువు మూఁడ వలసి వచ్చెనా. అయ్యో! మహాసత్వసంపన్నుని నిన్నెందుఁ జూతును. నే నెందుఁజొత్తును. అయ్యో! నన్ను రక్షించువా రెవ్వరు కానరారైరే? హా, హా, హతవిధీ! హతవిధీ! బృంద నింతటి నిర్భాగ్యురాలినిఁ జేయుదువని కలనైనఁ దలంపకుంటినే? ఏమి సేయుదును? [అని దుఃఖించుచుండును]

[పార్వతీ పరమేశ్వరులు, సరస్వతీ బ్రహ్మలు. లక్ష్మి, నార దుఁడు మొదలగువారు వత్తురు.]

[గౌరీ సరస్వతులు సమీపించి యుపచరించుచుందురు.]

లక్ష్మి — అమ్మా? బృందాదేవి! పతిభిక్షు. [అని దోసిలియొగ్గును]

బృంద — [ఆశ్చర్యముతో లక్ష్మినిఁజూచి] తల్లీ! నీకును బతిభిక్షయా?

నారద — అవును.

బృంద — [ఆశ్చర్యముతో నందఱను జూచి పాషాణమును జూచి] హా లోకనాథా! లక్ష్మివల్లభా. [అని లక్ష్మిపై మూర్ఛిల్లును.]

త్రిశక్తులు — [ఉపచరింతురు.]

గౌరి — అమ్మా ఊరడిల్లుము.

బృంద — [కన్నులు తెఱచి] అయ్యో! దుఃఖావేశమున నొడలు తెలి యక సంచరించితినే! దేవదేవుఁడగు విష్ణుదేవునికే యపకృతి గావించితినే? రమాదేవి కీ సంతాప మెట్లు పోఁగలదు. రక్ష కుఁడు లేసి కొఱంత లోకముల కెట్లు తీరఁగలదు. త్రిశక్తులారా! మహేశ్వరాదులారా! నేను లోకనాథునియెడఁ జేసిన యప రాధమును మీరందఱు మన్నింపుఁడు. నన్నుఁ గరుణింపుఁడు.

శంకరు — సాధ్వీశిరోమణీ! బృందాదేవి! ఇందు నీదోష మేమియు

లేదు. తప్పు సైరించి లోకరక్షణ కొఱకు విష్ణుదేవునకు నిజ రూప మనుగ్రహింపుము.

బృంద—ఈశ్వర సంకల్పము నన్యధాకరింప నెవరితరము? అపునరావృత్తమై యానందమయ మగు పరమేశ్వర సాయుజ్యముం గన్న పతికై యింక దురపిల్లిన ప్రయోజనము లేదు. దైవాపరాధ దూషితమైన యీ దేహముతో విష్ణుదేవుని దర్శింపనేరను. సహగమనము సతీధర్మము. పతిశిరముతో ఆ ధర్మమును నేను నిర్వర్తించిన పిమ్మట, విష్ణుదేవుఁడు నిజరూపమున విరాజిల్లఁగలఁడు. సరళా! సరళా! చితి సిద్ధము చేయింపుము.

సరళ—చిత్తము [నిష్క్రమించును]

శంక—బృందాదేవీ! నీ యుచితజ్ఞత, నీ ధర్మదీక్ష, అసమానములు. విష్ణువునకు శాపవిమోచన మొసంగి మాయెడఁ జూపిన యాదర మమేయము. ఇట్టి నిన్ననుగ్రహించుట మా కుచితము. కోరుకొమ్మిచ్చెద. వరము కోరుకొనుము.

బృంద—మీ యనుగ్రహమున కెంతయు సంతసించుచున్నాను. దేవా! ఎంత యోర్పు చెందుద మనుకొన్నను పతివియోగము నన్నవశను జేయుచున్నది. ఇట్టి సంసృతిబంధముల నుండి నన్నుద్ధరించి నిత్య నిరతిశయానంద సామ్రాజ్యము నందింపఁజేయ వేఁడుచున్నాను. [అని ప్రణమిల్లును.]

శంక—బృందాదేవీ! నేను నిమిత్తమాత్రము. నీ సౌశీల్యము, నీధర్మదీక్షయే నిన్నుఁ గృతకృత్యను జేసినవి. రమ్మ, ఇటురమ్మ. [అని యేవియో చెప్పుట నభినయించును.]

బృంద—[కనులు దెఱచి యాశ్చర్యముతోఁ జూచి] దేవదేవా! మీ యనుగ్రహవిశేషమునఁ హృదయ యవనిక తొలఁగినది పరిచ్ఛిన్నమగు దేహాత్మ భ్రాంతి వదలినది. వామనుని విశ్వరూపమువలె అపరిచ్ఛిన్నమగు విజ్ఞానరూపమే యంతట నిండి నిబిడీకృతమై వెలుంగుచున్నది. మీ రెల్లరు ఆత్మమూర్తులు. లోకదృష్టి కలవారి కాధికారికరూపముగఁ గానంబడు మీకు భేదము లేదు. అభేద మగు మీ యాత్మయే నాయాత్మనుగాఁ జేసి

నన్ను ధన్యురాలినిఁ జేసిన మీకుఁ బునః పునఃప్రణామములాచరించుచున్నాను. లోకానుగుణ మగు శాస్త్రీయమార్గమున నింక నే శరీరమును వదలెద. నా కనుజ్ఞ యిండు. [అని నమస్కరించును.]

బ్రహ్మ—బృందాదేవీ ! నీ సుకృత మమేయ మగుటచే దేవదేవుని యనుగ్రహమునకుఁ బాత్రురాలవై తత్త్వమూర్తివైతివి. నీ కింకఁ గొదువలేదు. నీ శరీర మతిపవిత్రమైనది? అయ్యది వ్యర్థము కాఁజాలదు. ఇప్పుడే వృక్షరూపమునఁ బుట్టి తులసీనామమున సుప్రసిద్ధమై విష్ణుకళతోఁ గూడి పతివ్రతామతల్లుల కిష్టదేవతయై విరాజిల్లఁగలదు.

గౌరి—తులసీవృక్షమునందు నా కళ నుంచెదను. తులసినిఁ బూజించినవారు నన్నుఁ బూజించిన ఫల మందఁగలరు.

లక్ష్మి—తులసియందు నా యంశ నుంచెద. దానినిఁ బూజించినవారు నన్నుఁ బూజించిన ఫలము నందఁగలరు.

సరస్వతి—తులసియందు నా తేజము నుంచెదను. ఆ యోషధిని సేవించిన నన్ను సేవించిన ఫలము వచ్చును.

సరళ—[విచారముతో] అమ్మా ! చితి సిద్ధము చేయించితిని. నా కే దారిఁ జూపి చనియెదవు ?

గౌరి—సరళా ! మహా పతివ్రతను సేవించిన ధన్యురాలవు. నిన్ను నా లోకమునకుఁ గొనిపోయెదను.

బృంద—త్రిశక్తులారా ! దేవోత్తములారా ! మీ యెల్లర యనుగ్రహమునకుఁ బాత్రురాల నైతిని. మిగుల ధన్యను. నే నింక నా పతి శిరముతో సహగమన మొనరించెద. [పతిశిరము పట్టుకొని] నాథా ! నాథా ! నే నెన్నఁడెఱుఁగని నీ శరీరైక్య మీనాఁడు లభింపఁజేసితివా ? ఏమి నా భాగ్యము?

గీ. పరిణయంబైన పిమ్మటఁ ♦ బ్రాణనాథ
నీదు సరసను గూర్చుండి నే♦నెఱుంగ
దొరకె నిప్పుడు తరుణ మీ♦ శిరముతోడఁ
జితిఁ జెలంగెదఁ బూసెజ్జఁ ♦ జెలఁగినట్లు.

శీర్షమా! రమ్ము! నా వక్షఃపర్యంకము నధివసింపుము. నా శీర్ష సింహాసనము నధిష్ఠింపుము' [అని యెద నదుముకొని] నాథా! నీ వెంత మోహనాకారుఁడవు. ఎంతటి యానందమూర్తివి.

గీ. అవయవంబెద్దియైన న ♦ న్నంటినపుడు
ఒడలుమఱచిన సంతోష ♦ మొందియుంటి
నుత్తమోత్తమమైన ♦ నీ ♦ యుత్తమాంగ
మబ్బె నిఁక నిస్తులానంద ♦ మనుభవింతు.

[తెరలో] బృందాదేవీ! చితి సిద్ధమైనది.

బృంద—ఇదిగో వచ్చుచున్నాను. [అని యావల కేఁగును.]

నార—అదిగో! మహాసాధ్వి చితికిఁ బ్రదక్షిణముచేసి భర్తృసహాగమన మొనరించుచున్నది. చల్లుఁడు,పుష్పాక్షతలు చల్లుఁడు. కరతాళ ధ్వనులు చేయుఁడు. [అని అందఱు పుష్పాక్షతలు చల్లుచుఁ జప్పటులు కొట్టుదురు.]

పార్వతి—అద్భుతము, అద్భుతము. బృందాదేవి శరీరమునుండి మఁట లెగయుచున్నను, ముఖము మందహాసాంచితమై యున్నది.

లక్ష్మి—ఔరా! ఆ మహాసాధ్వి పతి శిరముఁ బట్టుకొని యెంతనిశ్చలముగఁ గూర్చున్నది?

సరస్వతి—అయ్యో! బృందాదేవి నిమిషమాత్రమున భస్మరాశియైనదే!

బ్రహ్మ—[కలశోదకముఁ జల్లును.]

పార్వతి—ఆశ్చర్యము, ఆశ్చర్యము. ఎంతలో ఆ భస్మరాశి తులసియై జనించినది.

మ. తలకట్టుంబలె వెల్గె సాధ్వులకు బృం♦దాదేవి, పున్నెంబునన్
దులసీవృక్షముగా జనించినది, యెం♦దున్ సాటిలే దీమె కీ
తులసిన్ నిత్యముఁ గొల్చువారలకు సం♦తోషంబు సౌభాగ్యముల్
గలుగున్ శ్రేయము లాయురున్నతులు సౌ♦ఖ్యం బబ్బు నిక్కంబుగన్.

విష్ణు—[పాషాణము నుండి లేచి] బృందా! బృందా! ఎందుఁబోయితివి? నీ భక్తి యసమానము. నిన్ను వదలఁజాలను? [అని లోనికిఁ

బోయి తులసీవృక్షమును దెచ్చును.] తులసీవృక్షరూపమున విరాజిల్లు నో బృందాదేవీ ! నీవు పరమ పవిత్రవు ? నీ చరిత్ర మతిపవిత్రము. నిన్ను విడువనేరను.

ఉ. నీ దళముల్ మనోజ్ఞములు ♦ నిత్యము హారముగా ధరింతు, నీ
వే దరినుందు వచ్చుటనె ♦ నే వసియింతును, నిన్ను నిల్పినన్,
బాదజలంబు లానినను ♦ భవ్యభవద్దళముల్ ధరించినన్,
బాదున నీరువోసిన శుభంబొాలయున్, బొలియున్ మహాఘముల్.

[అని యాదరము సూపును]

పార్వ—లక్ష్మీ సరస్వతులారా ! విష్ణుసమేతయైన తులసికిం బ్రదక్షిణ మొనరించి నమస్కరింతము రండు. [అని ప్రదక్షిణ నమస్కారములు చేయుదురు.]

అందఱు—[తులసికి నమస్కరించి తులసీదళముల గ్రహించి కనుల కద్దుకొందురు.]

విష్ణు—తులసీ దేవీ ! నీ చరిత్ర మతిపవిత్రము ? త్రిభువనవంద్యవు ! కడుంగడు ధన్యవు !

గీ. చేరి కని మ్రొక్కి తమిఁ బ్రదక్షిణము సేసి
సతము భజియించువారి వాంఛలను దీర్చి
జగమున వెలుంగుచుండుము ♦ సర్వదిశలఁ
దుల యొకింతయు లేక, యో ♦ తులసి దేవి !

[అని కనుల కద్దుకొని క్రింద నుంచును.]

భరతవాక్యము.

గీ. భరత భూకాంత కతులితాభరణ మగుచుఁ
నిఖల లోక సతీ వాంఛనీయ మగుచుఁ
బఱఁగు సాధ్వీత్వ మెల్లెడఁ ♦ బ్రబలుఁ గాత
ధరణి జనులకు శుభములు ♦ వఱలుఁ గాత !

మంగళం మహత్.

ఇయ్యది శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి విరచిత మగు బృందా నాటకము సంపూర్ణము.

